# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

## మే 'చతుర' నవల 'ఏడడుగులు'

సమీక్షకుని పేరు : ..........................................................

చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

..........................................................

# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# 'శకుని' పై చతుర సమీక్షలు



మార్చి 'చతుర'లో ప్రచురితమైన వై.సి.పి. వెంకటరెడ్డి నవల 'శకుని'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## ఆలోచింపజేసింది

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

"ధనం మూలం ఇదమ్ జగత్" అన్న నానుడిని అక్షర రూప కల్పనతో శకుని నవలలో చక్కగా నొక్కి చెప్పారు రచయిత వై.సి.పి.వెంకటరెడ్డిగారు. ఆద్యంతం ఈ కథ - సంపాదనాపరుడైన ఒక ఉద్యోగికి తమ తమ కుమార్తెలను కట్టబెట్టడానికి ఆరాటపడే తల్లిదండ్రుల ప్రయత్నాలతోనే నడిచింది.

పెద్దదిక్కు, ఆర్థిక సహకారాలు లేకపోయినా కృషి పట్టుదలలతో విద్యను అభ్యసించి టైలర్ శీనయ్యగా స్థిరపడవలసినవాడు టీచర్ శ్రీనివాసులుగా మారగానే "నన్ను ముట్టవద్దు నామాలకాకి" అన్నట్లుండే బంధువర్గం అంతా నీ వాళ్లమే అంటూ పోటీలుపడి వరుసలు కలుపుకుని మరీ తమ కుమార్తెలను పెళ్లిచేసుకోమని శ్రీనివాసులు చుట్టూ లింగ

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: జగ్‌మోహన్

తిరిగిన వైనం నేటి లోకం తీరును కళ్లకు కట్టినట్లు చూపించింది.

భుజంగం పాత్రద్వారా సోమరిపోతుల, అనుయాయవరుల లక్షణాలెలావుంటాయో చెప్పడానికి రచయిత ప్రయత్నించారేమో అనిపించింది.

బలరామయ్య పాత్రను మధ్యవర్తిత్వం నడిపే చాలామందిలాగే అవకాశవాదిగా, స్వార్థపరుడిగా, ఏ ఎండకా గొడుగు పట్టే మనస్తత్వం గలవాడిగా, చిత్రించారు తన చెల్లి కూతురని కూడా చూడకుండా మేనకోడలి వరుసయైన సౌజన్య మీద అలాంటి ఆడపిల్లలే అయిన శకుంతల - విమలమ్మల మీద అవాకులూ, చవాకులూ రాసిన బలరామయ్య పాత్రలో ఎన్ని దుర్బుద్ధులున్నాయో అన్నీ ప్రయోగింపచేసి శకునిగా అభివర్ణించడం సబబుగానే వుంది.

ట్యూషన్ విద్యార్థినులైన సౌజన్య, శకుంతలలకు టీచరైన శ్రీనివాసుకు మధ్య కేవలం గురుశిష్యురాండ్ర పవిత్ర బాంధవ్యాన్ని మాత్రమే మిగల్చటంవల్ల అది అపవిత్రార్థాలకు దారితీయకుండా ఆలోచింపచేసింది. శ్రీనివాసులుదృష్టిలో వడుటకు అమ్మాయిల తల్లిదండ్రులు శ్రీనివాస్ స్నేహితుడైన రామలింగాన్ని ఉపయోగించుకొన్న తీరు సహేతుకంగా వుంది. అయితే సౌజన్య, శకుంతల, బలరామయ్య చుట్టంతాలూకూ పెళ్లికూతురు... వీళ్లపట్ల తన అభిప్రాయాన్ని త్వరగా చెప్పకుండా నాన్చి, నాన్చి శ్రీనివాసులు పాత్ర ద్వారా కథను మరింత సాగదీయడానికి రచయిత ప్రయత్నించినట్లనిపించింది.

హైస్కూలులో ఇన్స్పెక్షన్ జరిగిన విధానం, స్కూలు వాతావరణం, విద్యార్థుల నడవడిక ట్యూషన్ మాస్టారి ఒడింబడికలాంటి సంఘటనలు చదువుతూంటే మేము ఎప్పుడో చదివి విడిచి పెట్టిన హైస్కూలు జీవితం గుర్తుకు వచ్చి లీనమయిపోయేటట్లు చదివింపచేసింది. కథ చెప్పేతీరు, భాష, శైలి, మధ్య మధ్యలో సామెతల సమ్మేళనం బాగున్నాయి. గత చరిత్ర ఆధారంగా గుచ్చిగుచ్చి చూసే సమాజానికి సమాధానం చెప్పుకొనేలాగ, విమలమ్మకు శ్రీనివాస్‌తో పెళ్లి జరిగినట్లు ముగించారు కాబట్టి ముగింపు కూడా బాగానే వుంది.

—బడబాగ్ని అరుణకుమారి,
గజపతినగరం.

## కష్టేఫలే...

(ద్వితీయబహుమతి రూ.75/- పొందిన సమీక్ష)

మార్చి నెల చతుర నవల 'శకుని' నేటి సమాజంలో వున్న సంకుచిత మనస్తత్వాలను ముఖ్యంగా బలరామయ్య లాంటి మేకవన్నెపులుల వల్ల కలిగే అనర్థాలను వివరించింది. వివిధ హిందీ కవుల మహితాత్మ సూక్తులూ, ప్రబోధనలూ తెలియజేయటం తెలుగు నవలలో ఒక మంచి ప్రయోగం.

కథానాయకుడు శ్రీనివాసులు వంటివారు ప్రస్తుత వ్యవస్థలో చాలా అరుదుగానైనా కనబడటం కష్టం. సుబ్బయ్య, లింగరాజు వంటివారు ఒకప్పుడు చిన్న చూపు చూసినా పేరు తెచ్చుకున్నాక ఆ శ్రీనివాసులునే తమ అల్లుడిగా చేసుకోవాలని తాపత్రయ పడటం ఎంతటి దుర్గుణవంతులైనా స్వంత అల్లుడి విషయం వచ్చేసరికి చాలా గుణవంతుణ్ణే కోరతారని తెలియచేస్తుంది. ప్రకాశం వంటి టీచర్ల తమ పబ్బం గడుపుకోవడానికి ఇతరుల్ని చిన్నచూపు చూడటానికి ఎంతకైనా తెగిస్తారని తెలియజేస్తూనే ఇటువంటి వారు ట్యూషన్లు పేరుతో సైడు బిజినెస్సు నిర్వహిస్తూ తన దగ్గరే ప్రైవేటులో చేరాలనిఆత్రపడటం నేటి టీచర్ల పోటీ మనస్తత్వం అనే మేడిపండును విప్పిచూపింది. విద్యార్థులనుంచి దొంగిలించిన డబ్బు తిరిగి రాబట్టడంలో శ్రీనివాసులు సమయస్ఫూర్తిని చక్కగా చిత్రీకరించారు. చివర్లో శ్రీనివాసులును విమలమ్మలను కలపడం ఏ గూటిపక్షులు ఆ గూటికే చేరతాయన్న సూక్తిని నిజంచేశాయి.

శ్రీనివాసులు తన దగ్గరకు ట్యూషన్ కోసం వచ్చే సౌజన్య శకుంతలలు తనకంటే మూడు, నాలుగు సంవత్సరాలు మాత్రమే చిన్నవారయినా వారిని అమ్మ అమ్మా అని సంబోధించడం సహజంగాలేదు. రచయిత శైలి సాఫీగా సాగింది. ఇంకొంచెం జాగ్రత్తగనక

తీసుకుంటే ఈ రచయితనుంచి ఇంకా మంచి రచనలు ఆశించవచ్చు.

–జి.ఎం.వి.రత్నాజీబాబు,
పాలకొల్లు.

## గోముఖ వ్యాఘ్రాలకు చురక

*(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

కష్టాల్లో చీదరించి, మంచిస్థితిలో వున్నప్పుడు, బెల్లం చుట్టూ చేరే ఈగల్లాంటి వ్యక్తులకు, వై.సి.పి. వెంకటరెడ్డిగారి 'శకుని' నవల ఓ చురక. పల్లెటూళ్లలోని హైస్కూలు వాతావరణం, టీచర్ల స్వభావాలు మొదలైనవి చక్కగా వర్ణించారు రచయిత.

అయితే కొన్ని లోపాలు లేకపోలేదు. పాత్ర చిత్రణలోగానీ, శైలిలోగానీ ఏమాత్రం పటుత్వం కన్పించలేదు. శ్రీనివాసులుకు, అతని స్టూడెంట్స్‌కుమధ్య జరిగిన సంభాషణల్లో సహజత్వం లోపించింది. ట్యూషన్ చెప్పడంలో, హిందీ దోహాలు, హిందీ భాషగురించిన వర్ణనలు వృథాప్రసంగాలే కాక, పానకంలో పుడకలలా అనిపిస్తాయి. శ్రీనివాసులు సొంతంగా స్వయంకృషితో చదివి పైకొచ్చాడన్న సంగతిని, అతని వ్యక్తిత్వాన్ని చెప్పటంలో చీప్‌గా ఎలివేట్ చెయ్యడానికి ప్రయత్నించారు రచయిత. ఉదాహరణకు, సిన్మాలో పాట ఎవరు రాశారు, పాడారు అన్న విషయం చెప్పినందుకు అతన్ని అభినందించటం, విమలమ్మ కాఫీ మానేయమని చెప్పగానే, మానేయటంలాంటివి ఎబ్బెట్టుగా అనిపిస్తాయి. అలాగే ఓ రాత్రిపూట శ్రీనివాసులు, విమలమ్మ ఇంటికి వచ్చి ఆమె గురించి అడగడం, అతని పాత్రకు అనౌచిత్యంగా, అసహజంగా వుంది. ఇంకో అర్థంకాని విషయమేమిటంటే - శ్రీనివాసులు, శకుంతల మధ్య జరిగిన సంభాషణను రామలింగం రికార్డ్ చేయటం; ఒక టీచర్‌కు, స్టూడెంట్‌కు మధ్య జరిగిన సంభాషణను రికార్డ్ చేయాల్సిన అవసరం ఏమిటి? పైగా ఆ కాసెట్‌ను ఎవరికీ విన్పించొద్దని చెప్పడం చాలా హాస్యాస్పదంగా వుంది. ఈ లోపాలను అధిగమించి వుంటే నవల మరింతగా రాణించేది. ముగింపు బాగుంది. ముఖంమీద నవ్వుతూ మాట్లాడి, వెనక గోతులు తీసే 'గోముఖ వ్యాఘ్రం''అభినవ శకుని' అనదగ్గ బలరామయ్యలాంటివాళ్లకు ఈ నవల మంచి గుణపాఠం.

— యం. అహల్య
హైదరాబాదు.

## పల్లెల్లో కూడానా...?

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

''మీకు తెలుసా'' అంటూ ప్రారంభించిన నవల తెలుసుకోవలసిన విషయాలనెన్నిటినో తెలియపరచింది. ఓమాదిరి టౌన్లలో పల్లె, పట్నమూ కాని చోట్ల మనుషుల ప్రవర్తన, మాట తీరు, - మధ్యతరగతి జీవనవిధానం, ఆడపిల్లల మనసుల్లో పెరిగి పెద్దయి ఊడలు వేసే అమాయకత్వం - ఇలా రకరకాల మనస్తత్వాలు ఏర్చి, కూర్చిన నవల 'శకుని'.

పనికివస్తారనిపిస్తే పదిసార్లు పలకరించటం, లేనిపోని ఆప్యాయతలు ఒలకబొయ్యటం - చుట్టరికాలను తిరగదోడటం చక్కగా చిత్రీకరించారు. బలరామయ్య విషయంలో సంజీవయ్య, దామోదరయ్యల ప్రవర్తన సహజంగా వుంది. స్కూల్ వాతావరణం - టీచర్ల వ్యాఖ్యానాలు - ఒకరిపై ఒకరి కామెంట్స్ అంత సమంజసంగా లేకపోయినా చదువుకుని సంస్కారంలేని వ్యక్తిత్వాలను ప్రతిఫలింపజేయటంలో రచయిత సఫలమైనాడనే చెప్పవచ్చు. ఊరుకు కేంద్రబిందువు లాంటి రచ్చబండను వాస్తవికంగానే చిత్రీకరించటం జరిగింది.

అయితే మొత్తంమీద నవల బాగున్నా అక్కడక్కడ కథకు సంబంధంలేని విషయాలను వివరించటం జరిగింది. 'స్పాట్‌వాల్యుయేషన్' ప్రస్తావన పూర్తిగా అసంబద్ధంగా వుంది. కథను సాగదియ్యటంవల్ల పాఠకుల ఉత్సుకత దెబ్బతినేలా వుంది. ఆసక్తికరంగా ఆరంభమైన నవల త్వరలోనే కొంచెం విసుగు కలిగించే స్థాయికి దిగజారింది. పాఠకులను ఆకట్టుకోగలిగే స్థాయికి చేర్చివుంటే ఇంకా గొప్ప నవలగా ప్రశంసలు అందుకోగలిగివుండేది. ఏమైనా మొత్తానికి వైవిధ్యంగల కథను

రంగుల చిత్రంలా చూపగలిగిన రచయిత ప్రతిభను మెచ్చుకోవలసిందే.

–స్వాతి,
హైదరాబాదు.

## వాస్తవానికి అద్దం

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**వై**.సి.పి.వెంకటరెడ్డిగారి నవల శకుని నేటి తుప్పుపట్టిన పల్లెటూరి వాతావరణపై సంధించిన బాణంలావుంది. అవకాశవాదులు, స్వార్థపరులు, శకుని లాంటి బలరామయ్యలు నేడు కోకొల్లలు. అమాయక ఆడపిల్లల జీవితాలకు మచ్చుతెచ్చే విధంగా ఆకాశరామన్న ఉత్తరాలు సృష్టించి, మళ్లీ ఆ ఆడపిల్లల తండ్రులతోనే బంధుత్వాలు కలుపుకొని వెనక గోతులు తీసే రకాలు చివరకు పట్టుబడితే పట్నాలలో వలే ఊరుకోరనీ పల్లెటూర్లలో జనం తగిన శాస్తి చేసిగాని ఒదలిపెట్టరనీ నిరూపించిందీ నవల.

ఏ మనిషికైనా పైకి రావాలంటే తగిన కృషి అవసరం. కృషి వుంటే మనుమలు రుమలవుతారనే నానుడి అక్షరాలా నిజం. ఏ చదువులూ చదువుకోక, దర్జీ పని మాత్రం నేర్చిన శ్రీనివాసులు కష్టపడి హిందీ నేర్చుకొని హైస్కూల్లో హిందీ టీచర్ స్థాయికి ఎదగడం మెచ్చుకోతగ్గది. శ్రీనివాసులు శకుంతల, సౌజన్యలకు హిందీ దోహాలు విడమర్చి చెప్పడం, కామాయిని గొప్పతనం గురించి వర్ణించడం బాగుంది. హిందీ సాహిత్యంతో పరిచయం లేనివారికి హిందీ పై అభిమానం పెరిగేట్లుగా చేశారు. తల్లిదండ్రులు చిన్నతనంలోనే చనిపోతే దర్జీగా జీవితం సాగించే శ్రీనివాసులును హీనంగా చూసి అవమానపరిచినవారే, అతడు చదువుకొని ప్రయోజకుడైతే బెల్లం చుట్టూ ఈగలు చేరినట్టు తమ కూతుళ్లను కట్టబెట్టడానికి ఎలా తాపత్రయపడతారో చాలా చక్కగా వివరించారు రచయిత.

చివర్లో శ్రీనివాసులు శకుంతలను పెళ్లి చేసుకుంటాడనుకున్న వాళ్లను ఆశాభంగం కలిగించారు. మొత్తం మీద నవల వాస్తవానికి అద్దం పట్టినట్లుగావుంది.

–రాగతి రమ,
విశాఖపట్నం.

## దర్పణం

*(రూ.25/- బహుమతి పొందిన సమీక్ష)*

**ప**ల్లెటూర్లు ప్రశాంతతకు నిలయాలని ఇప్పటికీ మనం నమ్ముతున్నాం. అలాంటి పల్లెటూర్లు కూడా బలరామయ్యలాంటి శకుని వలన ఎలా అగ్ని గుండాలుగా మారతాయో శకుని నవల ద్వారా రచయిత చక్కగా వివరించారు. పల్లెటూరు వాతావరణాన్నీ అక్కడి ప్రజల మనస్తత్వాన్నీ ఈ నవల దర్పణం పట్టింది. సభ్య సమాజంలో మర్యాదస్థులుగా చలామణీ అవుతున్న లింగరాజులాంటి వాళ్లు పన్నే వ్యూహ ప్రతి వ్యూహాలకు శ్రీనివాసులు లాంటి మంచి వ్యక్తులు ఎలా ఎర అవుతారో కూడా తెలుసుకోవచ్చు.

అన్నిరకాల ప్రతికూల పరిస్థితుల్నీ ఎదుర్కొని ఓర్మి, పట్టుదలతో ఒంటరిగానే ఒక గౌరవనీయ స్థానం పొందగలిగిన శ్రీనివాసులు లాంటి వారు ఈనాటి యువతరానికి ఆదర్శప్రాయమని చెప్పకతప్పదు. అతనినుంచి నేటి యువతరం నేర్చుకోవాల్సింది ఎంతో ఉంది. అన్నిరకాల ప్రలోభాలనూ అధిగమించి తనదైన వ్యక్తిత్వాన్ని నిరూపించుకున్న స్థితప్రజ్ఞుడు అతను. వాస్తవాన్ని గ్రహించే నేర్పూ, ఇతరుల కష్టాల పట్ల సానుభూతి చూపగల సహృదయం వుండటంవల్లనే విమలమ్మ జీవితంలోని విషాదాన్ని తెలుసుకోవాలనుకున్నాడు. తమ తప్పేమీ లేకపోయినా విమలమ్మలా జీవితంలో దగా పడ్డవారూ నష్టపోయినవారు మన సమాజంలో కోకొల్లలుగా ఉన్నారు. అలాంటివారికి శ్రీనివాసులులా చేయూత నివ్వటం ఎంతైనా అవసరం.

ఆనాటి భారతంలో శకుని జీవితం ఎలా పరి సమాప్తమయిందీ మనందరికీ తెలుసు. ఏ కాలంలోనైనా శకునిలాంటి వారికి చివరకు ఎలాంటి పరాభవం ఎదువుతుందో ఈ నవల హెచ్చరిస్తున్నది.

–సూర్యదేవర జోగేశ్వరరావు,
వేగేశ్వరపురం.



## చేసుకున్నవాడికి...

పాతికేళ్లన్నా దాటకుండానే బట్టతల వచ్చేస్తున్నదేమా అని పరమేశానికి పుట్టెడు దిగులు పట్టుకొంది. తన తోటివాళ్లంతా హిప్పీ కటింగ్ లూ, స్టెప్ కటింగ్‌లూ చేయించుకుంటుంటే తన 'ఖర్మ' ఇలా కాలిందేంట్రా నాయనా అని వాపోతున్నాడతను. నలుగురిలోకి రావాలంటే సిగ్గు పైగా రైళ్లల్లోనూ, బస్సుల్లోనూ అతని కంటే పెద్దవాళ్లు కూడా, ''అంకుల్! కొంచెం జరుగుతారా?'' అనో లేక ''అంకుల్! టైం ఎంత?'' అనో అడుగుతుంటే పుండుమీద కారం జల్లినట్లుగా ఉంటున్నదతనికి. అంతేకాదు-

బ్రహ్మచారి అయిన పరమేశం తన వయస్సు కుర్రాళ్లకుమల్లే అమ్మాయిలవంక ఆబగా చూస్తుంటే వాళ్లంతా అతన్ని అతని 'ఓపెన్ టాప్'ని చూసి, ''ఈ ముసలాడికి కూడా ఇదేం రోగం?'' అనో, ''తలలు బోడులైన తలపులు బోడులా?'' అనో కామెంట్స్ చేస్తూ నవ్వుకోవడం విని సిగ్గుతో చితికిపోయేవాడతను.

పుట్టెడు దిగులుతోనూ, న్యూనతాభావంతోనూ చిక్కి సగమైపోతున్న పరమేశాన్ని చూసి బంధుమిత్రులందరూ తలా ఒక ఉచితసలహా ఇచ్చారు. వాటి ప్రకారం ఆ తల నూనెలన్నీ తెప్పించి వాడాడు పరమేశం. అయినా ఫలితం శూన్యం. పైగా మరింత ఉధృతంగా ఊడిపోసాగాయి వెంట్రుకలు. దాంతో మరింత దిగులు పడిపోయాడు మనవాడు. నలుగురిలోకీ రావడం మానేసి ఇంట్లో కూర్చోడం మొదలెట్టాడు.

ఓనాడు పట్నంలో మెడిసిన్ చదువుతున్న అతని మిత్రుడు గంగాధరం వచ్చి పరమేశాన్ని కలిశాడు. పరమేశం తన గోడంతా అతని ముందు వెళ్లబోసుకున్నాడు. మిత్రుడి బాధ, ఆత్మ న్యూనతాభావం గంగాధరాన్ని కదిలించివేశాయి.

మర్నాడే ఓ మందు సీసా తెచ్చి, ఈ ఆయిల్ ఒక్క బోటిల్ వాడితే చాలు! గుణం తప్పకుండా కన్పించి తీరుతుంది! ఈ దెబ్బతో నీ దిగులు గిగులు ఠపీమని మాయ

మైపోతాయి'' అని మిత్రుడికి చెప్పి వెళ్లిపోయాడతను. పరమానందంతో దాన్ని తలకురాసుకున్నాడు పరమేశం. అన్నిమందుల్లాగే దానివల్ల కూడా ప్రయోజనం కన్పించలేదు. పైగా మరింత జుట్టు రాలిపోయింది. కంగారు పడుతూ సీసా తీసుకొని మిత్రుడి దగ్గరకి పరుగెత్తాడు పరమేశం.

''అరే... చెప్పడం మరిచాను! ఆ మందు నువ్వు కాదు రాసుకోవల్సింది. మీ చుట్టుపక్కల వాళ్లు, మిత్రులు, చుట్టపక్కాలు...'' అన్నాడు గంగాధరం.

''అదేమిటి?'' ఆశ్చర్యపోయాడు పరమేశం.

''అవును... వాళ్లెవరూ గమనించకుండా ఆ సీసాలోని మందును ఒక్కొక్కడి తల మీద ఒక్కో డ్రాప్ వెయ్... నెల తిరిగే నరికల్లా వాళ్లందరికీ బట్టతల వచ్చేస్తుంది. అందరికీ బట్టతల ఉన్నప్పుడు ప్రత్యేకించి నువ్వొక్కడివే బాధపడాల్సిన అవసరంలేదుకదా? దెబ్బతో నీ ఆత్మన్యూనతా భావం పరార్...'' అని చెప్పి పకపకనవ్వాడు గంగాధరం.



వెంటనే గంగాధరం నెత్తిన ఓ డ్రాప్ ఆయిల్ చిలకరించి ఆనందంతో బయటికి పరుగుతీశాడు పరమేశం.

గంగాధరం మాత్రం ఊహించని ఈ పరిణామానికి చేసేదేం లేక కుప్పకూలిపోయాడు.

— ప్రతాపచంద్ర

## ఖరీదైన మనిషి

"మన పక్కింట్లో ఎవరో కొత్త దంపతులు అద్దెకు దిగినట్టుందండీ. మాటలు వినిపిస్తున్నాయి. ఇందాకే సామాను దించుతుంటే ఎక్కడికోననుకున్నాను. మన పక్కింట్లోనే" అన్నది శ్యామల భర్త ఇంటికి రాగానే.

"అహా, అలాగా" అన్నాడు రామారావు- ఆ విషయానికేం ప్రాముఖ్యతనివ్వకుండా.

మర్నాడు శ్యామల మరోవార్త చెప్పింది- "ఏమండోయ్ మన పక్కింట్లో దిగినవాళ్ళకి టీ.వీ. వున్నదండీ. ఇందాకా యాంటిన్నా డాబా మీద బిగిస్తూంటే చూశాను" అన్నది.

"ఓహో... అలాగా" అన్నాడు రామారావు.

మూడోనాడు శ్యామల ఇంకోవార్త వేసింది రామారావు చెవిలో- "చూశారా... మన పక్కింట్లో దిగినవాళ్ళకు ఫ్రిజ్ వున్నదండీ" అని.

"ఉహూ, అలాగా" అన్నాడు రామారావు.

ఆ తర్వాత పక్కింటివాళ్ళకున్న గ్యాస్, గ్రైండర్, డ్రెస్సింగ్‌టేబిల్, గాడ్రెజ్‌బీరువాలు, సోఫాసెట్టు ఇవన్నీ భార్య కళ్ళతో చూసేశాడు రామారావు. అత్యాధునికమైన ఫర్నిచర్, సామానుతోబాటు స్కూటర్, పక్కింటామె ఒంటినిండా సందులేకుండా బంగారు ఆభరణాలు కూడా వున్న విషయం రామారావు కెప్పటి కప్పుడు తెల్సిపోయింది.

విని విని భార్యకో ఉచితసలహా ఇచ్చాడు రామారావు. "వాళ్ళకేముంటే మనకేం? ఎవరి తాహతునుబట్టి వాళ్ళు కొనుక్కుంటారు. జీవితాన్ననుభవిస్తారు. మనం అవన్నీ పట్టించుకోకూడదు" అని.

వారంరోజుల తర్వాత శ్యామల చాలా ఆనందంగా చెప్పింది భర్తతో- "పక్కింటి లీలావతిగారితో పరిచయం చేసుకున్నానండీ! చాలా మంచిదండి. అంత ఐశ్వర్యమున్నా కించిత్తు గర్వం కూడా లేదంటే నమ్మండి"

"అలాగా మంచిదే" అన్నాడు రామారావు.

"నిన్న చూపించిందండి ఆమె చీరలు! అబ్బో... ఓ బీరువానిండా పట్టుచీరలే వున్నాయి, పాతికపైగా. రోజూ కట్టే కట్టుడుచీర కూడా రెండువందలకు తక్కువదిలేదు"

రామారావు ఆమె ఆనందానికి అడ్డురాలేదు.

మరోసారి- "ఈరోజు లీలావతిగారు వాళ్ళింట్లో టి.వి. చూడటానికి ఆహ్వానించిందండీ. వెళ్తున్నాను. కాస్త ఆలస్యమవుతుందేమో మీరు పిల్లలు తినెయ్యండి" అని చెబుతూనే పక్కింటికి వెళ్ళిపోయింది శ్యామల.

రామారావు కొద్దిరోజులు ఓపికపట్టాడు. భార్య ధోరణి మార్చాలని చిన్న ఉపన్యాసమిచ్చాడామెకు.

"మనకన్న పైఅంతస్తులో వున్నవాళ్ళతో స్నేహం మంచిదికాదు. మనమెప్పుడూ సమానస్థాయిలో వున్నవాళ్ళతోనో లేదా మనకన్న దిగువనున్నవాళ్ళతోనో స్నేహం చేయటం మంచిది. మన ఎడమవక్క ఇంట్లో వుంటున్న సుశీలవాళ్ళ కుటుంబం మనస్థాయికి సరిపోయేది. ఆమెతో పరిచయం పెంచుకో, సమయానికి సాయపడుతుంది. లీలావతితో ఎక్కువ మూవ్ కావద్దు"

శ్యామల విసుక్కుంది- "సర్లెండి ఆ సుశీలతోనా? ఆమె మాట్లాడిందంటే ఎంతసేపు ఆర్థిక పరమైన ఇబ్బందులు, పొదుపు గురించి జాగ్రత్తలు, పిల్లల రోగాలకు గృహవైద్యం, ఆకుకూరలు- ఆరోగ్యం, ఇవే టాపిక్‌లు బోర్. అదే లీలావతిగారైతే ఎంత ప్రెస్టేజియస్‌గా వుంటుంది? ఆమెవన్నీ ఖరీదైన ఆలోచనలు. ఏంచేసినా భారీగా, హుందాగా చెయ్యాలనుకునే మనస్తత్వం. వాళ్ళింట్లో వంటకో మనిషి, అంట్లకో మనిషి, గుడ్డలుతకటానికో మనిషి,



బయటిపనులకో మనిషి- వాళ్లింటినిండా పని మనుషులే... మహారాణి భోగమనుభవిస్తోంది. జీవితమంటే అలా వుండాలి'' అన్నది.

ఆమె ఉపన్యాసంవిని శోషొచ్చినంతపనైంది రామారావుకి. ఆమెకి నచ్చచెప్పటం అనవసరమనుకున్నాడు.

అయితే....

ఉన్నట్టుండి శ్యామల లీలావతి ఇంటికి వెళ్లడం మానేసింది. అంతకన్న చిత్రమేమిటంటే, సుశీలతో స్నేహం పెంచుకున్నది. ఇద్దరు కలిసి ఇప్పుడు ఖాళీసమయాల్లో ఇంట్లోనే కావలసిన వడియాలు పెట్టడం, అప్పడాలు ఒత్తడం, పిల్లలకి చొక్కాలు, తమకు బ్లౌజులు కుట్టుకోవడం, వగయిరా పనులన్నీ స్వయంగా చేసుకుంటుంటే రామారావుకి చాలా ఆశ్చర్యమనిపించింది. కారణం ఊహించలేకపోయాడు. ఆతర్వాత ఎప్పటికో అసలు విషయం చెప్పింది శ్యామల.

వారం రోజుల క్రితం లీలావతి తన మహిళా మండలి సభ్యులతో మ్యాట్నీషోకి వెళ్తూ, శ్యామలతో- ''సాయంత్రం నాలుగ్గంటలకి కాన్వెంటినించి మా పిల్లలు వస్తారు. వాళ్లని కాస్త రిసీవ్ చేసుకో. కాస్త కాఫీ పెట్టి ఇవ్వు, లేకుంటే అలసిపోతారు. స్నానాలు చేసేలా చూడు. అదేచేత్తో కుక్కర్లో కాస్త అన్నం, పప్పు పడెయ్యి. ఈరోజు కూడబలుక్కున్నట్టు పనిమనుమలందరూ మానేశారు. లేకుంటే నీకు ట్రబులిచ్చేదాన్ని కాదు. ఏమనుకోకు'' అన్నదట.

ఆ తర్వాత మరోమాట అందట- ''అప్పు వసూళ్లకని, చీరల దుకాణంవాడుగాని, టి.వి.వాడుగాని, ఫ్రిజ్‌వాడుగాని రావచ్చు. మేం ఊరెళ్లామనీ నెలదాకా రామనీ చెప్పేం'' అని కూడా సలహా ఇచ్చిందట.

అంతే ఈ వారంరోజులుగా లీలావతితో సంబంధాలు పూర్తిగా తెంచేసుకున్నది శ్యామల.

రామారావు హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. భార్యక్కనిపించకుండా నవ్వుకున్నాడు కూడా.

—బొమ్మిడి అచ్చారావు

“స్వేచ్ఛ, సమానత్వం, సోదరభావం ఫ్రెంచ్ విప్లవంలో వెలువడిన నినాదాలు. ఇవి రాజకీయరంగానికే పరిమితంకాదు. వ్యక్తిగత జీవితంలోనూ వీటి ఉపయోగం ఎంతో వుంది. స్వేచ్ఛ, సమానత్వం, సోదరభావం స్నేహంలో పరిఢవిల్లే లక్షణాలు. పరస్పర అవగాహన, సానుభూతి, ఆత్మీయత, సర్దుబాటు, ఆర్థికంగా ఒకరిపై మరొకరు ఆధారపడకపోవడం, అధిక్యభావన లేక సమానస్థాయిలో మెలగగలగటం అన్నిటికంటే మిన్నగా తమ మిత్రుల స్వాతంత్రాన్నీ స్వేచ్ఛనీ గుర్తించి దానికి భంగం కలుగకుండా మెలగడం ఆదిగా గల లక్షణాలు మైత్రీ కుసుమాన్ని వికసింపచేస్తాయి; స్నేహదీపాన్ని ప్రజ్వలింపచేస్తాయి. స్నేహంలో భావసామీప్యం లేకపోయినా భావనాసామీప్యం వుంటుంది.

పెళ్లి బయోలాజికల్ నీడ్‌కోసం స్త్రీ పురుములు ఏకమయ్యే సంఘటన మాత్రమే కాదు; జీవితాంతంసాగే మైత్రికి నాందివలికే సంఘటన అది. జీవితభాగస్వాములైన దంపతులు స్నేహితుల్లాగా మెలిగితే, ఆ వివాహం విజయవంతమవుతుంది. ఒక్కచేత్తో చప్పట్లు చరచటం సాధ్యంకాదు; రెండు చేతులూ కలిస్తేనే వీలవుతుంది. పెళ్లయింది. చప్పట్ల ఆట మొదలయింది. ఆలుమగలు. స్నేహితుల్లా వుండగలిగినా, లేకున్నా ఆటకొనసాగుతుంది. దంపతులు స్నేహితులయినప్పుడు, ఆ చెమ్మాచెక్కా చేరడేసి మొగ్గలై విరబూస్తుంది. సువాసనలు గుబాళింపచేస్తుంది. దాంపత్య మాధుర్యపు అలౌకిక సంగీతం లయబద్ధమై వినిపిస్తుంది. ఆనందం అర్ణవమవుతుంది. అలాంటి దాంపత్యంలో ఆలుమగల వ్యక్తిత్వం వికసిస్తుంది. అంతేకాదు తాము పండించిన ఆనందాన్ని వాళ్లు దోసిళ్లతో పంచిపెడతారు అందరికీ.

స్నేహలక్షణాల్లో ఏ ఒక్కటైనా, ఏ ఒక్క భాగస్వామిలో కొరవడినా ఆ దాంపత్యపు చప్పట్లు అపశృతులవుతాయి. పొరుగింటి పేరమ్మలు చెవులు కొరుక్కునేందుకు ఆస్కారం కలిగిస్తాయి. అలాఅని ఆటముగించి విడిపోరా దంపతులు. విడాకులు పుచ్చుకోరు. అర్థరహితమయిన జీవితాలు గడుపుతుంటారు. హాయిగా బతకాలన్న ఇచ్ఛాలేక, విడిపోయే తెగింపూ లేక నిస్సారంగా జీవితాన్ని గడుపుతారు. ముఖ్యంగా మన భారతదేశంలో వున్న పరిస్థితి ఇది.

వివాహం విజయవంతమవటానికి- అది పెద్దలు కుదిర్చిన పెళ్లయినా, ప్రేమ వివాహమయినా సూత్రమిదే...''

'ప్రేమ వివాహం' శీర్షికమీద కాలేజీ ఆడిటోరియంలో డిబేటింగ్ కాంపిటీషను జరుగుతోంది. విద్యార్థులు మాట్లాడటం అయిపోయింది. వేదికపై అధ్యక్షత వహించిన లెక్చరరు ముక్తాయింపుమాటలు చెప్తోంది. ఆడిటోరియం వరండాలో నిలబడి ఉపన్యాసం వింటున్న సంధ్య చెళ్లున ఎవరో వీపున చరచటంతో ఉలిక్కిపడి వెనక్కి తిరిగిచూసింది.

“నువ్వా... ఇది వీపనుకున్నావా, డప్పనుకున్నావా మొద్దుమొహవా?'' అంది సంధ్య కోపంగా మీనాక్షివంక చూస్తూ.

“సంతోషించు, చావనందుకు. అంతగా నిమగ్నమయిపోయి వినేందుకామె ఏం చెప్తోంది...?'' అడిగింది మీనాక్షి.

“ప్రేమ వివాహాలపై డిబేటింగ్ కాంపిటీషను. మేడం చక్కగా విషయవిశ్లేషణ చేస్తోంది.''

“ఈ ఉమెన్స్ కాలేజిలో అంతకంటే గొప్ప టాపిక్‌లు ఏం వుంటాయిలే. ఇది కాకపోతే 'వరకట్నపు దురాచారం' లేకపోతే 'స్త్రీలపై అత్యాచారాలు...' ఐ బోర్ దీజ్ టాపిక్స్. ఇంత కంటే స్త్రీ జీవితంలో ఇంకే విషయాలకి ప్రాధాన్యంలేనట్లు, స్త్రీలు ఆ స్థాయికి ఎదగనట్టు... ఛీ, ఛీ...''

“నీ బొందలే. ఇవన్నీ బర్నింగ్ ప్రాబ్లమ్స్ కావాయేం''

“సర్లే పద... వెళ్దాం...''

“ఉండు, మేడం ఉపన్యాసం కానీ, వెళ్దాం...'' అంది సంధ్య.

“ఇంతోటి ఉపన్యాసమేం వినక్కరలేదు... నడువు'' అని మీనాక్షి సంధ్య చెయ్యిపట్టుకులాగింది.

“ఉండవే అయిపోయింది''

“ఉహూఁ వీల్లేదు, నోర్మూసుకుపద'' అని సంధ్య భుజంమీద చెయ్యేసి బలవంతంగా నడిపించింది.

"ఇలా ఇతరుల స్వాతంత్ర్యం హరించటమేం బాగాలేదు" అని సంధ్య ముఖం మాడ్చుకుని ఆమెతో నడవసాగింది. మీనాక్షి తనకిష్టంలేని విషయం ఎవరు చెప్పినా వినదు. అన్ని విషయాల్లో మంచిదే కానీ, తన వాళ్లందరూ తను చెప్పినట్లు నడచుకోవాలనే తత్వం ఆమెది. ఆ సంగతి తెల్సిన సంధ్య ఆమెతో మరేంవాదం పెంచుకోకుండా ఆమె వెంట నడవసాగింది.

వాళ్లిద్దరూ కోఠీ విమెన్స్ కాలేజీలో బి.యస్.సి. ఫైనలియర్ చదువుతున్న విద్యార్థినులు. సంధ్య గ్రూపు ఎం.పి.సి, మీనాక్షిది బి.జడ్.సి. మీనాక్షికి బాటనీ ప్రాక్టికల్సు వుండి ఆలస్యమవటంతో ఆమె కోసం నిరీక్షిస్తూ ఆడిటోరియం వరండాలో నిలబడి వక్తృత్వపోటీ ఉపన్యాసాలు వింటోంది. చిన్నప్పటినుండి వాళ్లు స్నేహితులు. ఒకే స్కూల్లో చదువుతున్నారు. ఒకే కాలేజీలో చేరారు.

సంధ్యకు కోపం వచ్చిందని గ్రహించిన మీనాక్షి అంది.

"కోపమా సంధ్యా! నువ్వన్నది నిజమే. ఇవన్నీ బర్నింగ్ ప్రాబ్లెంసే. కానీ అలాంటి ఉపన్యాసాలు వినటం నాకిష్టముండదు. అందరి సంగతీ నాకు తెలీదు కానీ, నా మట్టుకు నేను తట్టుకోలేను. వాటిని గురించి ఆలోచిస్తే నరాలు చిట్లిపోతున్నంత బాధగా వుంటుంది"

"ఇది నీకున్న మరో జబ్బు. ఏవేవో ఊహించుకుని, నీకు తోచిన కంక్లూజన్స్‌కు నీవు వస్తూవుంటావు. అంత భయంకరమైన సంగతులేం మేడం చెప్పటంలేదు. పైగా చక్కగా విషయవిశ్లేషణ చేస్తోంది" అంది సంధ్య.

"ఇవాళ చెప్పకపోవచ్చు. కానీ ఇలాంటి మీటింగ్‌లలో తరుచూ జరిగేదదే. తీగలాగితే డొంకంతా కదిలినట్టు, కట్నం గురించి మొదలెడితే కట్నంపోయలేక, తగిన వరుడు దొరకక ఎవరో ఒకరికి ముడిపెట్టే సంబంధాలూ, అత్తమామల్ని చెండుకుతినే అల్లుళ్ల భాగోతం, కోడళ్లని జీవనమాధి చేసే అత్తల గొప్పదనం - బాప్రే ... ఇవన్నీ వింటూ శాంతంగా కూర్చోగలవా? అటు నేను చేయగలిగింది లేదు, ఇటు చేసేదేమీ లేదని మౌనంగా సహించలేను" ఆవేశంకంటే బాధ ప్రస్ఫుటమయింది మీనాక్షి గొంతులో.

"అందుకని సమస్యను వదిలేసి పారిపోతానంటావు"

"ఆఁ ... నువ్వు పట్టుకుకూర్చో సాధిద్దువుగానీ. వరకట్న సమస్యకొస్తే ఇచ్చేవాళ్లదే బుద్ధిలేనితనం. వాళ్ళియకపోతే పుచ్చుకునేవాళ్లు ఎక్కడనుండి వస్తారు?" అంది మీనాక్షి.

"ఇంతోటి తెలివి ఎవరికీ లేదండీ పాపం. కట్నం లేకుండా చేసుకోనప్పుడు ఇవ్వకేం చేస్తారు? కూతుళ్లకి పెళ్లిచేయలేకపోతే నిందించేది ఎవర్ని తల్లిదండ్రుల్నేగా..."

"దీనికి పరిష్కారమార్గం ప్రేమ వివాహాలే"

"ఆ విషయమే ఇవాళ డిబేటింగ్‌లో చర్చిస్తున్న విషయం. మేడం మాటలు పూర్తిగా విననీకుండా లాక్కొచ్చావు"

"కొంపేం మునిగిపోలేదులే"

"కానీ నీ పరిష్కారమార్గం నాకంత గొప్పగా ఏం కన్పించటంలేదు. వరకట్న దురాచారమన్నది సాంఘిక సమస్య. ఒకప్పుడు కన్యాశుల్కం, ఇప్పుడు వరకట్నం. దేంట్లో అయినా ప్రధాన పాత్ర వహిస్తున్నది డబ్బేకదా. ఈ సమస్యకు, ఇంకా మరెన్నో సమస్యలకు మూలం ఆర్థికసమస్య. అది పరిష్కారమవకుండా సమాజం మారదు. దీనికి పరిష్కారం ప్రేమ వివాహాలనుకుంటున్నావు కానీ అది సరికాదు. ఆర్థిక స్వాతంత్ర్యం లేనంతవరకూ స్త్రీకి ఏదో రకమైన బాధ తప్పదు"

"నీ ఆర్థిక సిద్ధాంతాలన్నీ తుంగలో దొక్కు. ఆర్థిక సాతంత్ర్యం సాధించినా ఈ పురుషాధిక్యత మాత్రం పోదు. స్త్రీ పురుషులు వేరూ, కాండాల్లాంటివాళ్లు. ఇద్దరూ సమానమే, ఇద్దరూ ప్రధానమే అని గుర్తించి అంతా మసులుకుంటే అసలిన్ని సమస్యలేకపోవును"

"భావనాలోకంలో విహరిస్తున్నావు. ఇద్దరూ సమానమేననే గుర్తింపు ఎప్పుడు వస్తుంది? ఏ ఒకరూ మరొకరిపై ఆర్థికంగా ఆధారపడనప్పుడు. ఇప్పుడింతమంది వెన్నెముక లేని యువకులు ఎందుకు తయారవుతున్నారంటావు? ప్రేమవరకే తమ ప్రతాపమనీ, కట్నం లేకుంటే పెద్దలు ఒప్పుకోరనీ చెప్పి నట్టేట్లో ముంచే నయవంచకులు తయారవుతున్నా

రంటే తప్పెవరిది? వ్యవస్థదే'' అంది సంధ్య.

''నీమొహం కాదు. అసలు తప్పు అలాంటి బడుద్ధాయిల్ని ప్రేమించే అమ్మాయిలది''

''సమస్య సామాజికమే కాని ఆర్థికం కాదంటావు. మరి సమస్య ఎలా పరిష్కారమవుతుందంటావు?''

''మనుషుల మనసుల్లో మార్పొచ్చినప్పుడు. ఈ పెద్దలు మారినప్పుడు. రేపు మా అక్కకి పెళ్ళిచూపులు. 'కట్నమివ్వకండి నాన్నా' అంటే 'ఇదో పిచ్చిమాలోకం' అన్నట్టు నావంక చూశాడు ఆయన. అందరికంటే నా కోపం అంతా మా అక్కమీదే. తనకేం తక్కువ? అనాకారా? అనారోగ్యమా? చదువులేదా? పైగా ఉద్యోగం చేస్తోంది. ఇన్నుండీ తనని చూసినాక తనద్వారా వచ్చేకట్నానికి ఆశపడి పెళ్ళిచేసుకున్నాడంటే తనకి సిగ్గుగా అన్పించవద్దా? ప్రతి ఆడపిల్లా ఇలా ఆలోచించినప్పుడు తనను తానుగా గౌరవించి అభిమానించే పురుషుణ్ణి తానే ఎంచుకున్నప్పుడు కట్నం ప్రసక్తి ఎలా వుంటుంది చెప్పు?'' అంది మీనాక్షి.

''నీ మొహంలే. ఆదర్శాలు, ఆకాంక్షలవల్ల ప్రయోజనంలేదు. సమస్య మూలతత్వాన్ని అర్థంచేసుకోకుండా ఎన్ని సంస్కరణోద్యమాలు బయల్దేరినా ఈ జబ్బుపోదు. ఈ వ్యవస్థలో మనుషులకు లాభం కలిగేటప్పుడు దాన్ని ఎందుకు మానుకుంటారు? మనసునెందుకు మార్చుకుంటారు. అదిసరే ... వాళ్ల సంగతీ వీళ్ల సంగతీ వదలిపెట్టు. నీ సంగతేంటి?'' అంది నవ్వుతూ సంధ్య.

''నేనా ... పెద్దలు కుదిర్చిన పెళ్ళిమాత్రం చస్తే చేసుకోను'' నిశ్చయంగా చెప్పింది మీనాక్షి.

''చూద్దాం ... ఇలా శపథాలు పలికినవాళ్లని చాలామందిని చూశాను. ఇలా బీరాలు పలికిన వాళ్లే చాలామంది తలకాయ వంచి తాళికట్టించుకుని గుట్టుగా కాపురం చేసుకుంటున్నారు మీనమ్మా''

''నోర్ముయ్యవే ... నీ సంగతి అలాగే కనిపిస్తోంది''

''అవును ... ముందుగా నా కాళ్లపై నేను నిలబడే ప్రయత్నం చేస్తాను. పెళ్లికోసం పెద్దవాళ్లని ధిక్కరించే ధైర్యం నాకు లేదు''

''నీ ఖర్మ ... జన్మంతా గాడిదలాగా బతకాలని ముఖాన రాసుంటే ఎవరేం చేయగలరు?''

''మరి నీ మొహాన ఏం రాసుందో?''

''మనసుకు నచ్చినవాడు దొరికితే పెళ్లి లేకపోతే ఈ జీవితం ఇంతే'' అంది మీనాక్షి.

కోఠీ బస్సుస్టాపులో నించుని స్నేహితురాళ్లు వేడివేడిగా వాదించుకుంటూనే వున్నారు. బస్సులొస్తున్నాయి, పోతున్నాయి. స్టాపులో ఆగటం లేదు కొన్ని. కొన్ని ముందుకుపోయి ఆగుతున్నాయి. బస్సు పోగానే ఏడుపు ముఖాలేసుకుని తిరిగి వస్తున్నారు జనం. స్టాపులోనే చేరే మనుషులు ఎక్కువవటంతో మిత్రురాళ్లు వాదించుకోవటం ఆపుచేశారు.

''ఇంత రష్ ఏవిటి బస్సుల్లో? ఈ ఆర్.టి.సి.వాళ్లు ఇంకా నాలుగు బస్సులేస్తే వాళ్ళ సొమ్మేం పోయిందట'' అని విసుక్కుంటున్నాడో ముసలాయన.

''గల్ఫ్‌వార్ జరిగింది కదండీ? డీజిల్ దొరకటం కష్టమయిపోతోంది. మనకింక రెండు కాళ్లే శరణ్యం. ఎద్దుబళ్ళూ, గుర్రబళ్ళూ మళ్లీ తిరిగి అవతరిస్తాయి రోడ్లమీద'' అన్నాడో బట్టతల నడివయస్కుడు.

''ఈ కన్వెన్షనల్ ఎనర్జీ రిసోర్సెస్‌కు స్వస్తిచెప్పి వేరే సాధనాలను కనుక్కోవాలి. సోలార్ ఎనర్జీని తేలిగ్గా టాప్ చేసే విధానాలను కనుక్కోవాలి. ఎక్కువకాలం మనమీ పెట్రోలు, డీజిల్‌మీద ఆధారపడి బతకలేం'' అన్నాడో యువకుడు.

''నేను చిక్కడపల్లి వెళ్లాలి. ఏ బస్సెక్కాలో చెప్తారా కాస్త'' అని అడిగాడు అప్పుడే సూటుకేసు చేతిలో పట్టుకుని వచ్చిన యువకుడు.

''నెంబరు వన్ బస్సులో వెళ్ళండి'' అన్నాడు నడివయస్కుడు.

యువకుడు నిట్టూర్చి బరువుగావున్న సూటుకేసు కిందపెట్టాడు.

''సూటుకేసుల్తో బస్సులెక్కకపోతే ఆటోలో పోరాదూ?'' అన్నాడో ప్రయాణీకుడు.

''ఆటోలోనే వెళ్దామనుకున్నానండీ. కాని

అనుకోని పరిస్థితులు ఎదురొచ్చాయి. బస్సు లోనే వెళ్లాలి'' అన్నాడా యువకుడు.

ఆ అనుకోని పరిస్థితులేమిటో, బస్సులోనే ఎందుకు వెళ్లాలో తెల్సుకునే కుతూహలం ఎవరికీ లేదు. బస్సుకోసం ఎవరి ఆతృతలో వాళ్లున్నారు. ఆ సూటుకేసు యువకుడికి సుమారు పాతికేళ్ల వయసుంటుంది. సన్నగా, పొడుగ్గా వున్నాడు. చొక్కా పాంటులోపల వేసి టక్‌చేశాడు. దూరప్రయాణం చేసిరావటంవల్ల బట్టలు నలిగినట్టున్నాయి. కోలముఖం, నల్లటి మీసాలు. మనిషి తెల్లని తెలుపు.

''బాగానే వున్నాడే ట్రాజిక్ హీరోలా. ఆటోలో పోలేని ఆ అనుకోని పరిస్థితులేమిటో?'' అంది మీనాక్షి సంధ్యతో మెల్లగా.

''హుష్... మనకెందుకు ఇతర్లసంగతి'' అంది సంధ్య.

ఇంతలో నెంబరు వన్ బస్సు వచ్చింది. బస్సు డ్రైవరు కరుణామయుడు. ప్రయాణీకుల్ని రవాణాచేసే నిరంతర కార్యభారాన్ని - సిలువలా మోస్తున్న దయామయుడు. బస్సు స్టాపులోనే బస్సు ఆపాడు. రద్దీగా వున్నా ఎలాగో తోసుకు ఎక్కారు అందరూ.

బస్సు బయలుదేరింది.

''దూరసందులేదు, మెడకో డోలన్నట్టు ఈ సూటుకేసెందుకు తెచ్చావయ్యా. ఆటోలో పోగూడదూ'' అన్నాడు కండక్టరు యువకుడితో.

''ఐయాం సారీ ఫర్‌ది ఇన్‌కన్వీనియన్స్'' అని క్షమార్పణలు చెప్పుకున్నాడు యువకుడు.

''సరేలే పక్కన పెట్టుకో. ఎక్కడికెళ్లాలి?'' అడిగాడు కండక్టరు.

''అశోక్‌నగర్ వెళ్లాలండి. చిక్కడపల్లిలో బస్సుదిగి వెళ్లొచ్చన్నారు'' అన్నాడు యువకుడు.

''చార్మినార్ చౌరస్తాలో దిగు అక్కడికి దగ్గర'' అన్నాడో ప్రయాణీకుడు ఉచితసలహా ఇస్తూ.

''చిక్కడపల్లిలోనే దిగండి అదే దగ్గర'' అన్నాడు కండక్టరు టిక్కెట్టు ఇస్తూ.

రాంకోటిలో ప్రయాణీకులకందరికీ కండక్టరు టిక్కెట్లిచ్చినతర్వాత బస్సు బయలుదేరింది. ''ఏమయ్యా! కళ్లు కనిపించటంలేదా కాళ్లు తొక్కుతున్నావు'' అని దబాయించాడో ప్రయాణీకుడు యువకుణ్ని.

''చూడలేదండీ, సారీ!'' అన్నాడు యువకుడు.

''కాళ్లకు కళ్లు లేవుకదయ్యా! ఎలా చూస్తాడు'' అన్నాడు మరో ప్రయాణీకుడు జోకేస్తూ.

బస్సు చిక్కడపల్లి వచ్చింది. కొంతమంది ప్రయాణీకులు దిగారు. యువకుడు అభిమన్యుడిలా జనపద్మవ్యూహాన్ని చీల్చుకుంటూ సూటుకేసుతో బస్సుదిగాడు.

''వస్తానే... రేపు కలుద్దాం'' అని బస్సు దిగింది సంధ్య. మీనాక్షి ఇల్లు మరో రెండు బస్సుస్టాపుల తరువాత వస్తుంది.

బస్సుదిగిన యువకుడు 'అశోక్‌నగర్ ఎలా వెళ్లాలి' అని ఎంక్వైరీ చెయ్యసాగాడు.

''ఇటు వెళ్లండి'' అని చిక్కడపల్లి మార్కెట్ సందు చూపించి హడావిడిగా వెళ్లిపోయాడు బస్సుదిగిన ప్రయాణీకుడు.

సంధ్య చేతితో పుస్తకాలు పట్టుకుని, భుజాన బ్యాగుతో నడుస్తోంది. ఆమె వెనకే అడుగులేశాడు యువకుడు.

ఓ రెండొందల గజాలదూరం వెళ్లిన తరువాత- ''ఎక్స్యూజ్‌మి, ఈ అడ్రసు ఎంతదూరంలో వస్తుందో చెప్పగలరా?'' అన్నాడు మొహమాటపడ్తూ యువకుడు.

సంధ్య ఆగింది.

నిట్టూరుస్తూ సూటుకేసు కిందపెట్టాడు అతను.

సంధ్య అతనిచ్చిన అడ్రసు కాయితం చూసింది. తమ ఇంటిదగ్గర ఇల్లే అది. ''రంగనాధంగారిల్లు కదా మీకు కావల్సింది'' అడిగింది సంధ్య.

''అవునండీ''

''మరి రెండు ఫర్లాంగులయినా వెళ్ళాల్సి వుంటుంది''.

''అమ్మో... అంతదూరం సూటుకేసు పట్టుకు నడవటం కష్టమే'' అన్నాడు అతను.

''అసలు మీరు బస్‌డిపోనుండి ఆటోలో వస్తే ఈ ఇబ్బంది వుండేదికాదు''

''అవునండీ... ముందలాగే అనుకున్నాను. గౌలిగూడ బస్సుస్టాండ్‌లో బస్సుదిగి బయటకొచ్చేటప్పటికి జేబులో పర్సు కొట్టేశారెవరో. ఆటోకి డబ్బులు లేవు. జేబులో చిల్లరవుంటే బస్సు టిక్కెట్టు తీసుకోగలిగాను'' అన్నాడతను.

''అయ్యో! సిటీలో పిక్‌పాకెటర్స్ ఎక్కువయిపోయారు. మీరు జాగ్రత్తగా వుండాల్సింది'' అంది సంధ్య.

''నిజమే... మీలాగ ముందెవరూ సలహా ఇవ్వలేదు''

''ఎవరు చెప్పాలండీ. నగరంలో మోసాల సంగతి ఎవరూ చెప్పలేదా? పోనీ మీరయినా ఊహించవచ్చుకదా!''

''ఊహించలేకపోలేదు. పట్నంలో దిగంగానే ఇలా టెస్ట్‌చేయటం మొదలుపెడతారనుకోలేదు''

''మంచిదేలెండి అనుభవమయింది. ఇక ముందయినా జాగ్రత్తగా వుంటారు''

''మీకు నా పరిస్థితికి నవ్వు వస్తున్నట్టు వుంది''

''ఆ వస్తుంది ఎందుకు రాదు? ఆ సూటుకేసు అలా నేలమీద పెట్టి మాట్లాడుతూ వుండండి. నేనే కాదు వచ్చే పోయేవాళ్ళుకూడా నవ్వుతారు''

''సరే వదండి''

సూటకేసు తీసుకుని బయలుదేరాడు యువకుడు. సంధ్య పక్కనే నడుస్తోంది.

''ఎక్కడినుండి వస్తున్నారు?'' అడిగిందామె.

''పెడన, కృష్ణా జిల్లా''

''ఏంపనిమీదో''

''ఉద్యోగం''

''ఎక్కడ?''

''స్టేట్‌బాంక్‌లో ప్రొబేషనరీ ఆఫీసరుగా''

''మంచి ఉద్యోగమే సంపాయించారు''

''మీరన్నారుగా మంచిదని, మంచిదే అయుండాలి''

''నేననకపోతే అది మంచిది కాదా?''

''నేనిప్పుడు దాన్నిగురించి ఆలోచించటంలేదు''

''ఏం ఆలోచిస్తున్నారు?''

''ఈ సూటుకేసు కింద పెట్టాలనుకుంటున్నాను'' అని సూటుకేసు కిందపెట్టి అలుపు తీర్చుకున్నాడు అతను.

''అంత బరువుగావున్న ఆ సూటుకేసులో ఏంపెట్టారు?''

''బట్టలు, పుస్తకాలు''

''పోనీ రిక్షాలో వెళ్లరాదూ?''

''డబ్బుల్లేవు''

''నేనిస్తాను, తీసుకెళ్లండి''

''వద్దు మార్గదర్శీ! ఇల్లుచూపించేవాళ్లు కావాలి''

''ఇల్లు కనుక్కోటం తేలికే. అలా సీదా వెళ్ళి, కుడివైపు తిరిగి, ఒక వీధి వదలి రెండో వీధిలో ఎడంవైపు తిరిగితే చౌరస్తా వస్తుంది. అదే రోడ్డు సీదాగా వెళ్లి కుడివైపు తిరిగితే మూడో ఇల్లే రంగనాథంగారిది'' అంది సంధ్య.

''అబ్బ ఎంత చక్కగా చెప్పారండీ, కుడి ఎడమ, కుడి ఎడమ, ఎడమ కుడి, లెఫ్ట్ రైట్, లెఫ్ట్‌రైట్- మీరు చెప్పిన గుర్తులతో నేను మళ్లీ వచ్చిన ప్రదేశానికే పోయేట్టున్నాను''

''అయితే మీ ఖర్మ, సూటుకేసు ఎత్తుకుని నడవండి''

అతడు సూటుకేసు భుజాన పెట్టుకుని నడుస్తున్నాడు.

''అదేమిటి భుజాన? ఎవరయినా చూస్తే నవ్వుతారు'' అంది సంధ్య.

''ఆఁ నవ్వుతారు. సూటుకేసు ఎత్తితే అర్థమవుతుంది వాళ్లకు''

''ఎందుకర్థమవాలండీ వాళ్లకు! ఎవరి బరువు వాళ్లే మోసుకోవాలి''

''ఎందుకు నవ్వాలండీ మరి? మోసేవాళ్లకు తెలుస్తుంది బరువు''

''ఈ పెళ్లినడక నడిస్తే మనం ఎప్పుడు పోతాం ఇంటికి? నేవెళ్లి రంగనాథంగారికి చెప్పి ఎవరినయినా సూటుకేసు తెచ్చేందుకు ఏర్పాటుచేయిస్తాను''

''అమ్మమ్మ! మార్గదర్శీ! వెళ్లకండి. దేవుడు కరుణించినట్లు మీరు దొరికారు''

"నా పేరు మార్గదర్శి కాదు"

"మరేమిటి?"

"ఆడపిల్లల పేరు మీకెందుకు?"

"అవునండీ, ఈ క్షణంలోనే నాకర్థమయింది మీరు ఆడపిల్లని. ఐవాజ్ అన్‌కాన్షస్ ఆఫిట్, అండ్ ఆల్‌దివైల్ యువర్ కాన్షస్ ఆఫిట్"

"దాంట్లో తప్పేముంది?"

"తప్పేంవుంది. ఆడపిల్ల ఎప్పుడూ ఆడపిల్లేకదా, మొగపిల్ల కాదుగదా!"

"మొగపిల్లేమిటి నా ముఖం"

"మీ ముఖానికేం చాలా అందంగా వుంది"

"మీకు జబ్బు మొదలైనట్టుంది. ఇహ నేవెళ్తాను. మీ తిప్పలు మీరు పడండి"

"అయ్యో మార్గదర్శీ! వెళ్లకండి"

"ఎప్పుడూ మార్గదర్శీ, మార్గదర్శీ అనకండి, ఆ పేరుతో ఓ చిట్‌ఫండ్ కంపెనీ ఉంది"

"పోనీ గైడ్ అందామా?"

"ఏమీ అనకపోతే తోచదామీకు?"

"మీరు మార్గదర్శకత్వం వహిస్తుంటే తోచకేం" అని చౌరస్తాలో సూటుకేసు కిందపెట్టి రెండు నిమిషాలు ఆగాడతను. సంధ్యకూడా నిలబడ్డది.

"రంగనాథంగారు ఏమవుతారు మీకు?"

"మామయ్య"

"అంటే మీ అమ్మ తమ్ముడా, అన్నా?"

"అన్న"

"సరే... నడవండి"

మళ్లీ సూటుకేసు భుజాన పెట్టుకుని నడుస్తూ అన్నాడు యువకుడు-

"నాపేరు వాసు. పూర్తిపేరు శ్రీనివాస్"

"నేనడగలేదు మీ పేరు"

"నేనే చెప్పాను. మీ పేరు కూడా చెప్తే బావుంటుంది"

"నే చెప్పను"

"పోన్లెండి మార్గదర్శీ!"

"అదుగో మళ్ళీ" అని "అదే మీ మామయ్యగారి ఇల్లు" అంటూ చేయెత్తి చూపించింది.

అతడు రెండడుగులు ముందుకువేసి వెనక్కి తిరిగిచూసేసరికల్లా ఆమె అక్కడ లేదు. అంతర్థానమయింది. థాంక్స్ చెప్పే అవకాశం కూడా ఇవ్వలేదే ఈమె. సన్నగా, పొడుగ్గా, తెల్లగా వున్న ఈమె పేరేమిటి చెప్మా అనుకుంటూ నిలబడిపోయాడతను.

గేటు తీసుకుని బయటకొచ్చిన రంగనాథంగారు - "ఎవరూ అది, వాసూ!" అన్నాడు.

"అవును మామయ్యా!"

"ఎప్పుడు రావటం?"

"ఇప్పుడే"

"మరి అక్కడే నిలబడ్డావేం. పదపద లోపలికి" అన్నాడాయన లోపలికి దారితీస్తూ.



మర్నాడు వాసు ఆఫీసులో జాయినవటానికి బయటకువచ్చి సందుమలుపు తిరిగేటప్పటికి సంధ్య పుస్తకాల చేతపట్టుకుని కాలేజీకి వెళ్తూ కనిపించింది.

"హాయ్! మార్గదర్శీ!" అని పలుకరించాడతను.

"ఏం కథ?" అంది సంధ్య.

"ఎంత శుభశకునం! ఇవాళ ఉద్యోగంలో జాయినవుదామని బయలుదేరాను. మీరు కన్పించారు. నాకు చాలా సంతోషంగావుంది" అన్నాడతను.

"బజార్లో పోతూంటే ఎవరో ఒకళ్లు కనిపిస్తారు. కన్పించిన వాళ్లందర్నీ చూసి 'శుభశకునం, అపశకునం' అనుకుంటూ మూఢనమ్మకాల్ని పెంచుకోకండి"

"అందర్నీ చూసి ఎందుకనుకుంటాను, మీరు 'వేరు'"

"నా గురించి మీకేం తెల్సు, ఇతరుల నుండి నన్ను భిన్నంగా చూడటానికి?"

"ఏం తెలియాలి? మీ ముఖం చూస్తే అన్నీ తెలుస్తాయి"

"ఓహో మీకు ఫేస్‌రీడింగ్ హాబీ అన్నమాట"

"అన్నమాటేమిటి, ఉన్నమాటే"

"సరేలెండి... ఏంతెలుసుకున్నారు నన్నుగురించి మీ ఫేస్‌రీడింగ్‌వల్ల?"

"మీ పేరు సంధ్య"

"దానికి ఫేస్ రీడింగ్ అక్కర్లా. మీ అత్త చెప్పివుంటుంది"

"కాలేజిలో బి.యస్.సి. ఫైనలియరు చదువుతున్నారు"

"ఇంకా"

"చాలా మంచివాళ్లు. స్వభావం ముందుకు పోవాలంటే, సంప్రదాయపు పెంపకం వెనక్కి లాగుతుంటుంది. విషయాల్ని విశ్లేషించి చూసే ప్రవృత్తి. ఉన్న పరిస్థితుల్నే చక్కగా తీర్చిదిద్దుకోవాలని ప్రయత్నిస్తారు. పరిస్థితులు విషమంగా వున్నప్పుడు రివోల్ట్ అవరు. క్రమంగా వాటిని మీకు అనుకూలంగా మలచుకోటానికి ప్రయత్నంచేస్తారు. కాంప్రమైజ్ అయినట్టు కన్పిస్తారు. అయినా మీ పట్టు వదలరు. ఈ తత్వంవల్ల మీరు జీవితంలో సుఖపడే అవకాశాలున్నాయి. కలలు నిజంకావని మీ అభిప్రాయం"

"అబ్బో చాలా చెప్పేశారే"

"ఇంకా చెప్పగలను, ఆ చెయ్యి ఇలా అందిస్తే"

"అయితే హస్తసాముద్రికంలో కూడా నిష్ణాతులన్నమాట"

"అవును... ఆ చెయ్యి ఇలా ఇచ్చి చూడండి"

"నడిరోడ్డులో ఏమిటీ గోల. నా చేయి మీరు చూడనక్కర్లా"

"పోన్లెండి కరగ్రహణం చేసినప్పుడే చెప్తాను"

"ఏయ్ మిష్టర్! మీకూ నాకూ వున్న పరిచయమెంత? అప్పుడే పెద్దపెద్ద మాటలు మాట్లాడేస్తున్నారు"

"తప్పుమాట ఏమన్నాను? మీరు చెయ్యి ఇచ్చినప్పుడే చూస్తానన్నాను"

"మీవరస నాకేం నచ్చలేదు. ఇలా బజార్లో కనబడినప్పుడల్లా పలకరించకండి. ఎవరైనా చూస్తే బాగోదు. మీరు పలకరించినా నేను పలకను" అంటూ చరచరా ముందుకు నడవసాగింది సంధ్య.

'ఖులీ పలక్‌మేఁ ఝూటాగుస్సా, బంద్ పలక్‌మేఁ ప్యార్, జీనాభీ ముష్కిల్, మర్నాభీ ముష్కిల్...' అని మెల్లగా పాడుకోసాగాడు వాసు.

సంధ్యకు నిజంగానే కోపమొచ్చింది. వెనక్కి తిరిగి, "ఏయ్ మిష్టర్! తమరు రోడ్‌సైడ్ రోమియో అని తెలియక, నిన్న మీకు సాయంచేశాను. ఇక చాలు తమ పరిచయం" అని చరచరా నడవసాగింది ఆమె.

"మార్గదర్శీ, మార్గదర్శీ..." పిలుస్తున్నాడు వాసు.

ఎవరైనా ఇదంతా చూస్తే బాగుండదన్న ఉద్దేశంతో ఒకక్షణమాగి, అతను వచ్చి తన్ను కలవటంతో అంది, "మనిషికోమాట, గొడ్డుకో దెబ్బ అన్నారు గుర్తుంచుకోండి" అని.

"అరే మీకు కోపం వచ్చేసినట్టుంది. అసలు మిమ్మల్నెందుకు పిల్చానో తెల్సా! నిన్న మామయ్యవాళ్ళ ఇల్లు చూపినందుకు కృతజ్ఞతలు చెప్పటానికి"

"కృతజ్ఞతలూ, గాడిద గుడ్డూ ఏం అవసరంలేదు, నాదారిన నన్ను పోనివ్వండి"

"ఏంటమ్మా సంధ్యా!" కూరల సంచీతో వస్తూ అన్నాడు రంగనాధంగారు.

ఆయన్ని చూడగానే తడబడింది సంధ్య.

"ఏంలేదు అంకుల్! ఈయన..."

"నిన్న ఇల్లు చూపించినందుకు థాంక్స్ చెప్తున్నా మామయ్యా!" అని సర్దిచెప్పేశాడు వాసు.

"నిన్నేం జరిగిందో చెప్పాడా అమ్మాయ్? ఇట్లా హైదరాబాదులో కాలుపెట్టాడో లేదో ఎవడో పిక్‌పాకెట్ వీడి జేబు కొట్టేశాడు. నానాతిప్పలయిందట ఇల్లుచేరటానికి. సిటీలో కొంచెం

జాగ్రత్తగా వుండాలిరా అని చెప్పాను'' అన్నాడు ఆయన.

''అవును... విన్నాను అంకుల్. ఒళ్లు దగ్గరుంచుకోకపోతే ఏమయినా అవుతుంది'' అంది సంధ్య శ్రీనివాస్‌కేసి చూస్తూ.

''చూశావురా! ఆడపిల్లలమాత్రమైనా తెలివితేటలు లేకపోతే ఎట్లా? ఇవాళకూడా బస్సులో వెళ్లేవు, ఆటోలో వెళ్లు'' అన్నాడు రంగనాథంగారు.

''అలాగే మామయ్యా!'' అన్నాడు వాసు మహా బుద్ధిమంతుడిలా.

''సరే వస్తా, వస్తానమ్మాయ్'' అని వెళ్లిపోయాడాయన.

''ఒళ్లు దగ్గరుంచుకోకపోతే అప్పుడప్పుడు మంచిపనులు జరిగేట్టే వున్నాయి'' అన్నాడు వాసు ఆమె పక్కగా నడుస్తూ.

''అవును, గాడిద బరువులు మోసుకురావచ్చు''

''అలా అనకండి. ఓరోజు సూట్‌కేస్ మోసుకొస్తే ఏమయింది కనుక. ఐ రియల్లీ థాంక్ ద పిక్‌పాకెట్...''

''ఎందుకండీ బాబూ?''

''వాడు జేబుకొట్టేయకపోతే నేను బస్సులో రానుకదా! బస్సులో రాకపోతే మిమ్మల్ని కలుసుకోలేనుకదా! అందుకు. అందుకే ఒళ్ళు దగ్గరుంచుకోకపోయినా అప్పుడప్పుడు మంచి పనులే జరుగుతాయంటాను''

''అవును... ఎప్పుడో దేహశుద్ధి అయిందాకా అలా అనుకుంటూండండి''

''ఇదేం బాగలేదు. నేను ఉద్యోగంలో చేరటానికి వెళ్తున్న మొదటిరోజే మీరు ఇలాంటి మాటలు చెప్పి సాగనంపటం ఏం బాగాలేదు''

''అబ్బో మీకు చాలా నమ్మకాలున్నాయన్న మాట. సరే... విష్‌యు ఆల్ ద బెస్ట్. హాయిగా పోయి ఉద్యోగం చేసుకోండి. నాలాంటి ఆడపిల్లల్ని మామానాన మమ్మల్ని బతకనివ్వండి. ఏయ్ ఆటో...'' అని పోతున్న ఖాళీ ఆటోని పిల్చింది సంధ్య.

ఆటో ఆగింది.

''ఆటో ఎక్కండి, డబ్బులు తెచ్చుకున్నారా?'' అంది సంధ్య.

''మరీ అంత మతిమరుపు మనిషిననుకోకండి. మీరూ రాకూడదూ? మిమ్మల్ని డ్రాప్ చేసి వెళ్లిపోతాను'' అన్నాడు వాసు.

''రాకూడదు, మీరెక్కండి ముందు''

''మీరూ రండి, ఫర్లేదు''

''చల్తే నహీం క్యాసాబ్? కహాం జానాహై? దేర్‌మత్‌కరో'' అన్నాడు ఆటో విఘ్నేశ్వరుడు.

''రోడ్డుమీద రభసచాలుగాని బయలుదేరండి'' అంది సంధ్య. వాసు ఆటో ఎక్కాడు.

''మళ్లీరోడ్డుమీద ఎప్పుడూ నన్ను పలకరించకుండావుంటే మీకు పదివేల ధన్యవాదాలు... వుంటాను. విష్యూ ఆల్ ద బెస్ట్ అగైన్''

వాసు ఏదో అనబోయాడు కానీ ఆటోడ్రైవరు ఆటో స్టార్ట్ చేసి ముందుకు దూసుకుపోయాడు. సంధ్య ఆలోచిస్తూ నిలబడింది. అతనితో మాట్లాడుతుంటే ఆమె మనసుకి ఎంతో ఉల్లాసంగా అనిపించింది. గాలిలో తేలిపోతున్నట్లనిపించింది. కానీ మనసులో ఓ విధమైన బెరుకు మాత్రం పోలేదు. తామిట్లా బజార్లో మాట్లాడుకోవటం ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? అయేదేం లేకపోయినా చెడ్డ పేరొస్తుంది. కలలు కనటంలో ఆనందం వుంది కాని అవి నిజాలు కావని సంధ్య నమ్మకం. ఆ ఆలోచనతో మనసు బరువెక్కి, ఆ బరువు కాళ్లల్లోకి దిగిపోగా మెల్లగా నడుస్తూ బస్‌స్టాప్‌కు చేరుకుందామె.

మధ్యాహ్నం లంచ్ టైంలోగాని మీనాక్షితో వాసు సంగతి చెప్పటం కుదరలేదు సంధ్యకు.

''నిన్న మనకు బస్‌స్టాపులో సూట్‌కేసు చేత్తో పట్టుకుని కన్పించినతను గుర్తున్నాడా? ట్రాజిక్ హీరోలా వున్నాడని కూడా అన్నావు'' అంది సంధ్య.

''అవునే అయితే ఏవిటి కథ?''

''మా పక్కింటి రంగనాథంగారి మేనల్లుడతను''

''అబ్బో వివరాలు కూడా సేకరించావన్న మాట అప్పుడే''

''నీ మొహం ఒక్కటిస్తా జాగ్రత్త! చిక్కడపల్లిలో దిగి 'ఈ అడ్రసుకు దారి చూపిస్తారా?'



అని అడిగాడు. అడ్రను చూడగానే అది రంగనాథంగారి ఇల్లని తెల్సిపోయింది'' అంది సంధ్య.

''పెళ్లయిందా బుజ్జి తండ్రికి?''

''ఏమో నేనడగలా''

''ఏం ఏడ్చావు మరి''

''బావుంది. కనపడిన ప్రతివాణ్ణీ నీకు పెళ్ళైందా అని అడగాలా?''

''ఇలా అయితే బాగుపడవు, సరే మిగతా వివరాలు చెప్పు''

అతనికి స్టేట్ బ్యాంక్‌లో ప్రొబేషనరీ ఆఫీసరు ఉద్యోగం వచ్చిందట. ఉద్యోగంలో చేరటానికి వచ్చాడు హైదరాబాదు పెడన నుండి. హైదరాబాదులో కాలిడగానే నగర మహత్యాన్ని చూపెట్టాడో పిక్‌ప్యాకెట్. జేబు కొట్టేశాడు. ఆటోలో వద్దామంటే డబ్బుల్లేవు. చిల్లర పైనలుంటే బస్సెక్కివచ్చాడు. సూట్‌కేను బరువుగావుంది. పాపం ఇంటిదాకా మోయలేక, మోయలేక మోశాడు. నేనతనికి ఇల్లు చూపించాను. నాకు మార్గదర్శి అని పేరుపెట్టాడు''

''అమ్మో చమత్కారి లాగానే వున్నాడే మనిషి, బాగా మాట్లాడతాడా?''

"బాగానే మాట్లాడతాడు"

"ఫరవాలేదే, ఇంక సంకోచించకు ప్రొసీడ్..."

"దేనికి?"

"ఓసీ నిద్ర మొహమా! మంచి అవకాశం జారవిడుచుకోకే"

"ఏమిటా మంచి అవకాశం?"

"ప్రేమించి పెళ్లిచేసుకోవటం"

"తప్పుడు మాటలు మాట్లాడక నాకు ఈ ప్రేమ దోమ అంటే డోకు"

"నీ ఖర్మ అలా రాసి పెట్టినట్టువుంది. ముక్కూమొహం తెలీని వాడిచేత తాళి కట్టించుకుని వాడికి పిల్లల్నికంటూ, వాడిచేత తన్నులు తింటూ బతకాలని రాసిపెట్టినట్టుంది నీ మొహాన"

"ప్రేమించి పెళ్లి చేసుకుంటే మాత్రం పిల్లలు పుట్టరా? ప్రేమపక్షులు కూడా పెళ్ళైంతర్వాత తన్నుకోరని నమ్మకమేంటీ?"

"ప్రేమవివాహాన్ని పెద్దలు కుదిర్చే పెళ్లితో పోల్చక. మనసులనర్థం చేసుకుని ఒకటయ్యేది ప్రేమపెళ్లి. పరిచయం లేని మూగజీవాల్ని గదిలోకి తోసేది అరేంజ్‌డ్ మారేజ్"

"ఏమో నాకీ వెధవ్వేషాలు నచ్చవు. ఇంట్లో వాళ్లకు తెలిస్తే ఏమనుకుంటారు? ఇంక నాతో మాట్లాడొద్దని వార్నింగిచ్చాననతనికి"

"అవకాశం దొరక్కనే నేడుస్తుంటే దొరికిన అవకాశం చేజార్చుకునే మూర్ఖత్వంనీది"

"ఇదేం బాగాలేదు"

"ఏంబాగాలేదు"

"ఎవడికో గాలం వెయ్యాలని చూడటం"

"గాలం కాదు స్వయంవరం"

"అసలు పెళ్లిళ్లు పెద్దలు కుదిర్చినవైనా, ప్రేమ పెళ్లిళ్లయినా ముఖ్యం వ్యక్తులు. దంపతులు స్నేహితుల్లా వుండే అవకాశం వుంటే ఆ పెళ్లి సక్సెస్ అవుతుంది. స్నేహితురాలిగా నా మనసులో మాట చెప్పటం నా బాధ్యత. నీ ఈ ప్రేమ ప్రయత్నాలన్నీ మానేసి నీ కాళ్ల మీద నిలబడే ప్రయత్నం చేయి. ఏం చేయాలన్నా ఆర్థిక స్వాతంత్ర్యం ముఖ్యం. అదిష్టం లేకపోతే మీ అమ్మానాన్నా కట్టబెట్టే వాడితో హాయిగా కాపురంచేసుకో. అయినా ఇప్పటి నుండీ పెళ్లి గొడవేమిటి, వీలయినంతకాలం సుఖంగా బతక్క" అంది సంధ్య.

"నేనేం పెళ్లికి ఆరాటపడడం లేదు. పెళ్లంటూ చేసుకుంటే నాకు నచ్చిన వాడినే చేసుకుంటాను. ఆ బ్రహ్మారుద్రాదులు ఒక్కటై దండెత్తివచ్చినా, భూమ్యాకాశాలు ఏకమైనా నేను మాట తప్పనుగాక తప్పను. రామబాణంలా మనది ఒకటే లక్ష్యం ఒకటే మాట. చూస్తూండవే చవటసన్నాసి! నా మాట నిలుపుకుంటానో లేదో" అంది మీనాక్షి.

"ఏమిటేవ్... పెద్ద పెద్ద శపథాలు చేస్తున్నావు. అయితే ఎర్రగా బుర్రగా వున్న వాణ్ణి చూసి ప్రేమించేసి తాళి కట్టేస్తావన్నమాట" అంది అప్పుడే అక్కడకొచ్చిన వనజ.

"కడ్తుందా కట్టించుకుంటుందా?" అడిగింది సంధ్య.

"ఎవరు కడ్తే ఏం పోయిందిలే వలువుతాడు" అంది మీనాక్షి.

"ఆఁ ఆఁ వలువుతాడు... ఇంకాసేపుంటే ఉరితాడంటావు. రేపు అదొచ్చి మెళ్లో వడగానే కళ్లకద్దుకుంటావు" అంది వనజ.

"హుఁ నేనా... పతి పదసేవయె యోగముగ, నాతికి పతియే దైవముగ... అంటూ కూనిరాగాలు తీస్తూ గడిపేది మీలాంటి వెర్రి మాలోకాలు" అంది మీనాక్షి.

"సర్లే అదీ చూద్దామే మహా నీ తెలివితేటలేమిటో, నే వస్తా నాకు పనుంది" అని వనజ వెళ్లిపోయింది.

"ఒక్క విషయమే సంధ్యా ... ప్రకృతిలో దేనికీ ఫిక్సేషనులేదు. అలాంటిది ఈ ఆచారాలు స్థిరమైనవా? ఏ ఆచారమైనా దేశ కాలానుగుణంగా ప్రజల సౌకర్యార్థమే ఏర్పడుతుంది కానీ పరిణామక్రమంలో అందులో సౌలభ్యం తగ్గి అసౌకర్యం కలగవచ్చు.అప్పుడుకూడా మార్చుకోరకపోతే దాన్నే ఆచరిస్తే అది మూర్ఖత్వమవుతుంది. పూర్వీకులు ఏర్పరచుకున్నవి మనకు సరిపోకపోతే మనకు తగినట్టుగా వాటిని మార్చుకోవాలి. ఆ మార్పు మన చేతిలోనే వుంటుంది" అంది మీనాక్షి.

"ఇంతకీ ప్రేమ పెళ్లిళ్లే సమాజంలోని చెడుగునంతా క్షాళనం చేస్తాయంటావు. ఇదే నన్న

రణ వాదం. ఇది పైపైమార్పుల్నే తీసుకువస్తుంది కాని మౌలికమయిన మార్పు తీసుకురాదు. అది రానంతవరకూ ఈ సమాజం ఇంతే. సంస్కరణలవల్ల ఇప్పుడున్న ఆచారాలుపోతే అవే మరో రూపంలో వచ్చి తిష్ఠవేస్తాయి. ఆర్థిక సంబంధాలమీద మిగతా సంబంధాలన్నీ ఆధారపడివుంటాయని గుర్తించనంతవరకూ మన సమాజం ఇలాగేవుంటుంది. ఈ సమాజాన్ని మార్చగలిగేంత శక్తీ ధైర్యం నాకు లేవుగానీ ఉన్న పరిస్థితుల్ని నాకనువుగా మార్చుకో ప్రయత్నిస్తాను'' అంది సంధ్య.

"నీ మొహంలే, నీవన్నీ మరీ రాడికల్ ఆలోచనలు. ఆ కామేశ్వరీ, లలిత నీ బుర్ర చెడగొడుతున్నారు. వాళ్లతో తిరగొద్దంటే వినవు. ఉద్యోగం చేయటం, సంపాదించటం మన ఒంటికి పడవు. వస్తాడుగా, ఆ వచ్చేవాడు సంపాదించక, పోషించకేం చేస్తాడు''

"ఏమో ... నీ లెక్కప్రకారం ఆ వచ్చేవాడెవడయినా వున్నాడో లేదో నా ఊహకందటంలేదు'' అంది సంధ్య.

★ ★ ★

సాయంత్రం మీనాక్షి ఇంటికి వెళ్ళేటప్పటికి ఇంట్లో అంతా హడావుడిగా వుంది. "ముందు రమ్మంటే, ఐదైంది - ఇప్పుడా నువ్వు వచ్చేది? ఒక్కరోజు కాలేజీకి పోకపోతే కొంపలేం మునుగుతాయా'' అని విసుక్కుంది మీనాక్షి తల్లి సౌభాగ్యలక్ష్మి.

"లేదమ్మా, అనుకోకుండా లేటయింది. అయినా నేను ముందొచ్చి చేసే రాచకార్యమేముంది గనకా'' అంది మీనాక్షి.

"ఏమీ వుండదా? ఏళ్లొచ్చినా బుద్ధి ఎదగలేదు. అవతల వాళ్లున్నారు నీ తెలివి తక్కువతనం ప్రదర్శించక పోయి కూర్చో'' అంది తల్లి.

"ముందు హాల్లో సంరంభమంతా అదేనా. అక్కని చూశారా పెళ్లివాళ్లు ... ఏమన్నారు?'' ఆనందంగా అడిగింది మీనాక్షి.

"ష్ ... పెద్దగా అరవకు. చూశారు, అక్క కూడా అక్కడేవుంది. అయినా అప్పుడే చెప్తారా? ముఖం కడుక్కుని, బట్టలు మార్చుకుని నువ్వూ హాల్లోకి పద; నేనూ వస్తున్నా'' అంది సౌభాగ్యలక్ష్మి.

మీనాక్షి తొందర తొందరగా ముఖం కడిగేసి, బట్టలు మార్చుకుని, జుట్టంతా రేగినట్లనిపిస్తే విప్పి జడల్లుకుని, చీర చెంగులు సరిచేసుకుని హాల్లోకి వెళ్లింది.

"హాల్లో రోజూ మధ్యగా ఎదురుబొదురుగా వుండే సోఫాలని పక్కలకు జరిపేసి అదనంగా కుర్చీలు వాల్చారు. ఒక సోఫాలో ఇద్దరు పెద్దమనుషులు కూర్చునున్నారు. పక్క సోఫాలో ఇద్దరు పెద్ద ముత్తైదువలు, ఒక అమ్మాయి కూర్చున్నారు. విడి సోఫాలో ఇద్దరు యువకులూ, వాళ్లకు ఎదురుగుండా కుర్చీలో మీనాక్షి అక్క దేవకి, ఆమెకి పక్కగావున్న కుర్చీలో ఆమె తండ్రి ధర్మారావు కూర్చుని వున్నారు. తండ్రి వెనగ్గా ఆమె అన్న కృష్ణ నుంచుని వున్నాడు. పక్కగా గోడవారగా పరిచిన చాప మీద మీనాక్షి మేనత్త, ఆమె కూతురు లక్ష్మి, పక్కింటావిడ విశాలాక్షి కూర్చుని వున్నారు. 'పెళ్లిచూపులకు ఇంతమంది పోగయారెందుకు? ఇదేం సంతా? గంగిరెద్దును కొనుక్కోవటానికి వచ్చారా వాళ్లు' అనుకుంది మీనాక్షి.

మీనాక్షికి ఆ వచ్చినవాళ్లు ఎవరు ఎవరో అర్థంకాలేదు. లక్ష్మికి సైగచేసి పక్కగదిలోకి తీసుకువెళ్లి ఎవరు ఏమిటో తెలుసుకుంది. ఆ పెద్దమనుషులు పెళ్లికొడుకు తండ్రీ, పినతండ్రీనట. పెద్దముత్తయిదువలు వారి భార్యలట. ఆ అమ్మాయి పెళ్ళికొడుకు చెల్లెలు. అయితే సమవయస్కులుగావున్న ఆ ఇద్దరు యువకుల్లో అసలు పెళ్లికొడుకెవరో, అతని పినతండ్రి కొడుకెవరో అర్థంకాలేదు లక్ష్మికి కూడా.

ఆ ఇద్దరు యువకుల్లో ఒకతనికి బట్టతల రాబోతున్నట్టు జుట్టు పల్చగా వుంది. పచ్చగా దబ్బపండులా వున్నాడు. అతని కళ్లు కలల్లో తేలిపోతున్నట్టున్నాయి. రెండో అతను సన్నగా పొడుగ్గా వున్నాడు. చామనఛాయ. ముఖంమీద పడుతున్న ఉంగరాల జుట్టుతో చూడముచ్చటగా వున్నట్లనిపించింది మీనాక్షికి. అతని కళ్లల్లో ఏదో తెలియని ఆకర్షణ. ఆమె అతనివంక చూసినప్పుడు కళ్లతోనే నవ్వుతూ పలకరించినట్లనిపించింది ఆమెకు. పెళ్లికొడుకు రెండో అతను అయితే బాగుంటుందనిపించింది మీనాక్షికి.

పెళ్ళిచూపులకొచ్చినా విడవలేక రాజకీయాలు మాట్లాడుకుంటున్నారు పెద్దమనుషులు.

ఇరాక్ మూలంగా దొరికిందే తడవని అమెరికా అరబ్ ప్రపంచంలో తన పలుకుబడిని పెంచుకునేందుకై పెత్తందారీ వహిస్తూ గల్ఫ్ యుద్ధానికి ఆయత్తమవటం వగైరా రసవత్తరంగా చర్చించుకుంటున్నారు. మాట్లాడుతున్న ధర్మారావు మీనాక్షిని అప్పుడే చూశాడు.

"ఏమ్మా మీనా ... ఇప్పుడా రావటం. ఒక్క రోజు కాలేజీ మానేస్తే ఏంబోయింది?" అని కాబోయే వియ్యంకుడితో "మా చిన్నమ్మాయండీ. బి.యస్‌సి చదువుతోంది" అన్నాడు కూతుర్ని పరిచయంచేస్తూ.

మీనాక్షి ఆయనకు నమస్కరించింది నవ్వుతూ. అంతా ఓసారి పరీక్షగా చూశారు ఆమె వంక.

"మీనా ... వెళ్లి టీ తీసుకురామ్మా" అన్నాడు ధర్మారావు.

"అదేంటి నాన్నా ... ఒట్టి టీనా?" అంది ఆమె.

పెళ్లికొడుకు తల్లి కాబోలు నవ్వుతూ, "అవునమ్మా ... మీ నాన్నగారికి రాగానే చెప్పాం, ఇంక ఏం ఏర్పాట్లూ చేయవద్దని. నీకు తెలియదు, కతికితే అతకదంటారు" అంది.

"ఆఁ ... అవన్నీ పిచ్చినమ్మకాలండీ. మనుమలదోషాల్ని ఆహారపదార్థాల మీదకు తోస్తే ఎలా? నేను వెళ్లి టిఫిన్‌చేసి తెస్తాను. ఎట్లా సెటిల్‌కాదో చూద్దాం" అంది.

"పిల్ల సిసింద్రీలా వుందే" అంది పెళ్లికొడుకు పిన్ని.

"వద్దులే ఇప్పుడొద్దు, ఇంకోసారి చేసి పెడుదువుగానిలే" అంది పెళ్లికొడుకు తల్లి.

"పోనీ చేయనీ రాదు పెద్దమ్మా! ఆవిడ పాకం ఎలా వుంటుందో రుచిచూసే అవకాశం పోగొట్టుకోవటమెందుకూ" అన్నాడు చామనఛాయ యువకుడు.

అంతే, వేరే మాటలకు అవకాశమివ్వకుండా మీనాక్షి వెంటనే వంటఇంట్లోకి వెళ్లిపోయింది. ఇరవై నిమిషాల్లో సేమ్యా ప్లేట్లతో తిరిగివచ్చింది.

చామనఛాయ యువకుడు 'పెద్దమ్మా' అని పిల్చాడంటే అతను పెళ్లికొడుకై వుండడు. బట్టతల అయ్యేట్టున్న యువకుడే పెళ్లికొడుకు అయివుండాలి. అయితే మీనాక్షి సందేహాలతో కొట్టుమిట్టాడే వ్యక్తికాదు. నిర్ధారణగా తెలిసిందాకా ఆమెకు మనసు వుండబట్టదు. అందుకనే నిర్మొహమాటంగా అడిగేసింది- "ఇంతకీ పెళ్లికొడుకెవరో నాకర్థం కాలేదు. కనీసం మా అక్కకయినా తెలియాలిగా"అంది ఇద్దరు యువకుల్నీ చూస్తూ.

అంతా పెద్దగా నవ్వారు. పెళ్లికొడుకు పినతండ్రి కొడుకు నన్నటి చామనఛాయ యువకుడు నవ్వుతూ- "మీ అక్కకు తెల్సులేండి. భయపడకండి. పెళ్లికొడుకును నేను కాదు" అన్నాడు నవ్వుతూ

అంతా నవ్వుకుంటూ ఛలోక్తులు విసురుకుంటూ సేమ్యా తిన్నారు. మీనాక్షి వెళ్లి అందరికీ కప్పులో టీ పట్టుకొచ్చింది. టీ తాగి, లేచి వెళ్లబోయేటప్పుడు చామనఛాయ యువకుడు "మీ సేమ్యా టీ చాలా బావున్నాయి. చాలా థేంక్స్" అన్నాడు నవ్వుతూ.

"మా అమ్మాయి ఏంచేసినా అద్భుతంగా చేస్తుంది" అన్నారు ధర్మారావుగారు గర్వంగా.

పెళ్లివాళ్లను పంపించివచ్చిన ధర్మారావుగారు అన్నాడు- "ఇంకా విషయం నిర్ధారించి చెప్పకపోయినా, సంబంధం దాదాపు కుదిరినట్లే. వెళ్లేటప్పుడు పెళ్లికొడుకు తండ్రి మాటల తీరు బట్టి నాకలా అన్పించింది" అని.

ఆడపిల్లలు పుట్టినప్పటినుండి తల్లిదండ్రులకు, చుట్టూ వున్న సమాజానికీ ఒకే ఆలోచన- అమ్మాయి పెళ్లి. ఆ వాతావరణంలో పెరిగిన ఆడపిల్లలూ అవే ఆలోచనల భారాన్ని గుండెలమీద మోస్తూ, బరువుతో తలదించుకుని అయిందానికీ కానిదానికి సిగ్గుపడిపోతూ, పెళ్లవటానికి కావల్సిన అర్హతలు- వంటావార్పూ, పనితనం, కుట్లూ, అల్లికలూ, సంగీతం, చదువూ, దొరికితే ఉద్యోగం- సంపాదించుకోవటానికి ప్రయత్నిస్తూ వుంటారు.

ఒకో జీవితానికీ గమ్యం వుందనీ, స్త్రీనిగాని, పురుషునిగాని వారి మనస్తత్వం, గుణాలు, అభిరుచి, సమాజ ప్రభావం వారిని ఆవైపుకు నడిపిస్తాయనీ సమాజం మర్చిపోయింది. సంఘం ఏమాత్రం సళ్ళువదలక బిగువై ఘనీభవించిపోయింది. స్త్రీకి పురుషుడికి నిర్ధారిత

గమ్యాలేర్పడ్డాయి. ఆడపిల్ల గమ్యం పెళ్లి, మగ పిల్లవాడి గమ్యం ఉద్యోగం. సామాజికంగా, ఆర్థికంగా స్థిరత్వాన్నేర్పరచే ఆ వ్యవస్థలు స్త్రీ పురుషులు చేరుకోవాల్సిన గమ్యాలయ్యాయి. నిజానికవి వ్యక్తి వికసనంలో, మానవజీవన ప్రయాణంలో మజిలీలు మాత్రమే. మజిలీలు గమ్యాలవటంతో మానవజీవితం కుంటుపడి పోయింది.

చారిత్రక పరిణామక్రమంలో ఆదిమానవు డు ఉషసౌందర్యాన్ని చూసి విహ్వలుడయ్యా డు. ప్రకృతిని చూసి ఆనందించాడు. ప్రకృతి కన్నెర్రజేసినప్పుడు భయపడ్డాడు. తన జీవన యాత్రలో తనకు ఆనందాన్నిచ్చేవాటిని సంగ్ర హించసాగాడు. తన సంపాదనను కోల్పో కుండా వుండటానికీ, తన ఏకాకితనాన్ని మర చిపోయేందుకూ ఎన్నో వ్యవస్థలనేర్పరచుకు న్నాడు. శక్తే హక్కుగా పరిణమించే ఆటవిక జీవనం అతనికి నచ్చలేదు; బలహీనుడికీ రక్షణకలిగే సాంఘికజీవనం ఎంచుకున్నాడు; తావలచిన రంభను బలవంతుడు తస్కరించ కుండా వివాహవ్యవస్థను కనుగొన్నాడు. తన అవసరాలు వ్యవస్థిత సమాజంలో సక్రమంగా సాగిపోవటానికి పరిపాలనా యంత్రాంగాన్ని నిర్మించుకున్నాడు; ఇతరులపై తన అధికారా న్ని గొప్పదనాన్ని రుద్దటానికి మతాన్ని కనుగొ న్నాడు. దేవుణ్ణి తన ఆకారంలో సృష్టించుకు న్నాడు; గుళ్లు కట్టాడు, మొక్కాడు, మొ క్కించుకున్నాడు; తను సృష్టించిన దేవుడు తనకంటే గొప్పని భావించాడు, ఇతరులనలా నమ్మించాడు. సంప్రదాయాలూ, ఆచారాలు ఏర్పరిచాడు. తనదైన పరిధిలో ఇతరులను దోచి స్వార్థానికి ఆస్తిహక్కు సంపాదించుకున్నా డు. ఆ స్వార్థానికి అంతులేకుండాపోయింది. తనకున్న దాంతో తృప్తిలేకుండాపోయింది. పక్కవాడి పొలం, పొరుగురాజ్యం కబ ళించేందుకు ఎప్పుడూ పొంచివుండేవాడు. చరస్థిరాస్తుల్లో స్త్రీ ఒక భాగమయింది. బహు భార్యాత్వం పరువుప్రతిష్టల కారణమయింది; తను పోయినప్పుడు తన స్త్రీని తనతో తీసుకు పోయాడు. శుల్కమిచ్చి అతివను కొనుక్కున్నా డు. కట్నం రాబట్టి ఆమెను సులువుగా బాని సగా, దాసీగా తెచ్చుకునే ఆచారం ప్రవేశపెట్టా డు. ఇదే గమ్యం- ఆడపిల్లకు పెళ్లే గమ్యం అన్న ఆలోచన నాటాడు. జీవితంలోని ఎన్నో సంఘటనల్లో పెళ్లి ముఖ్యమయినదే. అయినా అదే పరమావధి అని భ్రమించాడు, భ్రమింప చేశాడు; తాను కట్టుకున్న సాలెగూడులో తానే చిక్కుకున్నాడు; తేనెలోపడ్డ ఈగలా కొట్టుమిట్టా డాడు. ఇల్లు అలుక్కుంటూ, గూడు కట్టు కుంటూ తన పేరు మర్చిపోయాడు. అనలీవని ఎందుకు చేపట్టారో విస్మరించాడు. శాంతి, సుఖం, ఆనందం అడుగునపడిపోయాయి.

దేవకి మీనాక్షికన్నా రెండేళ్లు పెద్దది. బియ్యే చదివి, టైపు షార్ట్‌హాండ్ పాసై, ఒక ప్రయివేట్ కంపెనీలో స్టెనోగా పనిచేస్తోంది. ఆమెకు మీనా క్షికున్న విప్లవాత్మక భావాలు లేవు. మామూలు సాదాసీదా ఆడపిల్ల ఆమె. తల్లిదండ్రులు కుదిర్చినవాణ్ణి పెళ్లిచేసుకుని, హాయిగా తన కాపురం గుట్టుమట్టుగా సాగించాలనేతత్వం ఆమెది. రెండేళ్లవయసు తేడావున్నా మీనాక్షి, సంధ్య దేవకితో ఎంతో సఖ్యంగా స్నేహితుల్లాగా వుంటారు. మీనాక్షి అక్క ఆలోచనల్ని అవహే ళన చేసినప్పుడల్లా, సంధ్య ఆమె తరఫున మాట్లాడుతూ మీనాక్షితో వాగ్యుద్ధానికి సన్నద్ధమ వుతూవుంటుంది. మీనాక్షి, దేవకి వీలుదొరికిన ప్పుడల్లా సంధ్య ఇంటికి వెళ్తూవుంటారు. వాళ్ళు ముగ్గురు కలుసుకున్నప్పుడు మాట లకు కొదవవుండదు.

సంబంధం చాలావరకు నిశ్చయమైనట్లే అని తండ్రి చెప్పటంతో దేవకికి ఎంతో సంతోషం కలిగింది. కాబోయే భర్త ఆర్టిస్ట్ అని విన్నది. పెళ్ళిచూపుల్లో కూడా, ఎక్కడో కలల్లో తేలుతున్నట్టున్న అతని కళ్లు ఆమెకు గుర్తుకు వచ్చి ఆమె మనసు ఆనందపరవశమైంది. అతను వేసేబొమ్మలు పత్రికల్లో కూడా చూ సింది ఆమె. ఆమెకి ఆర్ట్ గురించి ఏమీ తెలియకపోయినా కళాకారుడు తన భర్త కా వటం తల్చుకుంటే ఆమె మనసుకు పట్టపగ్గా ల్లేకపోయాయి. అంతా నిశ్చయమే. వాళ్ళు తనలో తప్పుపట్టటానికి అవకాశంలేదు. తాను గొప్ప అందగత్తె కాకున్నా అనాకారి కాదు, చదువుకుంది, ఉద్యోగం చేస్తోంది, పనీపాట లూ తెల్సు. తన తండ్రి వాళ్లడిగిన కట్నమివ్వ గలడు. ఇంక వేరేఅడ్డంకి ఏముంటుంది?

ఆమె కాబోయే ఆర్టిస్ట్ భర్తపేరు పరమేశం.

అతని తండ్రీ, పినతండ్రీ ఇంకా విడివడలేదు. వారిది అవిభక్త కుటుంబం. నిజామాబాదులో వుంటారు. అక్కడికి దగ్గరున్న వల్లెటూర్లో వారికి పొలాలున్నాయి. అతని పినతండ్రికి రామ చంద్రమొక్కడే కొడుకు. అతను ఎం.బి.ఏ. పాసయి స్వంతగా బిజినెస్ పెట్టుకున్నాడు. వరమేశం ఆర్టిస్టుగా తన సంపాదనకు అవకాశా లెక్కువున్న హైదరాబాదులో స్థిరపడ్డాడు. అప్పుడప్పుడు వెళ్లి తల్లిదండ్రులను చూసి రావటమేగాని, సామాన్యంగా హైదరాబాద్‌లోనే వుంటాడు. రామచంద్రం బిజినెస్ వ్యవహారా ల్లో పనిపడి వచ్చినప్పుడల్లా వరమేశం దగ్గరే మకాం పెడ్తాడు.

ఆ మర్నాడు సాయంత్రం సంధ్య మీనాక్షి ఇంటికి వచ్చినప్పుడు అంది మీనాక్షి- "ఆదివా రంకదా, ఇంట్లోనే తగలడతావేమోననుకు న్నావు. వచ్చావు సంతోషం, లేకపోతే నేనే రావాల్సివచ్చేది" అని.

"నిన్న అక్క పెళ్లి చూపులయ్యాయా?" అడిగింది సంధ్య.

"అయ్యాయి. ఆయన ఆర్టిస్టట. పేరు వర మేశం. పత్రికల్లో ఆయన వేసిన బొమ్మలు చూడలా" అంది మీనాక్షి.

"అక్క నచ్చినట్లేనా వాళ్లకు" అడిగింది సంధ్య.

"అక్కకు అతను నచ్చాడా అని అడ గవేం?" అంది మీనాక్షి.

"ఆఁ పిల్లవాడు నచ్చకేమే. చక్కగా స్ఫుర ద్రూపం. ఒడ్డూ పొడుగూ, దబ్బపండులాంటి ఛాయ, మంచి కళగల మొహం" అంది సౌభాగ్యలక్ష్మి.

"మగాడైంతర్వాత మీకు నచ్చకేం చేస్తాడు లేమ్మా? అక్కని అడిగారా నచ్చిందీ లేనిదీ" అంది మీనాక్షి.

"బాగుందే ... ఎద్దును అడిగి గంటక డ్తామా?" అంది తల్లి.

"ఒసే ఎద్దూ ... నీకు నచ్చాడా కాబోయే బావగారు?" అడిగింది మీనాక్షి అక్కని ఎక్కిరి స్తూ.

"నీ మొహంలే, అమ్మానాన్నలకంటే మనకె క్కువ తెల్సా?" అంది దేవకి.

"సరే ... నీ ఖర్మ, గంగిరెద్దు జీవితం గడపాలని రాసుంది కాబోలు నుదుటిన" అంది మీనాక్షి ఎకసెక్కెంగా.

"పోన్లే నువ్వు గానుగెద్దు కాకుండా చూసు కో" అంది దేవకి కోపంగా.

"ఆఁ ... అదిఖాయమే. నేనేం అరేంజ్‌డ్ మారేజ్ చేసుకోను"

"ముందు పెద్దదానిపెళ్లి కానీ, అప్పుడు కదా నీ సంగతి" అంది తల్లి.

"అమ్మా! ముందుగానే చెప్తున్నా గుర్తుంచు కో, నాకిలాంటి పెళ్ళిళ్లు ఇష్టం లేదు" అంది మీనాక్షి.

"నోర్మూయవే ... ఎవరైనా వింటే నవ్విపోతా రు" అంది తల్లి.

"అదంతేలే, ఎప్పుడూ అట్లాగే మాట్లాడు తుంది" అంది దేవకి.

"ఏమ్మా! మీవాళ్లేమన్నా పెళ్లి సంబంధాలు చూస్తున్నారా సంధ్యా నీకు?"అడిగింది సౌభా గ్యలక్ష్మి.

"ఇంకా లేదండీ" అంది సంధ్య సిగ్గుప డ్తూ.

"ఒసి నీముఖంమండ... సిగ్గెందుకే? ఇట్లాంటి పెళ్ళిళ్ళు చేసుకోనని చెప్పెయ్యక" అంది మీనాక్షి.

"సర్లే, పెద్దవాళ్లతో అలాగేనా మాట్లాడేది" అంది సంధ్య.

"అలా గడ్డిపెట్టమ్మా దానికి. ఆడపిల్ల పెళ్ళి కావటమే గగనమైన ఈరోజుల్లో గొంతెమ్మ కోరిక లుంటే ఏ ఆడపిల్లకైనా పెళ్లయ్యేనా?" అని నిట్టూర్చింది సౌభాగ్యలక్ష్మి.

"గొంతెమ్మ కోర్కెలేవుందీ దీంట్లో. ప్రేమ పెళ్లే తప్పు, పెద్దలు కుదిర్చిన వివాహం చేసుకో నుగాక చేసుకోను" అంది మీనాక్షి.

"నోర్మూసుకో... మీ నాన్న విన్నారంటే నాప్రాణం తీస్తారు. మన ఇంటావంటా లేని ఆలోచనలు తలపెట్టావంటే జాగ్రత్త ... మక్కె లిరుగుతాయి" అని లేచి వెళ్లిపోయింది సౌభా గ్యలక్ష్మి.

"ఆఁ ... విరుగుతాయి. చూద్దాం... ఆడపిల్ల లంటే కీలుబొమ్మలనుకుంటున్నారు కాబోలు" అంది పెద్దగా మీనాక్షి తిరుగుబాటు ధోరణిలో.

"గుట్టూమట్టూ ఏం లేదా? ఏవిటా అరుపులు" అంది దేవకి.

"గుట్టెందుకు? చెయ్యదల్చుకుంది ధైర్యంగా చెప్పిచేయాలి" అంది మీనాక్షి.

"అందుకని ఇంటిల్లిపాది నీ శత్రువుల్ని చేసుకోవాలా? నువ్వు ప్రేమించబోయే ఆ మగధీరుడెవరో ఇంతమటుకూ తేలలేదుగానీ ఈ లోపల నీ డిక్లరేషన్స్‌తో మాత్రం ఇంట్లోవాళ్లని హడలగొడ్తూవుండు" అంది సంధ్య.

"మీరు మాట్లాడకండి ... నాకు కోపం వస్తూంది. ఇష్టమైంది చెప్పే ధైర్యం కూడా లేని చచ్చుమొహాలు మీరు" అంది మీనాక్షి.

★ ★ ★

"ఈ కొంపింతే. ఒక్కరూ ఇల్లు సర్దకపోయినా పెట్టింది పెట్టిన చోటయినా వుండనివ్వరు. మునిసిపాలిటీ కంటే అధ్వాన్నం. ప్రతి ఆదివారం నేనింత కష్టపడటంకూడా అనవసరమే" అని నిష్ఠూరాలు పలుకుతూ ఇల్లు సర్దుతోంది మీనాక్షి.

"ఎవర్నే ఆ చాడింపు?" అంటూ హాల్లోకి వచ్చింది సౌభాగ్యలక్ష్మి.

ఇంతలో ధర్మారావు లోపలికి వచ్చాడు ఉస్సురంటూ. ఆయన కూతురి పెళ్లి నిశ్చయించుకు రావటానికి నిజామాబాదు వెళ్లాడు. ఆయన ముఖం అప్రసన్నంగా కనిపించకపోవటంతో సౌభాగ్యలక్ష్మి మనసు కుదుటపడ్డది. అయినా మనసుండబట్టక ఆత్రుతగా అడిగింది: "ప్రయాణమెట్లా జరిగింది, ఏవంటారు పెళ్లివారు?" అని.

"కాస్త మంచినీళ్లయినా ఇచ్చేదుందాలేదా? రాగానే ప్రశ్నలు మొదలెట్టావు" అన్నాడాయన.

"మీనా ... మీ నాన్నకు మంచినీళ్లు తీసుకరావే" అంది సౌభాగ్యలక్ష్మి.

"అబ్బ ... నువ్వు తీసుకురా అమ్మా, నాకు తీరుబడిలేదు" అంది మీనాక్షి.

"చిన్నపనికీ పెద్దపనికీ నేనే చావాలి. ఆడపిల్లలున్నారు కానీ ఎందుకూ, కాస్తంత సాయం చెయ్యరు" అంది లేవబోతూ సౌభాగ్యలక్ష్మి.

ఇంతలో లోపలనుండి దేవకి మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది. ధర్మారావు మంచినీళ్లు తాగి, సోఫాలో కూర్చుంటూ భార్య ఆత్రం గమనించి సారాంశమంతా రెండు ముక్కల్లో చెప్పేశాడు - చిరునవ్వు చిందించుకుంటూ "అంతా ఖాయమైంది, ఒక్క దెబ్బకు రెండు పిట్టలు పడ్డట్టైంది" అని.

మీనాక్షి చేతులు ఇంట్లో వస్తువులు సర్దటంలో లీనమయివున్నా చెవులు తల్లిదండ్రీ సంభాషణమీదే లగ్నమయివున్నాయి. దేవకి పక్కగదిలోకిపోయినా ఆమె దృష్టీ తండ్రి చెప్పే మాటలమీదే వుంది. మీనాక్షి రాధాకృష్ణుల విగ్రహాన్ని బట్టతో తుడుస్తోంది. ఒక స్నేహితురాలికి గిఫ్ట్ కొనే ఉద్దేశంతో వెళ్లి తనకు నచ్చితెచ్చుకుందా విగ్రహాన్ని.

"రెండు పిట్టలేంటి? చెప్పేదేదో తిన్నగా చెప్పరాదూ?" అంది అసహనంగా సౌభాగ్యలక్ష్మి.

"చిన్నమ్మాయి పెళ్లెప్పుడు చేస్తారని అడిగారు. కుదిరితే ఈ సంవత్సరమే చేసేవాళ్లం లేదుగనుక వచ్చేయేడు చేస్తామన్నాను" చెప్పున్నాడు ధర్మారావు.

"మీరొకళ్లు ... అవసరమైంది తప్ప మిగతావన్నీ చెప్తారు. ముందు అసలు సంగతి చెప్పండి"

"ఒకటే తొందర, సాంతం చెప్పనివ్వవు. పెద్దమ్మాయి నచ్చింది వాళ్లకు. పెళ్లిచూపుల రోజు పెళ్లికొడుకుతో అతని పినతండ్రి కొడుకు కూడా వచ్చాడు గుర్తుందిగా, అతనికి మీనాని చేసుకుంటామని అడిగారు. అతగాడికి అమ్మాయి నచ్చిందట. కట్నం ఎంతిస్తారు అని అడిగారు. ఇద్దరికీ చెరి పాతికవేలూ ఇస్తామని చెప్పాను. వాళ్లేం బేరంచెయ్యలేదు. సరే ... మామూలు లాంఛనాలు మీ ఓపికకైనవి జరిపించమన్నారు. ముచ్చటైన కుటుంబం. ఏ విషయంలోనూ వాళ్లు పట్టుబట్టలేదు. మే నెలలో ముహూర్తాలున్నాయి. అప్పటికి మీనా పరీక్షలు కూడా అయిపోతాయి కాబట్టి అప్పుడు రెండు వివాహాలూ ఒకేసారి జరిపించేద్దాం అన్నాను, వాళ్లు సరే అన్నారు" సంబరంగా చెప్పాడు ధర్మారావు.

ఆ మాటలు వింటూనే మీనాక్షి చేతుల్లోంచి బొమ్మజారిపడి తునాతునకలైంది. ఆ ముక్క

ల్ని కళ్లప్పగించి చూస్తూ నిలబడింది మీనాక్షి.

"నీకేమొచ్చిందే? శుభమాని పెళ్లికబుర్లు చెప్తూంటే అవశకునపు వనులు ... అయ్యొయ్యో! బంగారంలాంటి బొమ్మని నాశనంచేశావుకదే" అంది సౌభాగ్యలక్ష్మి కూతుర్ని చివాట్లు వేస్తూ. ఆమె అంతర్గతంగా అప్పటికే వసికట్టింది - కూతురు తాము కుదిర్చిన నంబంధాన్ని వ్యతిరేకిస్తున్నదని. అందుకే బొమ్మ వగిలిపోయిందన్న బాధకంటే కూతరు కనవర్చబోయే వ్యతిరేకతవట్ల చిరాకు, కోపం కలిగాయి ఆమెకు.

"చాల్లే! నువ్వు నోర్మూయ్యి. అదేం చంటిపిల్లా? కావాలని వడేసిందా? ఏమ్మా మీనా! చెయ్యి జారిందా? పోతే పోయింది బాధవడకు. దాని తాతల్లాంటి బొమ్మలు కొనుక్కోవచ్చు" అన్నాడు ధర్మారావు లేచి వచ్చి ఆమె తల మీద చెయ్యేసి.

'అవును బొమ్మయితే కొనుక్కోవచ్చు. మనుమలు బొమ్మలు కాదుగా కొనుక్కోవటానికి, వగిలిన మనసుల మనుమల బొమ్మలెలా అతుక్కుంటాయి' అని ఆలోచిస్తోంది మీనాక్షి మానసం పైకేం మాట్లాడకపోయినా. ఆమె కళ్లు వర్షిస్తున్నాయి.

"అందుకే నిన్ను పిచ్చిదానివనేది. ఇంతింత చిన్న విషయాలకే ఏడిస్తే రేపు జీవితంలో ఎన్నో నమన్యలొస్తాయి. వాటినెట్లా తట్టుకుంటావమ్మా! లే... లేచి ఆ ముక్కలెత్తి వడేసిరా పో" అన్నాడాయన ఆప్యాయంగా ఆమె కళ్లు తుడుస్తూ.

"చెప్తోంది నీకేనా: ఏంటలా కొయ్యబొమ్మలా నిలబడ్డావు?" అంది సౌభాగ్యలక్ష్మి అరుస్తూ.

మీనాక్షి మెల్లగా ఆ వగిలిన బొమ్మముక్కలన్నీ ఏరి బయట చెత్తకుండీలో పారవేసివచ్చింది. తల్లీదండ్రీ మాటలు ఇంకా పూర్తికాలేదు.

"అనుకోకుండా బలే కలిసొచ్చిందండీ" అంటోంది తల్లి.

"అవును... మన మీనా అదృష్టవంతురాలనుకోవాలి" అన్నాడు తండ్రి.

మీనాక్షికి వళ్లు మండిపోతోంది. తన ప్రమేయంలేకుండా తన పెళ్లి నిశ్చయంచేసొచ్చాడు తండ్రి. ఇప్పుడే నిజంగా పెళ్లయిపోతున్నంత హంగామా కనిపిస్తోంది వాళ్ల మాటల్లో. అంతేతప్ప తన పెళ్లి గురించి తనతో నంప్రదించాల్సిన అవనరం లేదనుకుంటున్నారు" అనుకుంది మీనాక్షి.

"దేనికి!" అంది మీనాక్షి తండ్రితో. ఆమె వీలయినంత సౌమ్యంగా వలికేందుకు ప్రయత్నించినా, ఆ ప్రశ్న కరుకుగానే ధ్వనించింది.

"దేనికేంటే, నీ పెళ్లి కుదిరిందన్ని చెప్తూంటేనూ" అంది సౌభాగ్యలక్ష్మి.

"అవునమ్మా, వాళ్లకై వాళ్లడిగారు నిన్ను" అన్నాడు ధర్మారావు తలెత్తి కూతురువంక చూస్తూ.

"అంతేనా? వాళ్లడిగారు, మీరు నరేనన్నారు. మధ్య నాఇష్టమేం లేదన్నమాట" అంది మీనాక్షి కోపంగా.

"నువ్వు చిన్న పిల్లవు. నీకు తెలీదు ఊర్కో. మాకు తెలీదా ఏది మంచో, ఏది చెడో" అంది తల్లి.

"చేనుకునేది మీరా, నేనా?"

"పిల్లల బాగోగులు ఆలోచించకుండా తల్లిదండ్రులు ఏదీ చేయరు. చేనుకునేది నువ్వని నువ్వే చూనుకుంటావా?"

"ఆఁ నేనే చూనుకుంటా... నాకీ పెళ్లి వద్దు" అంది మీనాక్షి వంతంగా.

"కాళ్లదగ్గరకొచ్చిన బేరం కాశీకి పోయినా దొరకదు. తలుపు తట్టిన అదృష్టాన్ని వద్దంటావా? అంతా మీ నాయనిచ్చిన చనువు - నెత్తికెక్కి పిండికొడ్తున్నావు" అంది సౌభాగ్యలక్ష్మి.

"మెళ్లో తాడు వడ్డమే అదృష్టమని నేననుకోవటంలేదు. నేనీపెళ్లి చేనుకోను" అంది మీనాక్షి న్పష్టంగా.

"ఇంక చెప్పండి మీ ముద్దుల కూతురికి ఏం చెప్తారో. దాని ఇంత పొగరుబోతు నమాధానాలకు మీరిచ్చిన అలుసే కారణం" అంది సౌభాగ్యలక్ష్మి భర్తతో నిష్ఠూరంగా.

"ఏంటమ్మా ఆ పెంకినమాధానం? ఆ అబ్బాయిని చూశావుకదా! భేషుగ్గా వుంటాడు. బిజినెస్ చేస్తున్నాడు. ఎంబియ్యే పానయ్యాడు. మంచి కుటుంబం. ఆస్తికూడా వున్నవాడే.

ఒక్కడే కొడుకు. ఇంతకంటే ఇంకే కావాలి'' అన్నాడు ధర్మారావు కూతురితో అనునయంగా.

''వాటికసలు నేను ప్రాముఖ్యతివ్వను'' అంది మీనాక్షి పెంకెగా.

''మరి వేటికిస్తావు?'' అని నవ్వాడాయన.

ఒక వ్యక్తిని ప్రేమించి పెళ్లిచేసుకోవాలనుకుంది తను. ఏంచూస్తే ప్రేమ కలుగుతుందో ఎలా చెప్పటం? అందులో ఇలాంటి విషయాలు పెద్దలముందు ఎలా చెప్పాలో ఆమెకర్థంకాలేదు. విడమర్చి చెప్పాలంటే బెరుగ్గానూ, అసభ్యంగానూ అన్పించింది ఆమెకు. అందుకే మీనాక్షి ఏం మాట్లాడలేకపోయింది.

''రాజాలాంటి సంబంధం. వెర్రివేషాలు వెయ్యకు. ఇది తప్పితే ఇట్లాంటిది మరొకటి దొరకదు'' అంది సౌభాగ్యలక్ష్మి నచ్చచెప్పే ధోరణిలో.

''ఫర్లేదు, నష్టమేంలేదు. నాకీ పెళ్ళొద్దు, నేనిప్పట్లో పెళ్లి చేసుకోను'' ఖచ్చితంగా అంది మీనాక్షి.

''తెలివితక్కువ వాగుడు కట్టిపెట్టు. నోర్మూసుకుని అవతలకెళ్లు. అంతా నీఇష్టమైతే మేం వున్నదెందుకు''.

''నేనేంమానుకోను. నేను అందర్లాంటి ఆడపిల్లను కాను. నాకు మీరు పెళ్లిచెయ్యాల్సిన పనిలేదు. చేసుకోవాల్సిన అవసరమొస్తే, చేసుకోవాలని అనిపిస్తే, నాకు నేను చేసుకుంటా, లేకుంటే లేదు. అంతేతప్ప వాళ్లూ వీళ్లూ కుదిర్చిన ముక్కూమొహం తెలియనివాణ్ణి మాత్రం ఛస్తే చేసుకోను'' అంది మీనాక్షి రోషంగా.

ధర్మారావుగారు నిర్ఘాంతపోయాడు కూతురి మాటలకు. అంతకుముందెప్పుడూ మీనాక్షి ఇలా మాట్లాడగా, మొండితనం చెయ్యగా చూడలేదు ఆయన.

''సంతోషించాం నీ తెలివితేటలకు. ఎట్లా చేస్కోవో చూస్తా'' అంది సౌభాగ్యలక్ష్మి లేస్తూ. ఆమెకు కూతురి ఆ చెంపా ఈ చెంపా వాయించాలన్నంత కోపం వచ్చింది.

''చూడు! బాగా చూడు. ఇదేం బొమ్మల పెళ్లి కాదు, తమాషా చూట్టానికి. నాకిష్టంలేనివాడితో పెళ్లి జరిపించే హక్కు మీకు లేదు- నేను మేజర్ని''

''ఇదిగో లాపాయింట్లు మాట్లాడావంటే నాకు అరికాలిమంట నెత్తికెక్కుతుంది''

ఇంక కల్పించుకోకుండా వుండలేకపోయాడు ధర్మారావు.

''చూడమ్మా మీనా! పోనీ ఈ సంబంధం వద్దు. నువ్వెవర్నయినా ఇష్టపడ్డావా ఆదేదో చెప్పు. అన్నీ బావుంటే ఆ సంబంధమే చూద్దాం'' అన్నారాయన, తన మనసులో తోచిన కష్టాన్నీ బాధనూ బయటకు కన్పించనీయకుండా.

''నాకేవ్యక్తీ దృష్టిలోలేదు నాన్నా! నేనెవర్నీ ప్రేమించలేదు'' అంది మీనాక్షి.

ఆ మాటతో ఆయన అంతరంగం సంతోషించింది. మెల్లగా నచ్చచెప్పి కూతుర్ని తమ వైపు తిప్పుకోవచ్చన్న ఆశ కలిగింది ఆయనలో.

''మరింకేమిటమ్మా నీ అభ్యంతరం?'' అన్నాడాయన.

''నాకీ అరేంజ్‌డ్ మారేజ్ ఇష్టంలేదు''

''ఎంత బరితెగించి పోయావే, సిగ్గూ శరంలేకుండా... ఛీఛీ''

''నువ్వూరుకో భాగ్యం! ఏంటమ్మా, చిన్నపిల్లలా అర్థంపర్థంలేని మాటలు మాట్లాడుతున్నావు. నీ దృష్టిలో ఏ పిల్లవాడూ లేడంటివి. మేం కుదిర్చిన సంబంధం పనికిరాదంటూంటివి. ఒకటి గుర్తుంచుకో... మేమేం చేసినా మీ మంచికోసమే చేస్తాం. అవతల మాటిచ్చాను, పరువు పోయేట్టుచేయకు'' అన్నాడు ధర్మారావు.

''నన్ను అడక్కుండా మిమ్మల్నెవరు ఒప్పుకోమన్నారు? ఇవేం బట్టలా నాన్నా కట్టినన్నినాళ్లు కట్టామని సరిపెట్టుకోటానికి. ప్లీజ్ నాన్నా... తప్పైతే క్షమించండి, కానీ నాకు నచ్చినవ్యక్తి దొరికతే తప్ప నేను పెళ్లిచేసుకోను''

ధర్మారావు ఏం చెప్పి ఒప్పించాలో తెలియని విమూఢుడైపోయాడు.

''దాన్నేంటి బతిమాలేది? బుజ్జగించి చెప్తే చెట్టెక్కుతోంది. అరు నూరైనా నూరు ఆరైనా ఈ పెళ్ళి జరిగితీరుతుంది. మీరు పదండి, భోజనం చేద్దురుగాని'' అంది సౌభాగ్యలక్ష్మి

# గుర్తుంచుకోండి, పోషణపరంగా సమతూకమైన ఆహారం తినిపించకపోతే, మీ పాపాయికి తగినంతగా బరువు పెరిగేందుకు అవసరమైన ప్రోటీన్‌లు లభించవు.

## 'అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

మీ డాక్టర్‌ని అడగండి, ఆయన మీకు రెండు ముఖ్యమైన విషయాలు చెబుతారు. ఒకటి, ప్రోటీన్‌లు మీ పాపాయి కండరాలు, శరీర కణాలు పెరగడంలోను, రక్తం ఏర్పడటంలోను తోడ్పడతాయన్నది. రెండవది, సరయిన ప్రోటీన్‌లు లభించాలంటే మీ పాపాయికి ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు పోషణ రీత్యా సమతూకమైన ఆహారం అవసరమన్నది. ఇటు వంటి ఆహారం ప్రతి రోజు తినిపించాలి. చాలా మంది తల్లులకు సంప్రదాయమైన ఆహారంతో యీ పని సాధ్యం కాక పోవచ్చు.

దీనికి పరిష్కారం ?

సెరిలాక్. ఎందుచేతనంటే ప్రోటీన్‌లు పుష్కలంగా గల రెండు ఆహార పదార్థాలు పాలు, గోధుమ సెరిలాక్‌లో ఉన్నాయి. ఇందులో కార్బోహైడ్రేట్లు (పిండి పదార్థాలు) కొవ్వు పదార్థాలు, విటమిన్లూ, ఖనిజాలు, ఇనుము, కేల్షియం సరైన పాళ్ళల్లో ఉన్నాయి. ఇది మీ పాపాయికి 4వ నెల నుంచి, అంటే పాలు ఒక్కటే సరిపోని వయసు నుంచి, తినిపించేందుకు ఘన రూపంలోని సమతూకమైన పోషకాహారం. అదీకాకుండా, సెరిలాక్ చాలా రుచిగా ఉంటుంది. పిల్లలకు అది చాలా యిష్టమైనది.

అందుచేత పోషణ రూపేణా సమతూకమైన సెరిలాక్ వల్ల ఉండే లాభాలన్నింటిని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 నెలల వయసు వచ్చినప్పటి నుంచి, వీట్-ఆపిల్ వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ యొక్క అదనపు లాభాన్ని కూడా సమకూర్చండి.

ప్యాక్ మీద యివ్వబడిన సూచనలను దయచేసి పాటించండి.

---

**ఉచితం** సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి : సెరిలాక్, పోస్టుబ్యాగ్ నం. 21, న్యూ ఢిల్లీ-110 029

---

నెస్లె వారి నాణ్యమైన ఉత్పాదన






Mudra D: NES: 0020 TEL

## మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

భర్తతో.

"సరేసరె నాక్కాదు ... నా శవానిక్కట్టిద్దురు గాని తాళి" అంటూ వినవిసా మేడమీదకు వెళ్ళిపోయింది మీనాక్షి.

దేవకికీ చెల్లెలి మొండిపట్టేమిటో అర్థంకాలేదు. తండ్రి తనను సంప్రదించినప్పుడు కూడా ఆమె ఇదీ కారణమని నిర్ధారణగా చెప్పలేకపోయింది.

ఆరోజు రాత్రివూట ఆమె అన్నం తిననని భీష్మించుకుకూర్చుంది. కాని దేవకి, లక్ష్మీ తమకి ఆకలేస్తోందనీ, ఆమె తినకపోతే తామూ తినమని పట్టుబట్టటంతో వినక తప్పలేదు మీనాక్షికి. ఆ తర్వాత దైనందిన కార్యక్రమాలన్నీ యథాప్రకారం జరిగిపోతూనేవున్నాయి. ఎవరూ మీనాక్షి ఎదుట పెళ్లి ప్రసక్తి తేలేదు. ఆ పరిస్థితిలో మీనాక్షికి ఏం చేయాలో తోచలేదు. ఆమె గుండెలు గుబగుబలాడుతూనే వున్నాయి.



వారంరోజులు కాలేజికి సెలవు రావటంతో మీనాక్షికి సంధ్యను కలవటం పడలేదు. ఓరోజు తీరికచేసుకుని సంధ్యావాళ్లింటికి వెళ్లింది ఆమె.

"వావ్వా ... ఈ చీరలో ఎంత బావున్నావో మీనా!" అంది సంధ్య ఆమె భుజాలు పట్టుకు ఊపేస్తూ.

"థాంక్స్" అంది మీనాక్షి ముక్తసరిగా.

"ఏమైందీమధ్య? ఈ ముభావం నాకు నచ్చదు"

"ఏం లేదు ... నిజంగా బాగున్నానా?"

"అబ్బే ... కాదు అబద్ధం. నీతో నాకిప్పుడేంపనిలేదు మస్కాకొట్టేందుకు" అంది సంధ్య.

"సంధ్యా! అసలు అందం ఎక్కడుంటుందంటావు? ముక్కులోనా, కళ్లల్లోనా, మొహంలోనా, కాళ్లల్లోనా, చేతుల్లోనా?"

"నీ మొహం ... అలా విడివిడిగా వుండదు అందం. అన్నీ బాగున్నా అందంగా అన్పించరు కొందరు. అన్నింటి సమాహారమే అందం. అసలు అందమనేది చూసేవాళ్ల మనసులో వుంటుంది.

దేవకి స్ఫుటమైన ముక్కు, పెద్ద కళ్లు, చిన్న మూతి కలిగి పసిమిఛాయలో పుత్తడిబొమ్మలా వుంటుంది. కాని ఆమెలో ఆకర్షణ లేదనే చెప్పాలి. మీనాక్షిలో ఏ అవయవమూ ప్రత్యేకించి అందమైందని చెప్పలేం. కాని ఆమె వెడల్పాంటి కన్నుల్లో ఏదో వింతకాంతి వుంటుంది. కళ్లు చికిలించి నవ్వుతుంటే ఎలాంటివారినైనా ఆకట్టుకుంటుంది.

"సంధ్యా! ఆరోజు అక్క పెళ్లిచూపులయ్యాయిగా అప్పుడు పెళ్లికొడుకు పినతండ్రి కొడుకు కూడా వచ్చాడు. అతగాడికి నేను నచ్చానట, ఒక్క చూపులో ఏం చూశాడో. అతనితో నా పెళ్లి ఖాయం చేసుకువచ్చానని చెప్తున్నారు నాన్న" అంది మీనాక్షి.

"ఎట్లావుంటాడు అతను! ఏం చదివాడు! ఏం వుద్యోగం?"

మీనాక్షి వివరాలన్నీ చెప్పింది.

"ఇంత శుభవార్త చెప్పటానికి నీకు వారంరోజులు పట్టిందన్నమాట. పోన్లే ఇల్లాలివైపోయి త్వరగా ఓ గంపెడు పిల్లన్ని కనేయి" అంది సంధ్య.

"నువ్విలా అమ్మమ్మలాగా మాట్లాడకు. అరేంజ్డ్ మారేజెస్ మీద నా అభిప్రాయం నీకు తెల్సు. నాకీ పెళ్లి ఇష్టంలేదు"

"చాల్లే ఆపవే పిచ్చీ. ప్రేమ పెళ్లి అనుకున్నావు. ఇప్పుడేం పోయిందీ! పెళ్లాడి ప్రేమించు"

"అదెట్లా, అతని మనస్తత్వం ఎట్లాంటిదో? ఇద్దరివీ ఒకేరకమయిన భావాలు కానట్లయితే అతన్నెట్లా భరించగలను?"

"నీ అమాయకత్వానికి నవ్వాలో ఏడవాలో అర్థంకావటం లేదు. సృష్టికి ఆదీ అంతంగా నువ్వే అరేంజ్‌డ్ మారేజ్ చేసుకోవటంలేదు. అంతా తమకై తాము ఎంచుకునే చేసుకుంటున్నారా మన సమాజంలో. అయినా నువ్వు ఎంచుకున్నా అతని మనస్తత్వాన్నంతా కాచివడపోయగలవా? ప్రపంచం అంతా నటన. పైకి కనిపించినంత మంచివాళ్లెవరూలేరు. అసలు రంగు అన్నిసార్లూ ప్రదర్శించాల్సిన అవసరం వుండదు జనాలకు" అంది సంధ్య.

"అయినా ఫర్లేదు, మనకి మనమే సొంతం అర్థం కాము. అయినా గుడ్డిలో మెల్ల మేలే కదా!" అంది మీనాక్షి.

"నీదంతా వితండవాదం. కలసి కాపురాలు చేస్తున్నంత మాత్రాన ప్రేమ పెళ్లిళ్లన్నీ విజయవంతాలేనా? ఆర్థిక ప్రాతిపదిక నువ్వొప్పుకోవు. నామాటవిని బుద్ధిగా అతన్ని చేసుకో. ఏం కాదు, అంతా బానే వుంటుంది"

"లేదు సంధ్యా ... జీవితంలో దేనికైనా కాంప్రమైజ్ కావచ్చుగానీ లైఫ్‌పార్ట్‌నర్ విషయంలో అలా వీల్లేదు. నీకెలా చెప్తే అర్థమవుతుందో నాకర్థం కావటంలేదు" అంది మీనాక్షి విసుగ్గా.

★ ★ ★

అయితే మీనాక్షి రాజీపడక తప్పలేదు. ఈ పెళ్లి వద్దని మీనాక్షి ఎంత మొత్తుకున్నా ఆమె మొర విన్నవాళ్లులేరు. ధర్మారావుగారు మీనా కాపురమెలా వుంటుందో అని మధనపడ్తూనే వున్నాడు. కాని భార్య నచ్చజెప్పింది. దేవకి, మీనాక్షిల పెళ్లిళ్లు రెండూ ఒకేరోజు కొంత ముహూర్త వ్యవధిలో నిర్ణీతమయ్యాయి. పెళ్ళి మరో పదిహేను రోజులుందనగా శుభలేఖలు అచ్చువేయించారు. మీనాక్షి శతవిధాల బతిమాలీ, బెదిరించీ, ఏడ్చీ, మొరపెట్టుకుని విసిగివేసారింది. ఆమెకి ఆ పెళ్ళి తప్పించుకునే గత్యంతరం కనిపించక మరణమే శరణ్యమనుకుంది. ఓరోజు అర్థరాత్రి స్లీపింగ్ పిల్స్ మింగింది. ఆ మర్నాటి ఉదయం ఎంతలేపినా లేవని మీనాక్షిని అనుమానించి హాస్పిటల్‌కి తీసుకువెళ్లారు. డాక్టర్లు అతికష్టంమీద ఆమెని బతికించారు. ఆ తరువాత ఆమెని కంటికి రెప్పలాగ చూడసాగింది తల్లి. ఇంక అటువంటి పనులు చేయనని ఆమెచేత ప్రమాణం చేయించుకుని అనేకవిధాల నచ్చచెప్పి, ఆమె మనసుతో నిమిత్తం లేకుండా తనువుకు వివాహం జరిపించి వరువుకాపాడుకున్నారు పెద్దలు.

మీనాక్షి భర్త రామచంద్రం. పెళ్ళిపీటల మీద పాలిపోయిన ముఖంతో, పెళ్లిచూపులరోజున కన్పించిన ఉత్సాహమంతా మృగ్యమవగా ఒట్టి బండలా జడపదార్థంలా చెప్పినట్లు చేస్తూవున్న మీనాక్షిని చూసి అతనికి ఆశ్చర్యం కలిగింది. ఆమె అలా ఎందుకుందో తమ మొదటిరాత్రే అర్థమయింది అతనికి. గదిలో కాళ్లు ముడుచుకుకూర్చుని, చేతులు కాళ్లమీద మొహం మోకాళ్లమీదా పెట్టుకుని ఏదో ఆలోచిస్తూ కూర్చుని వున్న భార్యని అడిగాడు రామచంద్రం:

"అదేం మీనా ... అలా వున్నావు, ఒంట్లో బాలేదా?" అని. మీనాక్షి జవాబు చెప్పలేదు.

"ఎందుకో రాణిగారు అలకసాగిస్తున్నారు" అని జోకేశాడు అతను.

తలెత్తి అతనివంక చూసి, మళ్లీ తల తిప్పేసుకుంది మీనాక్షి.

"ఏవిటా నిర్లక్ష్యం" అన్నాడు రామచంద్రం.

"లక్ష్యం వుండాల్సింది మీకు. డబ్బు పోసి కొనుక్కున్న వస్తువుని ఇష్టం వచ్చినట్లు వాడుకోవచ్చు కొనుక్కున్నవాళ్లు" అంది మీనాక్షి.

"ఓహో ... మీ నాన్న కట్నం ఇవ్వాల్సివచ్చిందని కోపమా?"

మీనాక్షి మాట్లాడలేదు.

"చెప్పు ... చెప్పు, విషయం చెప్పకపోతే నాకెలా అర్థమవుతుంది?"

"మీకు మాటలు, ప్రేమ అనవసరం. సంతలో ఓ గేదెను కొని పలుపుతాడు వేసి తెచ్చుకోవటం మీకు కావల్సింది. విచిత్రమేమిటంటే గేదెను డబ్బిచ్చి కొనుక్కుంటారుగానీ ఇక్కడ ఆడపిల్లల్లే డబ్బులిచ్చి మొగవాణ్ణి కొనుక్కోవాల్సి వస్తున్నది"

"చాలా తీవ్రమయిన భావాలేవున్నాయి నీకు. నువ్వు డబ్బిచ్చి నన్ను కొనుక్కున్నావని ఎందుకనుకోవాలి? మీ నాన్న అల్లుడికి కానుక ఇచ్చాడని ఎందుకనుకోగూడదు"

"కానుకలు ఇచ్చేవాళ్ల ఇష్టం, శక్తిమీద ఆధారపడి వుంటాయి. ఇంత ఇవ్వాలని ఖరారుగా మాట్లాడుకోరు"

"అయితే వరకట్నానికి వ్యతిరేకివన్న మాట"

"కట్నం ఇవ్వటానికే కాదు ఈ పెళ్లికే వ్యతిరేకిని"

"అదేం ... నేనంటే ఇష్టంలేదా"

"అసలీ పెద్దలు కుదిర్చే పెళ్లిళ్ళంటేనే ఇష్టం లేదు"

"ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకున్నావన్నమాట"

"అవును"

"మరి ఎవరినైనా ప్రేమించావా?"

"లేదు"

"మరింక అభ్యంతరమేం? ఇప్పుడు మనం తీరిగ్గా ప్రేమించుకోవచ్చు"

"జైల్లోపెట్టి జైలు గోడల్ని ప్రేమించమంటే మీకెలా వుంటుంది?"

"జైలు గోడల్లాంటి ఓ పదార్థంకాదే నేను"

"అసలు మీకు సిగ్గెలా లేదు? ముక్కూ మొహం తెలీని స్త్రీని వివాహం చేసుకోవాలని ఎలా అన్పించింది మీకు?"

"నాకు నీకున్న అధునాతన భావాలులేవు. నేను వట్టి సంప్రదాయపు మనిషిని. మరి నువ్వెందుకు చేసుకున్నావు?"

"నా శక్తి వంచన లేకుండా ప్రతిఘటించాను. తప్పక మెడవంచి తాళికట్టించుకున్నాను"

"అయితే ఇప్పుడేం చేద్దాం?"

"అదే నాకూ తోచటం లేదు"

"అంటే సంప్రదాయపు గూడునుండి నువ్వు బయటపడలేదన్నమాట"

"అదేం అలా అంటారు?"

"సరే దాన్ని వదిలెయ్. ఈ ప్రశ్నకు జవాబు చెప్పు, నేనంటే ప్రత్యేకంగా అయిష్టతేమన్నా వుందానీకు!"

"లేదు"

"అయితే నాకో అవకాశమివ్వు. నన్ను ప్రేమించటానికి ప్రయత్నించు"

"సాన్నిహిత్యం ఇష్టాన్ని కలిగిస్తుంది. కాని అది అసలైన ప్రేమ వివాహమవుతుందా?"

"అసలు ప్రేమ వివాహం మాత్రం సఫలమవుతుందని ఏమిటి నమ్మకం?"

"అదెందుకు సఫలం కాదు. ఒకరి అభిప్రాయాన్ని ఒకరు తెల్సుకుని, ఇద్దరి అభిప్రాయాలూ ఒకటై చేసుకునే పెళ్లి సఫలంకాక మరేమవుతుంది?"

"వ్యక్తులమధ్య గౌరవం ప్రేమ చోటుచేసుకోవటానికి అభిప్రాయాలు ఒకటి కావాల్సిన అవసరం లేదేమో"

"ఒకటి కాకుంటే ఆ వ్యక్తులు దగ్గరెలా అవుతారు"

"పోనీ నీమాటే ఒప్పుకున్నా మనిషిని నిర్వచించటం అంత సులభం కాదు. బాధ్యతల్లేని ప్రేమ బరువూ బాధ్యతలలో కూడిన సంసారంలో ఇంకిపోవచ్చు.

"ఏమో ... ఆ విషయం మీరూ స్పష్టంగా చెప్పలేరు"

"ఏదిమాత్రం స్పష్టంగా చెప్పగలం? రేపొద్దున నువ్వు నన్ను గాఢంగా ప్రేమిస్తావేమో"

"ఇంత అనిశ్చితమైన మనసున్న మనిషితో బతకటం కష్టం"

"మరేం చేద్దామనుకుంటున్నావు?"

"నన్ను మా ఇంటికి పంపేయండి. నేను ఇంకా చదువుకోవాలి"

"ఈ మూడురోజులూ ఆగు, ఆ తర్వాత నీ ఇష్టం"

"ఈ లోపు నన్ను నన్నుగా వుండనిస్తారా?"

"ఇంత పెంకి ఘటాన్ని బలవంతంగానైనా నా దాన్నిగా చేసుకోవాలని వుంది. కానీ ఆ తర్వాత భవిష్యత్తంతా నువ్వు నన్ను దోషిగా చూడటం నాకిష్టం లేదు"

"అదీ నాకు నచ్చేట్టు మాట్లాడారు"

"చూశావా? ప్రేమించటం మొదలుపెట్టావు. చూడు నేనూ ప్రయత్నిస్తాను నీ ప్రేమ పొందేందుకు. నాకూ అవకాశం ఇవ్వు"

"సరే ... మీరన్నట్టు మీకే మొదటి ఛాన్సు ఇస్తున్నాను. నా మనసును గెల్చుకుని, నన్ను గెల్చుకోండి"

"నువ్వేమన్నా అనుగానీ, నీలో సంప్రదాయపు ఛాయల ఇంకా పోలేదు"

"సంప్రదాయం పనికి వచ్చేంత వరకూ వదిలి పెట్టాల్సిన అవసరంలేదు. పాస్ట్‌లేస్ ఫౌండేషన్ టు ద ప్రెజంట్ అండ్ ద ఫ్యూచర్"

"గుడ్ - ఆ ఆలోచనాస్థాయిలో వుంటే నాకు అనుమానంలేదు. నువ్వు నాదానివే"

"పాపం మీకు ఇబ్బంది కల్గిస్తున్నాను. అయాం సారీ"

"వద్దు... అప్పుడే అన్ని మెట్లు దిగజారకు. మెల్లమెల్లగాదిగితే నడుం విరగదు"

"ఎదుటి మనిషిమీద సానుభూతి చూపటం మెట్లు దిగజారినట్లుకాదు"

"సరే ... నువ్వు అంగీకరించినా, అంగీకరించకున్నా ప్రపంచం దృష్టిలో నేను నీ భర్తని. అందువల్ల నాకు కొన్ని బాధ్యతలు వున్నాయి. ఇప్పుడు నువ్వేం చదువుదామనుకుంటున్నావు?"

"బియ్యేస్సీ పాసయితే ఎమ్మెస్సీ చేయాలనుకుంటున్నా"

"సీటు రావాలి కదా!"

"వస్తుంది"

"సరే ... వస్తే చదువు. నేను అప్పుడప్పుడూ నిన్ను కలుసుకుంటూ వుండవచ్చా? దానికీ అభ్యంతరముందా?"

"నిరభ్యంతరంగా కలుస్తూవుండండి. చెప్పాను కదా మొదటి ఛాన్సు మీరే నని"

"సరే ... నువ్వు నన్ను అండీ అనే పిలవాలా!"

"కొత్తమనుమలనందర్నీ గౌరవంతో మర్యాదగా పిలవటం ఉచితం కదా"

"మరి నేను నువ్వు అంటున్నాను"

"మీరు నన్ను భార్యగా అంగీకరించారు కనక అలాపిలవటం సహజం"

"మరి నువ్వు నన్ను భర్తగా అంగీకరించినప్పుడు మీరు అనటం మానేస్తావన్నమాట"

"ఏమో చెప్పలేం చూద్దాం"

"రాత్రి పన్నెండు గంటలు దాటింది. చాలాసేపు అలా మాట్లాడుతూనే కూర్చున్నారు మీనాక్షీ రామచంద్రంలు. ఆమె దుప్పటి కింద పరుచుకుని పడుకుంది. అతను మంచంమీద పడుకున్నాడు. ఇద్దరికీ నిద్ర పట్టలేదు. అలా ఆలోచిస్తూనే వుండిపోయారు. రామచంద్రానికి భార్య అపరిపక్వ మనస్తత్వం అర్థమయింది. తను పట్టిన కుందేటికి మూడే కాళ్లనే మనస్తత్వమనీ, కల్లాకపటంలేని వ్యక్తనీ అర్థమయింది. ఆమెను తన దారికి తెచ్చుకోవటం ఏం కష్టం కాదని అతనికి అర్థమయింది. కాకపోతే తను కొంత ఓర్పు వహించాల్సి వుంటుంది. మీనాక్షికీ అతని సాన్నిహిత్యంలో ఇష్టత కలిగినా ఉలిక్కిపడ్డట్టు గుర్తుకు తెచ్చుకునేది. తమది ప్రేమ పెళ్లి కాదనీ తాను జాగ్రత్తగా వుండాలనీ.

"మూడురోజులూ అలాగే గడచిపోయాయి. మాటలే కాని చేతలు లేవు. నాల్గోరోజు మీనాక్షి పుట్టింటికి వచ్చేసింది.

"రామచంద్రం మామగారికి ఉత్తరం రాశాడు. మీనాక్షి బియ్యేస్సీ పాసయిత్తే, ఎమ్మెస్సీ చదవాలనుకుంటోందనీ, అందువల్ల ఆమెను తమ దగ్గరే వుంచుకుని చదివించవలసివుంటుందనీ, చదువుకు అయ్యే ఖర్చు తాను భరిస్తాననీ రాశాడు. అతని తల్లి దండ్రులకది ఆశ్చర్యమనిపించినా వారేం మాట్లాడలేదు.

ధర్మారావు దంపతులకు కూడా ఈ పద్ధతి కాస్త వింతగా తోచినా వారేం అనలేదు. పెద్దకూతురు దేవకికి చీరెసారెలు పెట్టి కాపురానికి పంపించారు.

★ ★ ★

గంపెడు బట్టల్ని నాన బెడ్తూన్న సంధ్యని చూసి తల్లి వసుంధర- "ఏం తల్లీ చాకిరేవా? నువ్వు క్రితం జన్మలో చాకలిదానివయ్యుండాలే. చేతినిండా వుంటే తప్ప ఉతకలేవా?" అంది.

"అవును... చాకిరేవే, మన ఖర్మానికి అది వారం గదా. నీకేం నువ్వలాగే చెప్తావు? రోజు రోజూ ఎవడు ఉతుకుతాడు! పదేదేదో ఒక్కరోజే కష్టపడ్తే పోతుంది" అంది సంధ్య.

నిజానికి సంధ్యకు ఎప్పటి పని అప్పుడు

పూర్తిచేసుకోవటం అలవాటు. కానీ పొద్దునా సాయంత్రం వచ్చే ట్యూషన్ విద్యార్థులతో ఏరోజు గుడ్డలు ఆరోజు ఉతుక్కునే తీరిక వుండదు ఆమెకు. ఇంటి ఖర్చులు, తమ్ముడు ఆదిత్య కాకినాడలో చదువుకుంటూండటంవల్ల అతని హాస్టల్ ఖర్చులు ఉన్నాయి. గవర్నమెంట్ ఇంజనీరింగ్ కాలేజీ అయినా, ఫీజులు ఎక్కువలేక పోయినా, అతనికి హాస్టల్ ఖర్చులు తప్పవు. వీటన్నింటికి ఆయన ఇబ్బంది వడిపోవటంచూసి, బియ్యేస్సీలో ప్రవేశించగానే నైన్త్, టెన్త్ క్లాసు విద్యార్థులకు లెక్కలు ట్యూషను చెప్పసాగింది. ఆమె పాఠాలు బాగా చెప్పగలదు. అందువల్ల పొద్దునా, సాయంత్రం ఇరవైమంది విద్యార్థులకు తక్కువగాకుండా వుండేవాళ్లు. వేసవి సెలవులిచ్చినా ఇంకా నైన్త్‌క్లాసు పరీక్ష ఇచ్చిన విద్యార్థులు ట్యూషను కొస్తూనే వున్నారు. ఆ డబ్బుతో తన ఫీజు, చెల్లెలు వింధ్య ఫీజు తామిద్దరికీ కావల్సిన పుస్తకాలు, గుడ్డలూ తండ్రిపై భారం వేయకుండా కొంటూ వుంటుంది. అందువల్ల ఆయన చాలా రిలీఫ్‌గా ఫీలయేవాడు.

"అన్నం మాత్రం రోజూ ఎందుకు తింటం? వారానికోసారి తింటే పోదూ" అంది తల్లి.

"నువ్వు వారానికోసారి వండు, అలాగే తింటా" అని సంధ్య ఆ బట్టలు ఉతికి, పైన ఆరవేసేందుకు డాబామీదికి వెళ్లింది. ఇంతలో ఆమెకి పక్క డాబామీదినుండి సన్నగా చప్పట్లు వినిపించాయి. ఏమిటా అని అటు తిరిగింది ఆమె.

"శ్రీనివాస్ నవ్వి, తన నొసటమీద చెమట తుడుచుకుంటున్నట్లు అభినయించి, ఆమె శ్రమకు జాలిపడుతున్నట్లు నాలుకతో, ప్ప ప్ప ప్ప అన్నాడు. సంధ్య చుట్టూ కలియచూసి హి అని వెక్కిరించినట్లు పళ్లన్నీ బయటపెట్టి నవ్వి, తలొంచుకుని తన పని చూసుకోసాగింది. ఆమె అతనికి ఎన్నోసార్లు తనతో మాట్లాడొద్దని హెచ్చరికలు చేసినా అతను వాటిని పెడచెవిని పెట్టేశాడు. ఏదో వంకతో మాట్లాడకుండా వుండేవాడుకాదు. సంధ్యకూ అతని మాటలు వినటంలో ఆనందంకలిగినా సంప్రదాయం ఆమెని వెనక్కి లాగేది. బెరుగ్గా, తప్పదన్నట్లు అతనితో మాట్లాడేది.

"ఏయ్" పిల్చాడు శ్రీనివాసు.

సంధ్యనొసలు చిట్లించి, కోపంగా చూసి చీరెను ఝాడించి విప్పదీసి ఎండేయసాగింది.

"మిమ్మల్నే..." అన్నాడు వాసు.

"పిలవకండలా, ఎవరైనా చూస్తారు" మెల్లగానే అన్నా గొంతులో తీక్షణత ధ్వనించింది.

"పిలిస్తే తప్పేం"

"వాదించకండి. అయినా ఎందుకు పిల్చారు?"

"ఏముంది... తర్వాతోసారి మా ఇంటికి రండి"

కాదంటే ఇంకేం సంభాషణ పెంచుతాడోనని "సరే మీరెళ్లండి" అంది సంధ్య.

"అతని పిలుపూ, మాటలూ వీనుల విందుగా వినిపిస్తాయామెకు. అవి మరల మరల ధ్వనిస్తూ అమృతధారల్లా మధురాతి మధురంగా వుంటాయి. కానీ ఎవరేమనుకుంటారోనని ఆమె భయపడ్తుంది. ఇంట్లో శిక్షణా, తను చూసిన సమాజం నేర్పినవవి. అంతరంగం ఎదిసి వద్తుంటే వాస్తవికత ఆమెను శాంత పరుస్తూ వుంటుంది. అయినా అతని పిలుపుకి నాగస్వరం విన్న నాగులా ఆమె తనువు పులకించిపోతుంది. ఒకోసారి తననుతాను అదుపులో పెట్టుకోవాలన్నా కుదరటంలేదామెకి.

స్నానం చేసి, అన్నంతిని రంగనాథంగారింటికి వెళ్లింది సంధ్య.

"హమ్మయ్య వచ్చారా! రారేమోనని భయపడ్తున్నాను" అన్నాడు బయటవరండాలోనే సంధ్యరాకకై ఎదురుచూస్తున్న వాసు.

"ఎందుకు?"

"ఏముంది"

"నేనేం వనిమనిషిలా కనిపిస్తున్నానా!"

"అబ్బో బాగానే మాట్లాడతారే! ఇందాకైతే అచ్చం అలాగే వున్నారు"

"పనిచేసేటప్పుడు ఎవరైనా అలాగే వుంటారు. ఇదేం సినిమానా పెళ్లికూతుర్లా వుండటానికి?"

"నిజమే... ఇప్పుడు పెళ్ళికూతుర్లానే ఉన్నారు"

"మీరిలా మరీ చొరవచేసుకుని మాట్లాడటం నాకేం నచ్చలా. ఇందాక్కూడాఅలా పిలవటం ఎవరైనా చూస్తే ఎలా వుంటుంది?"

"నాకూ బొత్తిగా నచ్చలా"

"ఏంటది!"

"మీ పిరికి తనం"

"నేనూ మాగాణ్ణయితే అలాగే అందును"

"ఇందులో ఆడామగా ప్రసక్తి లేదు"

"లేదన్నంతలో పోయే సమాజం కాదు మనది. ఇంతకీ ఎందుకు పిల్చారు?"

"చెప్తా ముందు కూర్చోండి"

"నాకేం మర్యాద చేస్తార్లే. అవునూ పిన్నిగారూ, సునందావాళ్ళు కన్పించరేం?"

"అందరూ పెళ్ళికెళ్లారు. నాకోచిన్న సాయం చెయ్యాలి మీరు"

"నేనా? ఏంటది?"

"రేపు సునంద పుట్టినరోజు. తనకో చీరె ప్రజెంట్ చేద్దామనుకుంటున్నాను. నాకు చీరల గొడవ తెలీదు. కాస్తంత మీరు కనికరించి, చీర సెలెక్ట్ చేసి పుణ్యం కట్టుకోవాలి"

"సునంద అతని మేనమామ కూతురు. అతని కంటే వయసులో ఓ సంవత్సరంపెద్దది. టెలిఫోన్ ఆపరేటర్‌గా పనిచేస్తోంది. రంగనాథంగారు సంబంధాలు [illegible]స్తున్నాడు. ఇంకా ఏదీ కలసిరాలేదు"

"ఇది మరీ బావుంది. తనకే డబ్బులిస్తే కొనుక్కుంటుంది" అంది సంధ్య.

"ఊహూ బాగోదు"

"నన్ను రమ్మనటం అంతకంటే బాగోదు"

"ప్లీజ్ కాదనకండి. ఒక్కసారి షాపుకొచ్చి చీరె సెలక్ట్ చేయటమేగా" అన్నాడువాసు బతిమాలుతూ.

"సండే షాపులుండవండీ" రాగంతీస్తూ అంది సంధ్య ఎగతాళిగా.

"తెల్సండీ బాబూ! ఇపుడుకాదు, రేపు సాయంత్రం ఐదున్నరకు చిక్కడపల్లి బస్‌స్టాపులో మీ కోసం వెయిట్ చేస్తూవుంటాను. తప్పక రావాలి మీరు. నాలాంటి అభాగ్యుణ్ణి మోసం చేస్తే పాపం చుట్టుకుంటుంది" అన్నాడు వాసు దీనంగా.

"తనతో మాట్లాడటానికి అతనికిదో వంక అని ఆమెకు తెల్సు. అతని మొహంలోని దీన భావాన్ని చూసి కరిగిపోయిందామె.

'సరే... అయినా నా సెలక్షన్ బావుంటుందనేమిటీ?"

"మీరు కట్టే చీరల్ని చూస్తే తెలీదా?"

"మీకిదేపనా, అమ్మాయిల్ని అన్ని కోణాల నుండి చూట్టం?"

"ఎంతమాట? అందర్నీ ఎందుకుచూస్తాను?"

"నాలాంటి అమాయకుల్ని. చూస్తారా?"

"మీరా అమాయకులు కాదు అసాధ్యులు"

"సరే... రేపు కలుద్దాం" అని చెప్పి ఆమె వెళ్ళిపోయింది.

"సోమవారం సాయంత్రం మీనా వాళ్లింటికి వెళ్లివస్తానని తల్లికి చెప్పి చిక్కడపల్లి బస్సు స్టాపుకు బయలుదేరింది ఆమె. వేసవి సెలవులు కావటం వల్ల సాయంత్రం వచ్చే విద్యార్థుల్ని మధ్యాహ్నమే రమ్మని చెప్పింది. ఆమె వెళ్లేటప్పటికి వాసు ఆమెకై వేచి చూస్తూవున్నాడు. ఇద్దరూ బట్టల షాపులోకి వెళ్లారు. చీర సెలక్ట్ చేసింది సంధ్య. చీర పాకెట్టు పట్టుకుని బయటకొచ్చాక వాసు థాంక్స్ అన్నాడు.

"వెల్కం... ఇకనే పోతున్నా" అంది సంధ్య.

"పోదుర్లెండి... కూల్‌డ్రింక్ తీసుకుని వెళ్దురుగాని"

"నేను కూల్‌డ్రింకులు తాగను"

"పోనీ కాఫీ"

"వద్దు"

"అబ్బా అంత బెట్టు చేయకండి, పక్కనే వుంది హెటల్"

సంధ్యకు రోడ్డుమీద రభసచేయటం ఇష్టంలేక అతడివెనకే నడిచింది. ఫామిలీ సెక్షన్‌లో కూర్చున్న తరువాత, బేరర్‌కి ఇడ్లీ ఆర్డరు చేసి మాటలు మొదలెట్టాడు వాసు.

"అసలీరోజు మిమ్మల్ని ఎందుకు రమ్మన్నానో తెల్సా... నా గురించి మీరేమనుకుంటున్నారు?"

''అందర్నీ గురించి అనుకోటం నాకలవాటులేదు''

''అందరి సంగతీ వదిలేయండీ మీరంటే నాకిష్టం. మీరు నాకు నచ్చారు''

''ఎందుకునచ్చా!''

''అందంగా వుంటారు...?''

''ఈ పైపై అందాలు శాశ్వతం కాదు''

''అరె చెప్పనివ్వండి... నచ్చటానికి అందం కూడా ఒక సాధనమే. మీరు అందంగా వుంటారు. చూడంగానే అందంవల్ల ఆకర్షితుడనయ్యాను. ఆపై మీ మంచితనం చూశాను'' అని గొంతుతగ్గించి అటూ ఇటూ చూసి ''సంధ్య! ఐ లవ్ యూ'' అన్నాడు వాసు.

సంధ్యకు ఒక్కసారిగా సంతోషం ఉప్పొంగింది. బుగ్గలు ఎరుపెక్కాయి.భయమూ అన్పించింది. ఆమె కంగారుగా''చాల్లెండి, చూస్తుంటే మరీ సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్‌లా వున్నారు. ఈ కొన్ని రోజుల్లో మీరు నాలో ఏం మంచితనం చూశారు? అప్పుడే ...'' అంతకంటే ఎక్కువ మాట్లాడటానికి సిగ్గు అడ్డంరాగా ఆగిపోయింది ఆమె.

''కొన్ని రోజులేం ఖర్మ. మన పరిచయమై నాలుగు నెలలు దాటింది. మీకు మాత్రం మనసు లేదా! మనసునడిగి చెప్పండి''

''నాకు బుద్ధొక్కటే వుందని తెల్సు, దాని మీద నాకు నమ్మకం లేదు''

''నిజం చెప్పాలంటే అది ఇప్పుడు నాదగ్గరే వుంది. ఏమైనా సంధ్యా ఐ వాంట్ యు ... ఐ వాంట్ టు మారీ యు''

''కానీ నాకీ ప్రేమా దోమలమీద మంచి అభిప్రాయంలేదు. ప్రేమ పెళ్లిళ్ళంటే నమ్మకం లేదు. ఈ అందం, ఆకర్షణ నాలుగు రోజుల్లో మొహం మొత్తుతుంది. మరుక్షణంలో ప్రేమా ఎగిరిపోతుంది. తరవాత ఏం తిని బతకాలి''

సర్వరు ఇడ్లీలు తెచ్చారు. తింటూ అన్నాడు వాసు.

''పెద్దలు చేసే పెళ్ళిలో మోహం, దాహం కలకాలం నిలుస్తాయా? పెళ్ళి ఒకరు కుదిర్చారా, వారే ఎంచుకున్నారా అన్నది ముఖ్యంకాదు. ఒకరి మనసుకొకరు అర్థం చేసుకుని బాధించకుండా మసలుకోవటం జరిగితే ప్రేమ చెరగదు, తరగదు, కలతలూ కల్లోలాలూ రావు'' అన్నారు వాసు.

''ఏమో... ఇవన్నీ''

''మీరింకేం చెపొద్దు. ఒక్కమాట చెప్పండి. ప్లీజ్ నేనంటే మీ కిష్టమా కాదా?''

సంధ్య సిగ్గుతో కుంచించుకుపోతూ తలెత్తి అతని కళ్లల్లోకి ఓ సారి చూసి, కాదన్నట్టు తలూపి నవ్వుతూ వెంటనే తల పక్కకు తిప్పేసుకుంది.

''నేను నమ్మను... ఆడవారి మాటలకు అర్థాలు వేరులే, ఔనంటే కాదనిలే, కాదంటే అవుననిలే, అని ఓ సినిమా కవి ఎప్పుడో చెప్పాడు'' అన్నాడు శ్రీనివాసు.

''మీ అమ్మగారు ఒప్పుకుంటారా ఈ పెళ్లికి?'' అంది సంధ్య మెల్లగా తలెత్తి మెరుపుకన్నుల్తో అతనివంక చూస్తూ.

''తప్పకుండా ఒప్పుకుంటుంది''

''ఒకవేళ కాదంటే. మావాళ్లు కట్నాలివ్వలేరు''

''మా అమ్మ నామాట కాదనదు. నాకు కట్నాలక్కరలేదు''

''మీ అంతధైర్యం నాకు లేదు. మా అమ్మానాన్నా ఒప్పుకోకపోయినా ఈ పెళ్లి జరుగదు''

''మా అత్తయ్యతో చెప్తాను మీ అమ్మను అడగమని''

''మీ ఇష్టం... నా ప్రమేయం లేకుండా అంతా మీరే చూసుకోవాలి. చివరగా చెప్తున్నా ముందుగా చెప్పాల్సినమాట. ఆ తరవాత చెప్పలేదనవద్దు. ఇప్పుడున్న వ్యవస్థలో ఆడపిల్లకున్న స్వేచ్ఛ తక్కువ. సాంఘిక, ఆర్థికపరమైన కళ్లాలు ఆమెకి స్వేచ్ఛ లేకుండా చేస్తున్నాయి. ఆడపిల్లలు ఏం చేస్తే ఏమవుతుందో అని తల్లిదండ్రులు భయపడ్తూంటారు. అందువల్లే ఓ విధంగా నాకీ ప్రేమ వివాహాలంటే ఇష్టంలేదు. అలాంటి అవకాశం వచ్చింది కాబట్టి చెప్తున్నాను. ఉన్న పరిధిలో నా స్వేచ్ఛకు మీరడ్డంరావద్దు. పైగా నేను చేసే ప్రతిపనికీ సాయంచేయాలి, ఊతనివ్వాలి. మనం వుండేది చిన్నగదైనా కిటికీ తెరచి కొద్ది

వెలుగైనా గదిలోచూడ ప్రయత్నించే తత్వంనాది. భార్యభర్తల నంబంధం యజమానీ, క్రీతదాసీల నంబంధం కాదనీ..."

"బండికి కట్టిన జోడెడ్లనీ అంగీకరించాలంటావు" అన్నాడు శ్రీనివాను ఆమె మాటల కడ్డంవస్తూ.

"అది తప్పుడు ఉవమానం. మనిషి వాటి కంటే ఉన్నతుడు. బుద్ధిజీవి. ఇద్దరూ భాగస్వాములుగా అంగీకరించండిచాలు. ఇది పురుషాధిక్య నమాజం కాబట్టి మిమ్మల్ని ఇలా అడగాల్సి వస్తోంది"

"అవును... ఆ భావాంకురాలను శుష్కింవ చేయకుండా నీరు పోసి పెంచాల్సిన బాధ్యత మీది. అవి పోయిన నాడు నేను కట్టేగాని,



మనిషిని కాదు'' అని తేరుకుని, ''అయ్యో! చాలాసేపయింది. వదండి పోదాం'' అంది సంధ్య.

''కాఫీరానీ... ఒక్కరోజు ఆలస్యమయితే ముంచుకుపోయేదేంలేదు''

''మీకేం మా బాగా చెప్తారు. నే వెళ్లాలి'' అంది సంధ్య. కాఫీ వచ్చింది. కాఫీతాగి బయటపడ్డారు సంధ్య, శ్రీనివాసులు.



''ఏవండోయ్! భర్తగారూ!!'' వీపుమీద మెల్లగా చరుస్తూ లేపుతోంది దేవకి భర్త పరమేశాన్ని.

వరమేశం నిద్రలోనే అటు తిరిగి పడుకున్నాడు. ఆమె తలూపుతుంటే ఆఁ... ఊఁ! అంటున్నాడే తప్ప మేల్కోనటంలేదు.

''నాఖర్మ... కుంభకర్ణుడైనా ఈ పాటికి లేచేవాడే. ఏవండోయ్! మహానుభావా! మిమ్మల్నే లేచేదుందా లేదా?''

''అబ్బా! నన్నోగంట నిద్రలేవకు. కళ్ళు మండుతున్నాయి''

''ఇప్పుడే తెల్లవారలేదు. టైమెంతయిందో తెల్సా!''

''నేను రాత్రంతా బొమ్మలేస్తూనే వున్నాను. తెల్లవారుఝామున నిద్రపోయాను''

''అందుకే అంటారు 'ఊరంతా ఒకదారి, ఉలిపి కట్టెదొకదారి' అని. రాత్రులు జాగారాలు, పగలు నిద్రావస్థ. ఛఛ... నా జీవితం ఇట్లా రాసిపెట్టివుందిగావును. పెళ్లికాక మునుపు ఎంతహాయిగా వున్నాను'' అంది దేవకి.

''అపాపు నీ సుప్రభాతం నన్ను నిద్రపోనీ...''

''నిద్రపొండి... వద్దన్నదెవరు? నాకవతల ఆఫీసుకు టయిమవుతోంది. ఒక్కసారి లేచి తలుపేసుకు పడుకోండి''

వరమేశం బద్ధకంగా అసహనంగా దుప్పటి పక్కకు నెట్టి లేచి వినుగ్గా ఏమిటన్నట్టు చూశాడు.

''ఫ్లాస్కులో కాఫీవుంది. అన్నం ఇంట్లోనే తినండి సరేనా?''

''వరమేశం చాలాసార్లు ఆమె చెప్పేమాటలు వినడు. భార్య మాటలనే కాదు, మరెవరినైనా సరే. ఏదో ధ్యానలో ఏదోలోకంలో విహరిస్తున్నట్లు పరాకుగా వుంటాడు. ఒకమాటఅతని చేత విన్పించాలంటే ఒకటికి పదిసార్లు చెప్పాల్సివస్తుంది. లేకుంటే మామూలుగా అతడి బుర్ర వరకూ అవి చేరవు. ఇతర్ల మాటలు వాక్యాల్లావుంటే ఊ అనో, ఆ అనో, తల వంకించి ఊరుకుంటాడు. ప్రశ్నల్లావుంటే జవాబు చెప్పటం తప్పనిసరి కాబట్టి ''ఆ ఏంటీ'' అంటాడు.

''ఇందాక రామనాధమట వచ్చారు మీ కోసం'' అంది దేవకి.

''ఆఁ''

''మిమ్మల్నోసారి కలవమని చెప్పారు''

వర్గమేశం ఆవలిస్తూ ''ఊ'' అన్నాడు.

''వింటున్నారా?'' అరిచినట్లడిగింది దేవకి.

వరమేశం తుళ్ళిపడి, ''ఏంటీ?'' అన్నాడు.

దేవకి మళ్ళా చెప్పింది.

''సరే వెళ్తా'' అన్నాడు వరమేశం.

''సాయంత్రం ఇంట్లో వుంటారా?''

''ఆఁ''

''ఆఁ అంటే, వుంటారా, వుండరా?''

''ఏమో చెప్పలేను''

''మీసంగతి నాకు తెలియదా?''

''పత్రికాఫీసుకు పోయేపనుంది. కానీ వెళ్తానో లేదో''

''రేపొద్దున వెళ్దుర్లే. ఈరోజు ఇంట్లో

వుండండి''

"ఎందుకు?''

"సుజాత అని నా కొలీగ్ ఒకామె మిమ్మల్ని చూడాలని ఎప్పట్నుండో అడుగుతోంది. ఈ రోజు ఆమెని తీసుకవస్తాను''

"చూశావా మరి మన గొప్పదనం''

"ఆఁ ఆఁ... తింటేగాని రుచి తెలియదు, దిగితేగానీ లోతు తెలియదు అంటారు. దూరానికి బాగానే వుంటాయి. దగ్గరుండి భరించేవాళ్లకదా బరువేంటో తెలిసేది. అసలు మీ ఆర్టిస్టులందరిదీ అదో సపరేట్ కేటగిరి అనుకుంటా. ఇరవై నాలుగ్గంటలూ ఏం ఆలోచిస్తారో ఏమోగానీ'' అంది దేవకి.

"ఇదుగో నువ్విలా స్పీచెస్ దంచి నా నిద్ర చెడగొట్టకు. పద, తలుపేసుకుపడుకోవాలి''

"ఇంతకీ సాయంత్రం...''

"వుంటాను''

"వెళ్తున్నా... బయటకెళ్తే తలుపులన్నీ సరిగ్గా వేసెళ్లండి. పాలు ఒకసారి కాచి వుంచండి...''

"మైగాడ్! రోజూ చెప్పేవేగా, తప్పవా ఈ అప్పగింతలు. నువ్వెళ్లోంది ఆఫీసుకేగాని, అమెరికాకుకాదు'' అన్నాడు పరమేశం బద్ధకంగా.

"సర్లే... పాలు పొయ్యిమీద పెట్టి మర్చిపోయేరు జాగ్రత్త'' అంటూ దేవకి హడావుడిగా చెప్పులు తొడుక్కుని ఆఫీసుకి వెళ్ళిపోయింది. పరమేశం తలుపు గడియవేసి వచ్చి ముసుగుతన్నాడు.

కొత్తగా పెళ్ళి చేసుకున్నాడుగదా, భార్యని సినిమాలకీ, షికార్లకీ తిప్పాలని అతనికి వుండదు. సాయంత్రాలు ఇంట్లో వుంటే పరమేశం శూన్యంలోకి చూస్తూ, సిగరెట్ తాగుతూ ఆలోచిస్తూ వుంటాడు. లేకుంటే కుర్చీలో తల వెనక్కి వేలాడేసుకుని, కళ్లు మూసుకుని, చేతులు తలపై పెట్టుకుని కూర్చుంటాడు. కాకుంటే బీరుగ్లాసు చేత్తో పట్టుకుని, బాల్కనీలో నిలబడి, మెల్లగా తాగుతూ వచ్చే పోయే జనాన్ని చూస్తూ, ఉండుండి, తనలో తానే నవ్వుకుంటూ వుంటాడు.

అతని ఉద్యోగం కూడా వేళా పాళా లేనిదే. అవసరమయితే పగలనకా, రేయనకా క్షణం తీరిక లేకుండా కష్టపడతాడు. పనిలేదు అనుకున్నా, బద్ధకమనిపించినా అలాగే పడి నిద్రపోతూ వుంటాడు. రెండు మూడు పత్రికలకి బొమ్మలేసే ఉద్యోగం అతనిది. అది కాక వేరే చిల్లరపనులు కూడా చేస్తూవుంటాడు అతను. ఒక్కోసారి పత్రికాఫీసులోనే బైఠాయించి బొమ్మలు గీసి వస్తాడు. కానీ ఎక్కువగా ఇంట్లోనే వేసి ఇచ్చిరావటమో, పంపించటమో చేస్తాడు. అతడికి కావాలంటే ఏ పత్రికాఫీసులోనయినా నికరమైన ఉద్యోగం దొరికేది. కాని అతనిది ఒకచోట నికరంగా కూర్చుని ఉద్యోగంచేసే తత్వంకాదు. ప్రతిభావంతుడైన ఆర్టిస్టు కావటంవల్ల అతని పనికి విలువవుంది ... ఆదరణవుంది. అతనికిష్టం లేకపోతే ఎవరూ ఎంతడబ్బూ ఇచ్చి అతని చేత పని చేయించుకోలేరు. ఇష్టంవుంటే డబ్బివ్వకుండానే పనిచేసిపెడతాడు పరమేశం.

అతని మిత్రబృందంకూడా వానరసైన్యంలా ఎక్కువే. అతడు వారి ఇళ్లకు వెళ్లటం తక్కువ. వాళ్లే తరచు పరామర్శించిపోతూవుంటారు. వారానికోసారి అయినా మందు పార్టీ వుండితీరుతుంది. సహజంగా మితభాషే కానీ, మందు పుచ్చుకుంటే మాత్రం ఆ నిషా తగ్గే వరకూ కామాలు, ఫుల్‌స్టాపులూ లేకుండా వాగేస్తుంటాడు. అంతే కాదు అవతలివాళ్లు పడుకున్నా లేపి కూర్చోబెట్టి వినిపిస్తుంటాడు. అతనికేది దాపరికంలేదు అన్నీ బట్టబయలే.

దేవకికి కొద్ది రోజుల్లోనే భర్త ప్రవర్తనపట్ల నిరసన కలిగింది. మొదట్లో చెప్పి చూసింది కానీ, అతణ్ణి మార్చటం బ్రహ్మతరం కూడా కాదని త్వరలోనే గ్రహించింది. అతని మనస్తత్వానికి పూర్తిగా వ్యతిరేకం ఆమెది. ఆమెది ఎంత స్థిరచిత్తమో, అతడంత చంచలుడు. ఆమె ఇక సంసార పక్షపు స్త్రీ.వీలైనంత డబ్బు సంపాదించుకోవాలి, పిల్లలు కలగాలి, వారిని చక్కగా చదివించుకోవాలి, ఓ ఇల్లు కట్టుకోవాలి, దాన్ని అందంగా అలంకరించుకోవాలి, మంచి తిండి తినాలి, ఖరీదైన బట్టలు కట్టుకోవాలి - ఇలా సుఖజీవితం గడపాలని అన్న ఆలోచనలు ఆమెవి. కాని పరమేశానికి ఇవేవీ

వట్టవు. ఆకలెస్తె అన్నంతినటం, నిద్రొస్తే పడు కోవటం తప్ప వేరు విలాసాలేవీ అతనికి అక్కర్లేదు. నాలుగు జతల పైజమాలు, లాల్చీ లు వుంటే చాలు. ఫాషనబుల్ డ్రస్సులూ, సూట్లూ అక్కర్లేదు. గుడ్డలకు ఇస్త్రీవున్నా లేకు న్నా నడిచిపోతుంది అతనికి. తన చేతులో డబ్బుంటే ఎవరికైనా, ఎంతైనా ఖర్చుపెడతా డు. అలాగే తన దగ్గర డబ్బు లేకుంటే నిర్మొహమాటంగా స్నేహితుల దగ్గర పుచ్చు కుంటాడు. ఇచ్చిన డబ్బు అడిగే అలవాటూ లేదు. అలాగే తీసుకున్న డబ్బు తిరిగి ఇవ్వా లనే జ్ఞానమూ వుండదు అతనికి. అందుకే తెల్సిన వాళ్లెవరూ సామాన్యంగా అతనికి డబ్బి వ్వరు.

సంసార జీవితాన్ని రంగుల కలగా ఊహించుకున్నా దేవకికి పూర్తి నిరాశే కలి గింది. అతడి వల్ల తనకేపాటి సెక్యూరిటీ లేనట్లు బాధపడేది ఆమె. ఇంట్లోకి ఏం అవస రమో, ఏం కావాలో ఎన్నడూ అడిగిన పాపాన పోలేదతడు. అసలు ఇంటిసంగతులే పట్టించుకోడు. చెప్పినా గుర్తులేదంటాడు. అటు ఉద్యోగం, ఇటు ఇంటిపనీ, పైగా సరుకు లూసరంజామా తెచ్చుకోవటంతోసహా అన్నీ తనొక్కతే చేసుకుపోవాలి. పోనీ డబ్బయినా బాగా సంపాదిస్తాడా అంటే అదీ లేదు. వారిచ్చి నంత తీసుకోవటమే తప్ప డిమాండ్ చేసే అలవాటులేదు. ఆ వచ్చిన సొమ్ముకూడా తాగ టానికీ, తందనా లాడటానికీ, అడ్డమైనవాళ్లకు దానధర్మాలు చేయటానికీ సరిపోతుంది. ఇంక మిగిలేదెక్కడ. అలాగని పరమేశం బొత్తిగా డబ్బివ్వడని కాదు. అతని జేబులో ఎంత డబ్బుంటే అంత డబ్బూ తీసేస్తుంది దేవకి. జేబులో డబ్బేమయిందని పరమేశం సర్వసా ధారణంగా అడగడు. డబ్బుకు మరీ ఇబ్బంది అయితే నిజామాబాదులోవున్న తండ్రికి ఉత్తరం రాసి తెప్పించుకుంటాడు.

పరమేశం లేచేసరికి ఒంటిగంటయింది. అదైనా కరెంటు పోవటంతో ఫాన్ ఆగిపోయి, చెమటకు మెలకువ వచ్చింది అతనికి. లేచి ముఖం కడుక్కుని, కాఫీ పెట్టుకు తాగాడు. షేవ్ చేసుకునే పని లేదు. గడ్డం పెంచుతున్నా డు. స్నానమదీ కానిచ్చేసరికి రెండున్నరైంది. అన్నం పెట్టుకుని తినాలంటే బద్ధకమని పించింది. భార్య ఎప్పుడో పొద్దున ఆఫీసుకె ళ్తూ హడావుడిగా ఉడకేసిన ఆ చద్దికూడు తినాలని అన్పించలేదు అతనికి. కోరారంగు స్కిల్ లాల్చీ వేసుకుని, కళ్లజోడు తగిలించి, రాత్రివేసిన బొమ్మలన్నీ కలంకారీ సంచీలో సర్ది, అవి తీసుకుని ఇల్లు తాళం పెట్టి బయట పడ్డాడు. ఆకలికి కడుపు నకనకలాడుతోంది. హొటల్లో అన్నం తిన్నాడు. వరుసగా మూడు పత్రికల ఆఫీసులకూ వెళ్ళి బొమ్మలిచ్చి, వాళ్లు ఇవ్వాల్సిన చెక్కు లేవైనా వుంటే జేబులో పెట్టుకొని, దార్లో స్నేహితుల్తో ముచ్చట్లు కాని చ్చి, వచ్చేటప్పుడు రెండు బీర్‌బాటిల్స్ కొని సంచీలో పెట్టుకుని ఇల్లు చేరేటప్పటికి రాత్రి ఏడున్నరయిందిఅప్పటికే దేవకి తన కొలీగ్‌తో సహా వచ్చివున్నది.

పరమేశం కళ్ళజోడు ముక్కు మీదకు జా రుతుంటే పైకి ఎగదోస్తూ వచ్చిన కొత్తామెను ఓసారి పరీక్షగా చూశాడు. సుజాతకూడా అత న్ని చూసింది. దేవకి పరస్పర పరిచయం చేసింది.

"మీరు బొమ్మలు చాలాబాగా వేస్తారండీ. ఆ కథల కంటే కూడా మీరు వాటికి వేసే బొమ్మలె క్కువ బావుంటాయి" అంది సుజాత.

" ఆఁ ఏదోలెండి. ఒకప్పుడు బావుండే వేమో. ఇప్పుడు శ్రద్ధ తగ్గిపోయింది. గుర్తించే వాళ్లు లేనప్పుడు శ్రమ పడటం అనవసరమని పిస్తుంది" అన్నాడు పరమేశం, నవ్వుతూ.

"సరే... ఇఫ్యూ డోంట్‌మైండ్, మీ ఆర్టిస్ట్ లంతా అందమైన బొమ్మలే ఎందుకు వేస్తారు? లోకంలో అంతా మీ భార్యలా అందంగా వుండ రుగా, నాలాంటి అందవిహీనులు కూడా వుంటారుగా" అంది సుజాత.

ఆమె మాటలకు దేవకీ పరమేశం కూడా నవ్వారు.

"మీరు అందంగా లేరని ఎవరన్నారు! ఒక వేళ అనివుంటే అది వాళ్ల దృష్టిలోపం అయి వుండాలి... మీరన్నట్టు మేం ఎక్కువగా అంద మైన బొమ్మలేసే మాట నిజమే. అది మీ పాఠకులకోసమే. తిండి లేక, కళ్లూ పళ్లూ బయటకొచ్చి పక్కటెముకలు కనిపిస్తూ వికా రంగా కన్పించే బడుగు జనాలవి లేక చట్టిము

క్కు, వంకర మూతి, చికిలి కళ్లు వగైరా వికార లక్షణంతో వుండే స్కెచెస్ కూడా సందర్భాన్ని బట్టి గీస్తాం. అయితే ఆ ప్రతిభను ఎవరూ గుర్తించరు. నిజం చెప్పాలంటే అసలు ఆర్టిస్ట్ కి ఎందులోనైనా అందమే కనపడుతుంది. దుర్భర దారిద్ర్యంలోనూ, శోకంలోనూ కూడా కళాకారుడు అందాన్నే వెతుకుతాడు. ఓ దాని మీద మక్కువా, మరోదానిమీద న్యూనతా భావం ఆర్టిస్ట్ కి వుండదు. ఆర్టిస్ట్ దృష్టి ఆబ్జెక్టివ్ గా, పర్సనల్ గా, సౌందర్యసృజన చేసేదిగా వుంటుంది.

భర్త మందు కొట్టకుండా ఇంత సుదీర్ఘంగా మాట్లాడటం దేవకికి ఆశ్చర్యంకలిగించింది. ఆమె తప్పనిసరిగా సుజాతని తీసుకొచ్చిందే కాని, భర్త వరధ్యాన్నం చూసి ఆమె ఏమను కుంటుందోనని భయపడింది.

హమ్మయ్య ఒట్టప్పుడు ఎలావున్నా కనీసం ఇప్పుడు పరువు దక్కిస్తున్నారు అని తృప్తి పడిందామె.

"కళాకారులు ఒకే మూర్తిని మళ్లీ మళ్లీ వేస్తూంటారంటారు. మీ బొమ్మల్లోనూ ఒకసారి ఒకే స్త్రీ రూపాన్ని రకరకాలుగా వేసినట్లని పించింది. ఆ మూర్తెవరు? మీ దేవకేనా!"

"ఇబ్బంది కల్గించే ప్రశ్నలు అడక్కూడదు" అన్నాడు పరమేశం నవ్వేస్తూ.

"అన్ని సార్లూ మూడ్ రాదంటారు. మరి వాళ్ళెప్పుడడిగితే అప్పుడివ్వాలేమో, ఎట్లా మానేజ్ చేస్తారు"

"కళాఖండాల సృజన సంగతి మీరు చెప్పేది. మూడ్ లేనప్పుడు గొప్పగొప్ప పెయింటింగ్ లు కళాత్మకవిలువలున్న చిత్రాలు వేయటం కష్టమే. ఇప్పుడు చాలా మంది ఒప్పుకోకపోయినా అది ఇన్స్పిరేషన్ లాంటిది. అదే మన మామూలు పరిభాషలో మూడ్ అంటాం. ఒకసారి ప్రొఫెషనల్ ఆర్టిస్ట్ రాని మూడ్ కూడా రప్పించుకోవాల్సి వుంటుంది. కంపల్షన్ వున్నప్పుడు మైండ్ కూడా ఆటోమేటిగ్గా మెకానికల్ గా తయారవుతుందేమో"

"మీరు స్కెచెస్ మటుకే వేస్తారా? లేకుంటే...?"

"ముందసలు నేను పెయింటర్ని.రెండుమూడుసార్లు నా పెయింటింగ్స్ ఎగ్జిబిట్ కూడా చేశాను"

"ఏమనుకోకండి. ఏవో పిచ్చి పిచ్చి ప్రశ్నలు వేశాను. నాకు మీ బొమ్మల్ని చూస్తుంటే ఎక్కడ లేని ఆనందం కలుగుతుంది"అంది సుజాత.

"ఇందులో అనుకునేదేముంది? నాకున్న ఫాన్ లే తక్కువ. మీరొకళ్లు కన్పించారు" అని నవ్వి"మీరేమన్నా బొమ్మలు గీస్తారా?" అని అడిగాడు పరమేశం.

"చదువుకునే రోజుల్లో వేసేదాన్నండీ, ఇప్పుడేం లేదు"

"మరెందుకు మానేశారు?"

"మీరనేది మరీ బావుంది. పెళ్లయిన ఆడవాళ్లకి ఎన్ని పనులుంటాయి? బొమ్మలేసుకుంటూ కూర్చుంటే అయినట్లే" అంది దేవకి మధ్యలో కల్పించుకుంటూ.

"మరలాంటప్పుడు పెళ్లి చేసుకోకుండా వుంటేపోయేది"

"పెళ్లి చేసుకోకుండా బొమ్మ లేసుకుంటూ కూర్చుంటే జీవితం గడుస్తుందా? ఏం చెప్తారండీ మరీ మీరు" అంది దేవకి.

"మీరేం , అనుకోకండి, మా ఆవిడ మరీ ప్రాక్టికల్. మనం ఆకాశంలో విహరిస్తూవుంటే, మాటల బాణాలువేసి మనల్ని కిందకు పడగొట్టేదాకా ఆమెకు తోచదు" అన్నాడు పరమేశం జోక్ చేస్తూ.

"మాలాంటి వాళ్లు వుండబట్టేప్రపంచం నడుస్తోంది. మీలా అందరూ కలల్లో తేలిపోతూంటే నాలుగు వేళ్లూ నోట్లోకి పోవు. ప్రస్తుతం కాఫీ నీళ్లు కూడా మీకు దొరకవు" అంటూ భర్తకు, సుజాతకు కాఫీ కప్పులు అందించింది దేవకి.

సుజాత మరి కాసేపు కూర్చుని 'ఇంకోసారి వస్తానని' చెప్పి వెళ్లిపోయింది.

★ ★ ★

యూనివర్సిటీ కెమిస్ట్రీ డిపార్ట్ మెంటులో ఎమ్మెస్సీ ఎంట్రన్స్ పరీక్షల ఫలితాలు నోటీసు బోర్డుమీద పెట్టినట్టు తెలిసింది మీనాక్షికి.

ఆమెకి తెలియటమే ఆలస్యంగా తెలిసింది. ఆమెకి ఎంతో ఆత్రుతగా వుంది. 'తనకు సీటు వస్తుందో రాదో నని. ఇంతాచేసి, భర్తమీద పంతం పట్టి పుట్టింటికి వచ్చి, తను సీటు సంపాదించుకోలేక ఇంట్లో కూర్చుంటే, తల్లీ దండ్రీ తనను కాపురానికి పంపకుండా ఊర్కోరు. 'ప్రేమించని వారితో కాపురం ఎలాచేయాలి?' అన్న ప్రశ్న భయంకరంగా ఎదురౌతుంది తనకు. తన ఆశయం నెరవేరదు. దేవుడా! నాకు సీటు వచ్చేటట్లుచేయి' అని ప్రార్థించుకున్నది ఆమె మనసులో. మనిషి శక్తి సామర్థ్యాల మీద నమ్మకంవున్న తాను, మూఢంగా దేవుణ్ణి నమ్ముకోటమేమిటి? అనీ తనను తాను నిందించుకున్నది.

ఇంట్లో వనితెమిలి ఆర్ట్స్ కాలేజీ బస్‌స్టాపులో బస్సు దిగేటప్పటికి మధ్యాహ్నం ఒంటి గంటైంది. హాండ్‌బాగ్ భుజాన తగిలించుకుని హడావుడిగా కెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్ బిల్డింగ్ వైపు నడుస్తోంది ఆమె.

"ఓయ్ మీనా... మీనాక్షీ!" అని ఓ మొగ గొంతు తనను పిలవటం వినిపించింది ఆమెకు. తనను అంత చనువుగా పిల్చే మొగవాళ్లెవరా అని వెనక్కి తిరిగి చూసింది మీనాక్షి. తెల్లటి పాంటులో షర్ట్ టక్ చేసి ఏదో డిటర్జెంట్ కంపెనీ అడ్వర్‌టైజ్‌మెంట్ ఆర్టిస్టులా కన్పించాడు రామచంద్రం ఆమెకు. ఈయన కిక్కడేం పని? అనుకుంది ఆమె.

"హాయ్ ... తమరిలా వేంచేశారేం" అందామె అతన్ని పలుకరిస్తూ

"కట్టుకున్న తర్వాత తప్పుతుందా మరి? సీటు వస్తుందా రాదా అన్న ఆదుర్దా నీకేమాత్రం వున్నట్టులేదు. నువ్వు ఎంట్రెన్స్ టెస్ట్ రాసినప్పటినుండీ రిజల్ట్స్ ఎప్పుడొస్తాయా అని ఎదురుచూస్తున్నాను" అని అటుగా పోతున్న ఆటోని చూసి చప్పట్లు చరిచాడు రామచంద్రం.

"రా వెళ్దాం" అన్నాడు ఆమెతో.

"నేను నోటీసు బోర్డు చూసిరావాలి. మీరు పదండి" అందామె.

"నాలాంటి మొగుడున్న తర్వాత నీకా బాధలెందుకూ, పద నేను చూశాను నోటీస్ బోర్డ్" అంటూ ఆమె చెయ్యి పట్టుకుని ఆటో ఎక్కించాడు రామచంద్రం.

"నాకు సీటు వచ్చిందా?" ఆత్రుతగా అడిగింది మీనాక్షి.

"కెమిస్ట్రీలో రాలేదు" అన్నాడు రామచంద్రం.

"జువాలజీలో?"

"రాలేదు"

మీనాక్షి హతాశురాలైపోయింది. తను బాగా రాసిన ఎంట్రెన్స్ పరీక్షలు ఈ రెండే. కెమిస్ట్రీలోనయినా, కనీసం జువాలజీలోనయినా సీటు వస్తుందని ఆశించింది ఆమె. బాటనీ ఎలాగూ బాగా రాయలేదు. పేపరు కష్టంగా ఉంది. దాంట్లో సీటు రాదని ఆమె ముందే నిర్ణయించుకుంది. ఇప్పుడేం చేయాలి? చదువు వంకతో తనిక్కడే వుండవచ్చుననుకుంది. చదువు లేకపోతే అమ్మా నాన్నా తనని బతకనివ్వరు. కాపురానికి తన్నితగిలిస్తారు. ఈయనకు మనసులో ఆనందంగా ఉంది కాబోలు. 'సీటు రాలేదు. తిక్క కుదిరింది' అని అనుకుంటున్నాడులా వుంది. ఇక తనను జంతువులా తోలుకపోవచ్చు వాళ్ల ఇంటికి. తల్లితండ్రులూ, సమాజమూ ఆయన పక్షమే. ఇక తన మాటలు ఎవరు వింటారు? తనను తీసుకెళ్లటానికి వచ్చినట్టున్నాడు పెద్దమనిషి. మొదటిరాత్రి మాటలన్నీ ఎక్కడికి పోయాయి? సిగ్గులేకుండా ఏ మొహం పెట్టుకుని వచ్చాడీయన? ఏదిఏమయినా తను అతడితో వెళ్లదుగాక వెళ్లదు అనుకుంది మీనాక్షి.

"నేను రానంటే రాను" ఆమె అనుకోకుండానే ఆ మాటలు పైకి వచ్చాయి.

"ఎక్కడకు రావు?" ఆశ్చర్యంగా అడిగాడు రామచంద్రం.

"మీ ఇంటికి"

"మా ఇంటికా?"

"అవును. మీ ఇంటికే. మీకిప్పుడు హాయిగా వుంది కాబోలు. సీటు రాకపోతే నన్ను కాపురానికి తీసుకపోవచ్చుననుకున్నారేమో. అదేం కుదరదు. నేను రానుగాక రాను" అంది మీనాక్షి. కళ్లలో నీళ్లొస్తున్నాయి ఆమెకు. ఇంకో క్షణముంటే ఏడుపొచ్చేటట్లువుంది.

"నిన్నిప్పుడు ఎవరు రమ్మన్నారు మా

ఇంటికి?'' అడిగాడతను.

''మీరే''

''నేనామాట అనందే...'' అన్నాడు రామచంద్రం.

''అనకేం... అనకేం... అన్నారు'' అంది మీనాక్షి దుఃఖం ముంచుకొస్తుండగా.

రామచంద్రం ఆమె నడుంచుట్టూ చెయ్యేసి దగ్గరకు తీసుకున్నాడు, ఆమెను అనునయించటానికి. అతనికి భార్య తొందరపాటుతనం, తెలివితక్కువతనం చూసి జాలి కలిగింది.

''ఛీ పొండి... ఆటో ఆపండి. నేను దిగివెళ్లిపోతాను...

ఓ ఆటో... ఆపెయ్యిక్కడ'' అంది ఆమె ఆటో డ్రైవరుతో.

ఆటో ఆగింది. ఆమె దిగి చరచరా నడవసాగింది. ఆటో ఫేర్ చెల్లించి ఆమె వెనగ్గా నడవసాగాడు రామచంద్రం. దీపక్‌మహల్ దగ్గరకొచ్చారు వాళ్లు. ఆమె వెళ్లి బస్‌స్టాప్‌లో నిలబడింది.

వెనగ్గా వచ్చిన రామచంద్రం- ''నీకు ఈ ప్రపంచంలో నీవు తప్ప ఇంకెవరూ కనబడనట్టున్నారే. ఇదుగో ఇది చూడు'' అంటూ ఆమెకో కాగితం చూపాడు రామచంద్రం. అది యూనివర్సిటీలో ఎమ్మెస్సీ బోటనీ కోర్సులో చేరటానికి కట్టిన మొదటి టర్మ్ ఫీజు రసీదు. తెలిసిన ఆఫీసు సూపరింటెండెంటు వుంటే ఒరిజినల్ సర్టిఫికెట్లు తరవాత సబ్‌మిట్ చేస్తానని చెప్పి, అతన్ని ఒప్పించి ఫీజు కట్టివచ్చాడు రామచంద్రం. నిజానికి దానికి అతను ఎంతో కష్టపడాల్సివచ్చింది. సర్టిఫికెట్లు లేకుండా ఫీజు కట్టించుకోరు. కొత్త భార్య మెప్పు సంపాదించటానికి ఎంతో కష్టపడాల్సి వచ్చింది అతనికి. రసీదు చూసిన ఆమె తన కళ్లని తనే నమ్మలేకపోయింది. బోటనీలో సీటు రాలేదన్న నమ్మకం వస్తుందన్న ఆశను కూడా కల్పించలేదు ఆమెకు. ఇందాక అతనితోటి తన ప్రవర్తన సిగ్గు కలిగించింది ఆమెకు.

''అయాంసారీ'' అంది మీనాక్షి అతనివంక చూడలేక చెప్పులతో నేలరాస్తూ.

''నరేపద. పక్కనే తాజ్‌మహల్ హోటల్. కాఫీ గట్రా తాగుతూ తీరిగ్గా చెబ్దువుగాని నీ సారీలు'' అన్నాడు రామచంద్రం అటుగా దారిదీస్తూ.

మీనాక్షి అతన్ని అనుసరించింది. హోటల్లో ఫామిలీసెక్షన్‌లో కూర్చున్న తరువాత దోసెకు ఆర్డరిచ్చాడు రామచంద్రం.

''నాకేం ఆకలిలేదు, నేనేం తినను'' అందామె వెయిటర్ వెళ్ళిపోగానే.

''నువ్వు కాస్త గమ్మునుండు. నీకేం కావాలో, ఏం అక్కరలేదో నాకు తెల్సు'' అన్నాడు రామచంద్రం.

''ఏం తెలుసు మీకు నా గురించి?'' అందామె.

''ఏం తెల్సా! అన్నీ తెలుసు. నువ్వు తెలుసు. నీ మనసు తెలుసు. పరీక్షలయినప్పటి నుండీ ఒకటే ఇదయిపోతున్నావు సీటు వస్తుందో, రాదోనని. సీటు రాకపోతే మీ అమ్మా నాన్నా ఊర్కోరు. కాపురానికి పంపేస్తారు. అక్కడ ఇష్టంలేని భర్త నిన్ను చెరిచేస్తాడు. అత్తమామలు నిన్ను బాధపెడ్తారు. కట్నం తీసుకుని పెళ్లి చేసుకున్న నేను ఇంకా డబ్బు తెమ్మని నిన్ను సతాయిస్తాను. ఆత్మాభిమానం వున్న మనిషి కనుక నీవు మీ నాయన్ని డబ్బు అడగవు, తేవు. అత్తామామా నిన్ను కిరసనాయిలుపోసి తగలెట్టి, అది ఆత్మహత్య అని నిరూపిస్తారు. ఇవి నీ భావాలు. పెళ్లికాకముందూ, అయిన తర్వాత కూడా...'' అంటూ చెప్పుకుపోతున్నాడు రామచంద్రం.

మీనాక్షికి తాను చీరవిప్పేసి నగ్నంగా నిలబడినంత సిగ్గుకలిగింది. తన మనోభావాలు అద్దాలలో పట్టి చూపినట్లుగా వర్ణించాడతను. ఇదేం మనిషి? ఈయనకు తన మనసులో ఆలోచనలు ఎలా తెలుసు? తాను రోజూ పేపర్లో చదివేది- వరకట్న దురాచారహత్యలు, బ్రైడ్ బర్నింగులు. అందువల్లే తన మనసులో పెద్దలు కుదిర్చే పెళ్లిపట్ల వ్యతిరేకత కలిగింది. అందుకే అలాంటి పెళ్లి చేసుకోనని భీష్మించుకూర్చుంది. ప్రేమించిన వాడితో పెళ్లి స్వర్గధామంగా భావించింది. పెద్దలు చేసేపెళ్లి ఒట్టి నరకం అన్న అభిప్రాయమేర్పరచుకుంది ఆమె.

''నీ అంత గొప్పవాళ్లం కాదుగానీ, నేనూ

మావాళ్లూ మనుషులమే. డబ్బు కోసం మనిషి హత్య చేసేంతస్థితికి దిగజారలేదు. తన గొప్ప తనాన్ని సంభాళించుకోవటంలో తప్పులేదు గాని, ఇతర్లని తక్కువగా అంచనా వేయటం కర్కోటకులుగా చిత్రికరించుకోవటం దుర్మా ర్గం...''

రామచంద్రం చెప్పుకుపోతూనేవున్నాడు. ఆమెకు సమాధానంగా ఏంచెప్పాలో తోచలేదు. నిజానికి తను వాళ్లు కర్కోటకులని భావించలే దు. తనవైపునుండి ప్రపంచాన్ని చూడటానికి ప్రయత్నించింది. అందులో తప్పేం కన్పించ లేదు ఆమెకు.

''సీటు వస్తుందా రాదా అన్న తహతహతో నీకు అన్నం కూడా సయించలేదు. ఏదో నాలు గు మెతుకులు కతికి బయటపడ్డావు. యూని వర్సిటీలో నన్ను చూడగానే శనిగ్రహం ఎదురై నట్లనిపించింది నీకు'' అన్నాడు రామ చంద్రం.

'ఇదన్యాయం. తనేం అలా అనుకోలేదు' ఇంక పట్టలేక అంది మీనాక్షి. ''నేనేం అనలేదు మీరు శనిగ్రహమని'' అందామె అతనివంక మిణుకుతూ చూస్తూ.

''అదీ నాకు తెల్సు. అలా అనుకోలేదు నువ్వు. కానీ మిగతావన్నీ అనుకున్నావు. నిజమా కాదా?'' అడిగాడు రామచంద్రం.

మీనాక్షేం మాట్లాడలేదు.

''ఏం చెప్పవు'' అన్నాడతను రెట్టిస్తూ.

''పెళ్లవకముందు అలా ఆలోచించిన మాట నిజమే'' అందామె ఒప్పేసుకుంటూ.

''ఊహూఁ ఇప్పటికీ ఆ భావాలు పోలేదు నీలో. నీకు మనుషుల మీద నమ్మకం చాలా తక్కువ'' అన్నాడు రామచంద్రం.

''అందుకే అసలీ పెళ్లిళ్లంటే నాకు ఇష్టంలే వవి'' అంది మీనాక్షి.

''సరే... ఆ విషయం వదిలేయ్. శుభవార్త చెప్పాగా ఫీజు కూడా కట్టేస్తిని. మరి నాకేం బహుమతి ఇస్తావో చెప్పు''

''ఫీజెందుకు కట్టారు మీరు? ఎందుకు కట్టాలి?''

''భార్యవు కనుక''

''అలా అయితే నాకభ్యంతరం లేదు. భార్య అని మీరు భావిస్తున్నారు కనుక అది మీ బాధ్యత కూడా'' అంది మీనాక్షి చేసిన తప్పును సరిదిద్దుకుంటూ.

''మాట మార్చకు. అందుకే పరదాల ఆడ దాన్ని పరదాల్లోనే వుంచాలన్నారు''

''ఇదుగో ఆ పాత చింతకాయ పచ్చడి మాటలు మాత్రం మాట్లాడొద్దు నాకు నచ్చవు'' అంది మీనాక్షి.

''మరి భార్యనని ఒప్పుకుని తర్వాత తప్పు కున్నావెందుకూ?''

''తప్పుకున్నదేముంది? నేను కాదన్నా లోకం మీరు నా భర్త కాదనదుగా''

''ఫరవాలేదు, దారిలోనేవున్నావు''

''నేనెప్పుడూ దారి తప్పలేదు. మీకు ఛాన్స్ ఇమ్మన్నారు ఇచ్చాను. ఫరవాలేదు బాగానే ప్రోగ్రెస్ అవుతున్నారు''

''థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్ వెల్, వాట్ ఎబౌట్ మై ప్రెజెంట్?''

''నా దగ్గరేం డబ్బుల్లేవు''

''నువ్వు డబ్బుతో కొనిచ్చే ప్రెజెంట్లు నాకేం అక్కరలేదు''

''మరేం కావాలి?''

''ఇస్తాననంటే చెప్తాను''

''ఏం కావాలో చెప్తే ఆలోచించుకుని మాటి స్తాను''

''సరే... నువ్వలా ఆలోచిస్తూనే వుండు నేనే తీసుకుంటాను''

అంతలో బేరర్ దోసె సర్వ్ చేశాడు. ఆమె వద్దన్నా వినకుండా వడ కూడాతెప్పించాడు రామచంద్రం. అతనన్నట్లే ఆమెకి రిజల్ట్స్ తెలిసింతర్వాత కడుపు నకనకలాడోంది. పైకి అనకపోయినా అతను తన మనసు తెలుసుకు న్నందుకు లోలోపలే పొంగిపోయింది. మెప్పుతో భర్తపట్ల మొగ్గు చూపింది ఆమె మనసు.

బిల్లు చెల్లించి బయటకొచ్చారు.

''ఇంటికొస్తారా?'' అడిగింది మీనాక్షి.

''రాను''

''మరెక్కడికి?''

''ఆగు నిన్నప్పుడే వదిలి పెట్టటంలేదు.

మనం సినిమాకు వెళ్తున్నాం''

''నేనురాను. ఇంట్లో చెప్పిరాలేదు''

''చెప్పాల్సిన అవసరంలేదు. సాక్షాత్తూ పతి దేవుడిక్కడ వుండగా ఇంకోళ్లఆజ్ఞ తీసుకోవా ల్సిన అవసరం లేదు''

''అటువంటి ఆశలేం పెట్టుకోకండి. పతియే ప్రత్యక్షదైవం అనే పతివ్రతామ తల్లిని కాదునేను''

''మాటలు మనిషిని పూర్తిగా తెల్పవు. నరే ఏ సినిమాకెళ్దాం?''

''మీ ఇష్టం''

''చూశావా అప్పుడే నా ఇష్టంలో పడ్డావు''

''నేను సాధారణంగా సినిమాలు చూడను. అందుకని ఏది బాగుంటుందో నాకు తెలీదు కాబట్టి మీ ఇష్టం అన్నాను''

''దీపక్‌లోనే మంచి పాత సినిమావుంది, వెళ్దామా?''

''నరే''

మీనాక్షి మనసు ఆనంద తరంగితమైంది. ఎమ్మెస్సీలో సీటు రావటం, భర్త పట్ల మనసు మొగ్గుచూపటం హాయిని గొల్పుతున్నాయి. ఆ ఆనందంలో సినిమాహాల్లో రామచంద్రం తన భుజం చుట్టూ చెయ్యేసినా అభ్యంతరం పెట్ట లేకపోయింది. కానీ అతను దగ్గరకు లాక్కుని బుగ్గమీద ముద్దుపెట్టుకున్నప్పుడు మాత్రం ఆమె ఊర్కోలేకపోయింది.

''అదుగో మీరు నియమాతిక్రమణ చేస్తున్నా రు'' అంది.

''శుభవార్త చెప్పిన భర్త ఆ మాత్రం బహు మతి కోరితే. తప్పు లేదులే''అన్నాడు రామ చంద్రం.

''నేను పూర్తిగా మిమ్మల్ని భర్తగా అంగీక రించిన తర్వాత నాకూ అభ్యంతరం ఉండ దు''

''అప్పుడింక దేనికీ అభ్యంతరం వుండదు. ఏ వరదాలు అడ్డుండవు''

''ఛీ పొండి''

''ఇహ నీనుండి పోయే అవకాశం నాకేగానీ, నీ కున్నట్టులేదు''

''నాకు లేకపోతే మీకూ లేకుండా చేస్తాను''

''సినిమా చూసి బయటికొచ్చిన తర్వాత ఆటోలో ఆమెను ఇంటిదగ్గర దింపాడు రామ చంద్రం. లోపలికి రమ్మంటే కాదని, మళ్లీ వచ్చే సోమవారం కన్పిస్తాననీ చెప్పి అదే ఆటోలో వెళ్లిపోయాడు.

ఇంట్లోకి రాంగానే తల్లి సౌభాగ్యలక్ష్మి అడ గనే అడిగింది.

''ఇంతసేపేం చేశావే? ఇంతకీ సీటు వచ్చిందా?'' అని.

''బోటనీలో వచ్చిందమ్మా- అంటే వృక్షశా స్త్రం. యూనివర్సిటీలో ఆయన కన్పించారు. సీటు వచ్చిన నంగతి ఆయనే చెప్పారు. ఫీజూ కట్టారు. అట్నుంచి సినిమాకు వెళ్లాం''

''ఎవరూ రామచంద్రమా? ఇంటికి రాలే దేం?''

''పనుందని చెప్పి వెళ్లారు''

''ఏం పనో ఏం పాడో హాయిగా అక్కలా కాపురం చేసుకోక నీకీ చదువెందుకే?''

''దాని బుర్రనిండా మొక్కలు చెట్లు మొలి చాయి. అదో దట్టమైన అరణ్యం. అరణ్యంలో కాపురమెట్లా పెడుతుంది?'' అన్నాడు కృష్ణ అక్కడే వుండి ఆమె చెప్పే మాటలు వింటూ.

''అహఁ నీ బుర్రలో ఏం వుందేం? మట్టి. ఎర్రటి ఒండ్రుమట్టి'' అని లోపలకు వెళ్ళిపో యింది మీనాక్షి, అన్నగారిని కోపంగా చూస్తూ.

ఆ రోజు పక్కమీద పడుకుంటే ఎంతసేపటి కీ కునుకుపట్టలేదు మీనాక్షికి. రామచంద్రమే గుర్తుకువస్తున్నాడు. భుజంమీద ఇంకా అతని చేయి వేసినట్లే అనుభూతి. అతడు తనను ముద్దుపెట్టుకోవటం గుర్తుకొచ్చి ఆమె మనసు రాగరంజితమయింది. బుగ్గల్లోనుండి వెచ్చటి ఆవిర్లు వచ్చినట్లనిపించింది. అతడి భావనలో ఆమె పూర్వపు ఆలోచనలన్నీ కొట్టుకుపో యాయి. ఒక ధృవంనుండి మరో ధృవం వెళ్లేటట్లుంది ఆమె మనసు. పెద్దలు కుదిర్చిన నంబంధాలే నరైనవేమోనన్న పరిస్థితికి మారి పోసాగింది ఆమె మనఃస్థితి.

★ ★ ★

ఆ మర్నాటినుండి ఆమె క్లాసులకు ఆటెండ్ కాసాగింది. ఇంకా చాలామంది విద్యా ర్థులు చేరలేదు. వారంరోజుల్లో అందరూ ఫీజు

కట్టటం, క్లాసులు రెగ్యులర్‌గా జరగటం మొదలయింది. కొనుక్కోవాల్సిన పుస్తకాల లిస్టు ఇచ్చారు ప్రొఫెసర్లు. తండ్రినడిగి డబ్బు తీసుకోవాలని ఆలోచిస్తోంది మీనాక్షి. ఇంత ఖర్చు చేసి పెళ్ళి చేసింతర్వాతకూడా డబ్బుపెట్టి చదివించటం ఆయనకు కష్టమే కానీ తప్పేట్టులేదు. సోమవారం వస్తానన్న రామచంద్రం అయిపులేడు. ఒకసారి మాట అన్న తర్వాత తప్పే మనిషిలాగలేడు. అతనికోసం, అతని సాన్నిహిత్యం కోసం ఆమె మనసు ఎదురుతెన్నులు చూడసాగింది. బిజినెస్‌లో తీరికదొరకక వీలవలేదేమో? ఒంట్లో బాగుండలేదేమో, జ్వరం వచ్చిందేమో. మనిషికి ఒంట్లో బాగుండకపోతే ఎవరైనా సరిగ్గా చూస్తున్నారో లేదో అనీ అన్పించింది. మరుక్షణంలో సిగ్గుపడిపోయింది. తమ పెళ్ళికాకముందు అతన్ని చూసుకున్న తల్లిదండ్రులు అతని యోగక్షేమం విచారించరా? తన పిచ్చిగానీ తనింకా పూర్తిగా భర్తగా అంగీకరించకుండానే తనిలా బాధ పడిపోవటమేమిటి - అనుకున్నది. ఎందుకు రాలేదో ఏమో ఉత్తరం రాస్తే. ఊహూఁ ... ఏమని రాస్తుంది, మీరు కన్పించకపోవటంతో బెంగపడిపోయాననా? అమ్మో ... అలా రాస్తే ఇంకేమయినావుందీ? తను మరీ అలుసయిపోడు.

అలా ఎదురుచూసి ఎదురుచూసి ఇహ ఇప్పట్లో రాడులే అనుకునే తరుణంలో మరునటి సోమవారానికి ఆర్ట్స్ కాలేజీ బస్‌స్టాప్‌లో దర్శనమిచ్చాడు రామచంద్రం. తన క్లాసుమేట్లు రోజీ, రాధిక, వసంతలను పరిచయంచేసిందీమె. భర్తని "ఇట్స్ మై హబ్బీ" అని. పరిచయాలు, నమస్కారాలైన తరువాత అతనన్నాడు:

"మీరేం అనుకోకపోతే అవసరమైన పని వుంది మేంవెళ్తాం" అని.

"ష్యూర్ వెళ్లండి, దీంట్లో మేమనుకునేదేముందీ" అంది రాధిక.

వాళ్లకు థాంక్స్‌చెప్పి ఆటోని పిల్చాడు రామచంద్రం.

ఆటో బయల్దేరిన తరువాత అన్నాడు అతను:

"నిన్ను నువ్వు బంగారు గొలుసులతో బంధించుకుంటున్నావు. తరువాత పశ్చాత్తాప పడి ప్రయోజనం లేదు" అని.

"ఏం ... ఏమయిందీ?"

"హబ్బీ అనీ పరిచయం చేశావు వాళ్లకు?"

"మరి బాయ్‌ఫ్రెండ్ అని పరిచయం చెయ్యాలా?"

"దట్ ఉడ్‌బి బెటర్ ఇన్ యువర్ కేస్"

"ఐ, నో వాటీజ్ బెటర్ ఫర్మీ"

"దట్స్ టూమచ్ ఆఫ సోమర్ సాల్ట్ టు ఎ గాళ్ ఆఫ్ యువర్ ఐడియాస్"

"సరే... అలాగే అనుకోండి"

"ఓడిపోయావ్ నువ్వు"

"లేదు ... నేనే గెల్చాను"

"నువ్వు ఓడిపోలేదేమోకానీ నేను మాత్రం గెల్చాను"

"అవును గెల్చినట్టేవున్నారు"

"ఇంకేం అండీ అనటం మానేయి"

"నాకలా అంటేనే బావుంది"

"నువ్వు భయపడిన లక్షణాలన్నీ నీకు వచ్చేస్తున్నాయి"

"ఏ లక్షణాలు?"

"పతివ్రతామతల్లుల లక్షణాలు"

"భర్తను 'ఏమండీ' అని పిలవటం మన ఆచారం"

"మరి ఆచారాల మీద ధ్వజమెత్తిన విప్లవకారిణివిగా నువ్వు"

"ఏమో ... ప్రస్తుతానికి నాకలా పిలవటమే బాగుంది. ఇంకా సన్నిహితమయితే మానేస్తానేమో"

"మరి ఎప్పుడవుదాం?"

"ఏమిటయ్యేది?"

"సన్నిహితమవటం"

"అబ్బాయిగారికి తహతహగా వున్నట్లుందే"

"అమ్మాయిగారి బుసబుసలకు భయపడి ఆగిపోయాను కాని నాకు నిన్ను చూసినప్పటి నుండీ తహతహగానే వుంది"

"ఇంకా నాలో సందేహాలున్నాయి, అవిపోయితర్వాత"

"సందేహాలు, శంకలు పుట్టిన తర్వాత ఆడది పుట్టింది"

"ఈ చచ్చుభావాలే పనికిరావంటాను"

"ఈ చచ్చుభావాలే నీకు పనికివస్తున్నట్లని పిస్తున్నది నాకు"

"పోన్లే అని కనికరిస్తుంటే లోకువగా కన్పిస్తు న్నాను మీకు"

"థాంక్యూ వెరీమచ్ ... ఇష్టం లేకపోయినా లోకువ చేయలేదు నువ్వు నన్ను ఇప్పటివ రకూ"

కోటీలో ఆటోదిగి, డబ్బులిచ్చి ఆటోను పంపేసితర్వాత అన్నాడు రామచంద్రం:

"కొనుక్కోవాల్సిన పుస్తకాల లిస్టుందా, క్లాసు పుస్తకాలు కొందాం"

"ఎందుకు లేండి మీకు భారం, మా నాన్న కొనిస్తారు"

"భరించేవాడు భర్త అని ఊరికే అనలేదు. నీ సంగతేమయినా, నేను నిన్ను తాళికట్టిన నాటినుండి భార్యగానే భావిస్తున్నాను కనక నా అభిప్రాయంలో నా భార్య భారం ఇంకోళ్లు భరించాల్సిన అవసరంలేదు"

"ఇంకోళ్లెవరూ ... అది మానాన్నే"

"మీ నాన్నయినా సరే ... ఐ డోంట్ వాంట్ హిం టు టేక్ ప్రిసిడెన్స్ ఓవర్ మి"

"సరే... కొనండి, మీ భుజాలు అంత బల మైనవైతే"

పి.జి. కోర్సు పుస్తకాలన్నీ చాలా ఖరీదైనవి. సుమారు ఏడొందల రూపాయల బిల్లయింది. డబ్బు చెల్లించి బయటికొచ్చింతర్వాత అంది మీనాక్షి "ఇప్పటికే మీ భుజాలు సగం దిగిపో యివుండాలి" అని.

"ఓస్ ఇదెంత? నువ్వు నన్ను సరిగ్గా అంచనా వెయ్యటంలేదు"

"వేయకేం? వేస్తూనే వున్నాను. మీ బరువు సగం నా గుండెల్లోకెక్కింది"

"పద ఇంటికి వెళ్దాం"

"ఏం, మొన్న రానంటిరిగా"

"మొన్న కోన్ కిస్కాగాణ్ణి. ఇవాళ నువ్వే అంగీకరించావుగా సగంమొగుణ్ణయ్యానని"

"సరే పదండి. ఇంట్లో దూరి అపచారాలేం చేయరుకదా!"

"లేదు. పూర్తిగా నువ్వు ఒప్పుకున్న తర్వాతే నిన్ను పునీతంచేస్తా"

"బస్సులో వెళ్దాంపదండి. ఇప్పటికే చాలా ఖర్చయింది"

"ఈ బరువు మోసుకునా? ఖర్చు సంగతి వదిలెయ్. ఆలికి అన్నం పెట్టటంలేదు. అదె లాగో మిగులేకదా!"

"హలో రామచంద్రం!" అంటూ విన్పించిందో ఆడగొంతుక.

రామచంద్రం అటువైపు చూశాడు. అదీ విన్నీ.

"హాయ్ విన్నీ! ఆఫ్టర్ లాంగ్టైం..." అన్నాడు రామచంద్రం సంతోషంగా.

"లాంగ్టైం అంటావేం? క్రితం సోమవారం కన్పించావుగా" అంది ఆమె.

"దిసీజ్ మై బెటర్హాఫ్ మీనాక్షి" అని భార్యను ఆమెకు పరిచయంచేసి- "ఈమె ఎంబియ్యేలో నా క్లాస్మేట్, పేరు విన్నీ" అని భార్యకు చెప్పాడు రామచంద్రం.

"ఏవిటీ బరువంతా" అడిగిందామె అతని చేతిలోని పుస్తకాలకట్టను చూపిస్తూ.

రామచంద్రం ఆమెకు వివరించి చెప్పాడు.

"మరి వస్తాను. మీరిద్దరూ మా ఇంటికోసారి రావాలి" అని ఆహ్వానించి ఆమె వెళ్లిపో యింది.

"బాగానే పరిచయమున్నట్లుందే 'నువ్వు' 'నువ్వు' అని పిలుస్తోంది"

"మేం క్లాస్మేట్సుంకదా. అందుకే అలా పిలుస్తుంది" అన్నాడు రామచంద్రం.

"అయితే మాత్రం. పెళ్లయిందా ఆవి డకు?"

"ఏమో తెలీదు. ఇంకా అయినట్లులేదు"

"పెళ్లిచేసుకునేరకంగా కనపడలేదు లెండి"

"అదేంమాట. మొదలయిందన్నమాట అసూయ"

"నాకెందుకు అసూయ. మొన్న సోమవారం ఆమెని కలిసే తీరిక దొరికిందిగానీ, నాకు ముఖం చూపించటానికి సమయంలేదు కాబో

లు మీకు''

''సారీ డార్లింగ్! అసలు వ్యవధానంలేదు. బిజినెస్ పనిమీదే వాళ్ల కంపెనీకి వెళ్లాను. అక్కడే ఆమె కన్పించింది''

''మంచిది. మరెప్పుడు సిటీకొచ్చినా నన్ను కలవకుండా వెళ్లకండి''

''దట్స్ సో నైసాఫ్ యు. ఇంక నీకసలు తీరికుండదు. ఇబ్బంది పడ్తావు''

''మాట ఇచ్చింతర్వాత తప్పుతుందా? మొదటి ఛాన్సు మీకే ఇస్తానన్నానుకదా''

ఆటో పిల్చి ఎక్కారు ఇద్దరూ.




బియ్యేసీ అయిపోయింతర్వాత సంధ్య చదువు మానేసింది. ఎమ్మేస్సీ చదివిస్తే దానికి తగ్గ సంబంధం వెతకలేమని ఆమెని చదువు మానిపించాడు తండ్రి. ఖాళీగా వుండట మెందుకని ఓ ప్రైవేట్ స్కూల్లో టీచరుగా చేరింది. జీతం అయిదొందలు ఇస్తున్నారు.

స్కూలునుండి వచ్చి ముఖం కాళ్లు చేతులు కడుక్కుంది సంధ్య.

''ఇంత లేటైందేం?'' అడిగింది తల్లి వసుంధర.

''లేటేముందీ, రోజూ ఇంతేగా'' అంది సంధ్య, బియ్యంలో రాళ్లేరుతున్న తల్లిపక్కన నేలమీద కూర్చుంటూ.

''లే... లేచి గుడ్డలు మార్చుకో, కాఫీ కలుపుతా''

'కావాలని అడిగితే విసుక్కునే తల్లి ఈరోజు అడిగి మరీ ఇస్తానంటోంది ఏవిటి చెప్మా?' అనుకుని- ''వద్దులేమ్మా, నేను పెట్టుకుంటానులే'' అంది.

''నీ మొహంలే. అలసిపోయి వచ్చావు. మళ్ళీ సాయంత్రం ఆ వానరమూక తయారవుతుంది. పొద్దున లేచినప్పటినుండీ పడుకునే దాకా తీరికలేకుండా. పనిచేస్తున్నావు. నేను ఇంట్లోవుండి చేసేదేముంది కనకా'' అని లేచి ఆమె కాఫీ పెట్టటానికి వంటింట్లోకిపోయింది. సంధ్య దగ్గర ట్యూషన్ చదువుకునే విద్యార్థుల్ని 'వానరమూక' అని పిలవటం తల్లి అలవాటు.

సంధ్య గదిలోకి వెళ్లి బట్టలు మార్చుకుంది. వసుంధర కాఫీ కప్పు తీసుకొచ్చి కూతురికిచ్చి, ఆమె విడచిన చీర మడతబెట్టసాగింది.

''మా అమ్మేంటో మంచి మూడ్‌లో వున్నట్టుందే ఇవాళ'' అంది సంధ్య తల్లి మడచిన చీరని హాంగర్‌కి తగిలిస్తూ.

''ఏంచేస్తాం తల్లీ! ఈ దిగువ మధ్యతరగతి సంసారాలే ఇలాంటివి. జరుగుబాటు లేనితనం ప్రేమల్ని కూడా ఇంకింపచేస్తుంది. ఏవేవో చికాకులు... అది సరే మన పక్కింటి రంగనాథం గారిమేనల్లుడు లేడూ, అతని పేరు శ్రీనివాసట. బాంక్‌లో మంచి ఉద్యోగమే చేస్తున్నాట్ట. నువ్వాపిల్లవాణ్ణిగాని చూశావా?'' అంది వసుంధర.

తల్లి అలా చెప్పేటప్పటికి సంధ్య గుండె ఝల్లుమంది. నవనాడులూ ఆగినట్లయ్యాయి. ఏంచెప్పాలో తెలీక- ''చూశాను. ఏం ఎందుకూ?'' అంది సన్నటి గొంతుతో. ఏమవుతుందో అన్న భయంవుంది ఆ గొంతులో.

''నీకు నచ్చాడా?''

''నాకు నచ్చటమెందుకూ?''

''అదేనే రంగనాథంగారి భార్య సుభద్ర మొన్న మనింటికొచ్చింది. వాళ్ల ఆడపడుచు కొడుకు నువ్వంటే ఇష్టపడుతున్నాడని చెప్పింది. నీకు ఇష్టమైతే వచ్చి ఆయనతో మాట్లాడమని చెప్పింది. నిన్న నాన్న పెళ్లి రంగనాథంగారితో మాట్లాడారు. ఆయనకు పిల్లవాడు నచ్చాడు. 'చదువుకున్నాడు, ఉద్యోగం చేస్తున్నాడు, సంప్రదాయమైన కుటుంబం' అన్నారు''

"మరి నాకు చెప్పలేదే"

"ఇప్పుడు చెప్పానుగా. నీ కిష్టమయితే, వాళ్లమ్మగార్ని పిలిపిస్తారట. ఆమె రాగానే ఆమెతో మిగతా విషయాలు మాట్లాడతాం"

"కట్నం ఎంత అడిగారు?"

"మేమేం కట్నాలివ్వలేమని నాన్న రంగనాధంగారికి స్పష్టంగా చెప్పారట. "చూద్దాంలేండి, దాన్దేముంది. పిల్లని మా పిల్లవాడు ఇష్టపడుతున్నాడు కాబట్టి కట్నం ప్రసక్తి వుండదు. ఇంతకీ మా చెల్లెమ్మ ఏమంటుందో చూద్దాం" అన్నాట్ట ఆయన

శ్రీనివాసు తనతో మాట్లాడింతర్వాత ఇంత త్వరగా అమల్లో పెడతాడని ఆమె ఊహించలేదు. ఆమెకు మనసులో ఆనందం కలిగినా తల్లిదగ్గర బయటపడలేదు. అతనితో తనకున్న పరిచయాన్ని గూర్చి చెప్పలేదు.

అంతలో "సంధ్యా... సంధ్యా" అంటూ ఎవరో పిలచినట్లుంటే తల్లీ, కూతుళ్లిద్దరూ బయటకొచ్చారు. ఆ వచ్చింది మీనాక్షి.

"అమ్మ ఇప్పటికి తీరిక దొరికిందన్నమాట నీకు నన్ను చూడటానికి. పెళ్లయిపోయింతర్వాత స్నేహితుల్ని మర్చిపోవాల్సిన అవసరమేం లేదు" అంది సంధ్య.

"నరే నేను రాలేదు. నీకేమొచ్చిందే. పెళ్లవకుండానే నువ్వు నన్ను మర్చిపోయావు. దీనికేమనాలి?"

"సర్లే రా... గదిలోకి వెళ్లి మాట్లాడుకుందాం..."

వసుంధర మీనాక్షికి కాఫీ కప్పు ఇస్తూ, "ఏమ్మా మీనా! బాగున్నావా? మీ ఆయన్నోసారి మా ఇంటికి తీసుకురాకూడదూ, నేను చూడనేలేదు" అంది పలకరింపుగా.

"అలాగే తీసుకొస్తానండీ, మీరు నా పెళ్ళికి రాకనేపోయారుకదూ" అంది మీనాక్షి.

"వీలవ్వలేదమ్మా. నువ్వు ఇక్కడే వుండి చదువుకుంటున్నావటగా పెళ్ళయ్యాక ఇంకా చదువెందుకమ్మా, హాయిగా వెళ్లి మొగుడితో కాపురం చేసుకోక"

మీనాక్షి నవ్వి ఊరుకుంది. "సంధ్య పెళ్ళి ఈ సంవత్సరం చేస్తారా అండీ?" అంది ఏదో మాట్లాడాలన్నట్లుగా.

"ఆఁ. ఓ సంబంధం నలుగుతోంది. అది కుదిరేటట్లయితే రెండు మూడు నెలల్లో చేసేస్తాం"

"తెలిసిన సంబంధమేనా?"

"తెలిసిన వాళ్లంటే మా పక్కింటి రంగనాధంగారి మేనల్లుడే. పిల్లవాడు బాగానే వుంటాడు, బ్యాంక్ ఉద్యోగం చేస్తున్నాడట" అంది వసుంధర గర్వంగా వివరాలు చెప్తూ. ఆమెకిప్పటిదాకా కూతురికి పెళ్లి చేయగలమో లేదోనని నిరాశగా వుండేది. ఇప్పుడు మొగపెళ్లివారే సిద్ధమవటంతో ఆమెకు ఆనందంగాను, తన పిల్లలపట్ల గర్వంగాన్నూ ఉంది.

"అయితే మా అన్నయ్య పెళ్లీ, సంధ్య పెళ్లీ కలిసొచ్చేట్లున్నాయి" అంది మీనాక్షి కాఫీకప్పు కిందపెడ్తూ.

"అన్నయ్య పెళ్ళా? పిల్లదేఊరమ్మా?"

"బయట పిల్ల కాదండీ, మా మామయ్య కూతురే"

"అట్లాగా? ఏం చదువుకుంది?"

"పెద్ద చదువుకోలేదు, పదోతరగతి తప్పింది"

"నన్నడిగితే అదే మేలు. చదువుకున్న ఆడదాన్ని వంట నేర్చిన మగవాణ్ణీ భరించడం కష్టం. ఎక్కువ చదువులు చదివిందగ్గర్నుంచీ వెధవ పోకిళ్లన్నీ నేరుస్తారు"

మీనాక్షి ఆ మాట నచ్చకపోయినా ఏం మాట్లాడలేదు. తల్లులందరూ అంతే. ఆతరం భావాలవి. మార్చాలని ప్రయత్నించి తనే వాటికి గురైంది. 'అయినా నువ్వు నష్టపోయిందేం లేదులే' అని ఆమె అంతరాత్మ చెబుతోన్నా ఆమెకు మాత్రం తృప్తి కలగలేదు.

"నరే రావే.. డాబాపైకి వెళ్లి మాట్లాడుకుందాం" అంది సంధ్య.

స్నేహితురాళ్లు మెట్లెక్కి పైకి వెళ్లారు.

"నీదే జాణతనం అంటే. ప్రేమాయణం పెళ్లిదాకా లాక్కొచ్చావు. ముంగిలా వుండేదానివిగాని, ఇంత కొంపలు ఆర్పే తెలివితేటలు వున్నాయనుకోలేదు నేను" అంది మీనాక్షి వెళ్తూనే.

"ఆ తెలివితేటలు చూపించే అవకాశం

దొరకలేదనేగా నీ ఏడుపు" అంది సంధ్య.

"ఇప్పుడా ఏడుపేంలేదులే. ఆయన మనిషి మంచివాడే. ప్రేమించదగిన వ్యక్తే"

"ఇల్లాలు అయినతర్వాత తప్పుతుందా మరి"

"అదేంలేదు. అంటనివ్వలేదు, ముట్టనివ్వలేదు. ఇప్పుడాయన్ని ప్రొబేషన్‌లో పెట్టాను. ఆన్ సక్సెస్‌ఫుల్ కంప్లీషన్ ఆఫ్ ప్రొబేషనరీ పీరియడ్..." అని నవ్వింది మీనాక్షి.

"మొత్తానికి సాధించావన్నమాట. కాని చూడు మీనూ! మనిద్దరికీ కూడా అనుకున్నదానికి విరుద్ధంగా జరిగింది. "

"నిజంగానే అసలు జీవితమే ఇంతేమోననిపిస్తోంది. అనుకున్నవి అనుకున్నట్లుగా జరుగవు. నేను పెద్దలు కుదిర్చిన పెళ్లి చేసుకోవాలనుకున్నానా? అంతెందుకూ ఈ ఎమ్మెస్సీ జువాలజీతోనో, కెమిస్ట్రీతోనో చేయాలనుకుంటే సీటు బోటనీలో దొరికింది" అంది మీనాక్షి.

"ఏమైనా నీకు చక్కటి భర్త దొరికాడుగా. అంటే నువ్వు కోరుకునే తీరులో వుండే మనిషి"

"ఏమో, అప్పుడే ఏం చెప్పగలం. ప్రొబేషనరీ పీరియడ్ కానీ"

"నీకు అనుమానం జాస్తే, పొగ లేకుండానే నిప్పుందేమోనంటావు"

"అది సర్లేకానీ, నీ ఉడ్బీని నాకు పరిచయమే చెయ్యలేదు"

"ట్రాజిక్ హీరో అంటూ కామెంట్ చేశావుగా, ఇంకా కొత్తగా పరిచయం చెయ్యాలా?"

"ఏడ్చావులే ఆ మాట అతన్తో చెప్పకు. బావుండదు"

"అప్పుడేం ఖర్మ, ఇప్పుడైనా అనొచ్చు"

"బావుంది... పెళ్లవకుండానే రైట్సన్నీ పుచ్చేసుకున్నావన్నమాట"

శ్రీనివాసు తల్లి సుమిత్రమ్మ బాధ అదే. అన్నగారి ఉత్తరం అందుకుని వచ్చిన సుమిత్రమ్మకు పిల్ల నచ్చిందిగాని సంధ్య తండ్రి కట్నమేమీ ఇవ్వలేదని తెలుసుకుని ఈ దరిద్రపు సంబంధం మనకొద్దన్నయ్యా అని నిరాకరించింది. కానీ తానీ పిల్లనే పెళ్లిచేసుకుంటానని శ్రీనివాసు మొండిపట్టు పట్టడంతో ఆమెకి దిగిరాక తప్పలేదు. "పెళ్లవకుండానే మాయదారిది మంత్రం వేసి తన వశం చేసుకున్నది. ఇక పెళ్లయితే ఎంత చేసునో అని భయపడింది ఆమె. మాఘమాసంలో పెళ్లయింది వాళ్లకి.

శ్రీనివాస్‌కి అయిదేళ్ల వయసులో తండ్రిపోయాడు. సుమిత్రమ్మ తల్లీదండ్రీ అయి కొడుకునీ, ఇద్దరు కూతుళ్లనీ అతికష్టంమీద పెంచి పెద్దచేసింది. తండ్రిపోయేనాటికి పెద్ద కూతురు సరస్వతికి పదేళ్లు. అయిదెకరాల మాగాణీ భూమివుండేది. సరస్వతి ఈడేరగానే గంతకు తగ్గబొంతన్నట్లు మిల్క్ ప్రాడక్ట్‌లో గుమాస్తాగా పనిచేస్తున్న దూరపు చుట్టాలబ్బాయి వెంకటేశానికిచ్చి పెళ్లి చేసింది. చిన్న కూతురు జానకికి తండ్రి పోయేనాటికి సంవత్సరం కూడా నిండలేదు. పెద్ద కూతురి పెళ్లికి, పిల్లల్ని పెంచటానికీ వున్న సొమ్ము, పొలం కరిగిపోయాయి.

తనకు వీలయినంతలో పిల్లలకు చదువులు చెప్పించింది సుమిత్రమ్మ. శ్రీనివాస్ ప్రతి క్లాసూ తప్పకుండా ఫస్ట్‌క్లాసున పాసయేవాడు. ప్రొఫెషనల్ కోర్సులకు పంపే తాహతులేక అతన్ని బియ్యే చదివించింది. శ్రీనివాస్ కూడా స్వతహాగా తెలివికలవాడు. దాంతో అతను పి.ఒ. పరీక్షకు కూర్చోవటం, ఆ పరీక్షలో ఉత్తీర్ణుడై ఇంటర్వ్యూలో నెగ్గి, బ్యాంక్‌లో ప్రొబేషనరీ ఆఫీసరుగా ఉద్యోగం సంపాయించుకున్నాడు. అమ్మ మాటను వ్యతిరేకించటమనేది అతను ఇంతవరకూ చేసిన పాపాన పోలేదు. మొదటిసారిగా తన వివాహం విషయంలో సంధ్యను చేసుకోవాలని పట్టుబట్టాడతను. తను ఆ సంబంధం వద్దని నిరాకరించినప్పుడు ఏం మాట్లాడలేక దిగులుగా వుండిపోయిన కొడుకుని చూసి తనే తగ్గి వచ్చి సంధ్యను కోడలిగా చేసుకోను అంగీకరించింది ఆమె.

పెళ్లయిం తర్వాత శ్రీనివాసు చిన్న ఇల్లు అద్దెకు తీసుకుని కాపురం పెట్టాడు. తల్లినీ చెల్లినీ కూడా హైదరాబాదుకు తీసుకువచ్చాడు. జానకి పదో క్లాసు పాసయి, పై చదువుపై శ్రద్ధలేక రికామీగా వుండిపోయింది. నవలలు, వారపత్రికలు చదవటం, వీలయినప్పుడల్లా సింగారించుకుని సినిమాలకెళ్లటం ఆమె హాబీలు. అన్న పెళ్లిచేసుకుని ఆ రెండు

గదుల కొంపలో తమతోబాటు కాపురం పెట్టటం ఆమెకిష్టంలేదు. హాయిగా తమ ఊరిలో పెంకుటిల్లే అయినా పెద్ద ఇంట్లోవున్న ఆమెకు ఇక్కడ ఊపిరిసలపనట్లు తోచేదికాదు. అయినా తనిక్కడ ఎన్నాళ్లుంటుంది. మహా అయితే రెండు మూడేళ్లు, పెళ్లిచేసి పంపిస్తారు కదా అనుకునేది. జానకికి మంచి చీరెలు కట్టుకోవాలనీ, నగలు చేయించుకోవాలనీ కోరికగావుండేది. అన్న సంపాదనలో కొంతభాగం ఆమె పెళ్లికి కట్నంకోసం దాచటంతో డబ్బు వెసులుబాటుగా ఖర్చుపెట్టుకునే అవకాశంలేక అన్న ఇబ్బంది పడిపోతూంటే జరగని వాళ్లకు కట్నం తీసుకోకుండా పెళ్లి చేసుకోవాలనే ఈ బోడి ఆదర్శాలెందుకో అని అనుకునేది. తల్లికి తన భాగ్యాన్ని విన్పించేది. అసలే మండుతున్న కట్టె దానిపై ఆజ్యం పోసినట్లయ్యింది సుమిత్రమ్మ పని.

సంధ్య తండ్రి కట్నం ఇవ్వలేకపోయినా తను ఉన్నంతలో ఏం లోపం లేకుండానే పెళ్లి చేశారు. పెళ్లిలో తల్లీ చెల్లెలూ పేచీలు పెట్టాలని చూశారుగానీ శ్రీనివాసు పడనీయలేదు. రంగనాథంగారూ చెల్లెలికీ, మేనకోడలకీ నచ్చచెప్పాడు. స్వంతకాపురం పెట్టాక సుమిత్రమ్మ కోడల్ని రాచిరంపానపెట్టసాగింది. కోడలు పుట్టింటి వాళ్లెవరూ తమ ఇంటికి రావటానికి వీలులేదు. ఓసారి కాకినాడ ఇంజనీరింగ్ కాలేజీలో చదువుతున్న సంధ్య తమ్ముడు వస్తే మా ఇంట్లో భోజనం చేద్దువుగాని రారా అని పిల్చింది సంధ్య. ఆ రోజు పెద్దరాద్ధాంతమే చేసింది సుమిత్రమ్మ. కూతురికి కట్నమిచ్చి పెళ్లిచేయటానికి డబ్బులేదుగాని కొడుకుకి పెద్ద చదువులు చెప్పించటానికి మాత్రం డబ్బొస్తుంది ముసలాయనకు. కూతుళ్లని ఊళ్లేలమని వదిలేస్తే సరి, కట్నాల్లేకుండానే పెళ్లి చేసుకుంటారు. ఎవడికొంపో ముంచుతారు అని సాధించి సాధించిపెట్టింది.

వేన్నీళ్లకు చన్నీళ్లు తోడుగా వున్నట్లు కోడలు చిన్నదయినా ఉద్యోగంచేసి సంపాదించాలనే వుంటుందికాని, ఇంట్లో వదినలేని సమయంలో పనీపాటా చేయటమంటే బద్ధకించే జానకి మాటలు విని కోడల్ని సాధించేది సుమిత్రమ్మ. ఇంట్లో వున్నంతసేపూ ఇంట్లో పనిచేసి హడావుడిగా నాలుగు మెతుకులు కొరికి స్కూలుకెళ్లాల్సివచ్చేది సంధ్యకు. తీరిక లేని పని అవటంతో ఆమెకూ అలసటగా వుండేది. ఆపైన అత్తగారి సూటీపోటీ మాటలు ఆడబిడ్డ సన్నాయినొక్కులు. ఎప్పుడైనా తలనొప్పివచ్చి పని చేయలేకపోతే రాణీగారు ఊళ్లేలుతుంటే ఇంటిపనిచేయటానికి వున్నాం కదా అమ్మా: దాసీలం. నీకు ఊడిగం చేయటానికే తీసుకొచ్చాడు మావాడు మమ్మల్ని. సంపాయించి మమ్మల్ని పెట్టి పోషిస్తున్నావుగా తల్లీ... వెళ్లి పడుకోమ్మా... ఆరోగ్యం పాడయిపోతుంది అని సాధించేది సుమిత్రమ్మ.

ఓ రోజెందుకో స్కూలుకు శలవొచ్చింది. శ్రీనివాసుకు బ్యాంక్ శలవలేదు. అతను బ్యాంక్‌కు వెళ్లిపోయాడు. మధ్యాహ్నం పన్నెండు గంటలయినా అత్తగారు భోజనానికి లేవలేదు. సంధ్య వంటచేసి ఎన్నిసార్లు భోజనానికి రమ్మని పిల్చినా పలక్కుండా దొడ్లో మొక్కలకు పాదులు చేస్తూ కూర్చుంది ఆమె.

నాలుగయిదు సార్లు పిలిచింతర్వాత నాకు ఆకలిలేదు నువ్వు పోయి తిను అంది సుమిత్రమ్మ కోడలితో.

"ఒంటిగంట కావొస్తోంది ఆకలెందుకుండదూ" అంది సంధ్య సౌమ్యంగానే. ఆమెకి అప్పుడప్పుడూ అత్తగారి ధోరణికి కోపం వచ్చినా తమాయించుకునేది.

ఆవిడేం మాట్లాడలేదు.

"మీరు తినకుండా నేనెట్లా తింటాను?" అంది సంధ్య మళ్లీ అక్కడే నిలబడి.

"నేనేం నీకు తోడా? సినిమాలకీ షికార్లకీ పోవటంలేదూ. నేనీ పనయ్యాక తింటా నువ్వు తినెయ్యి.

రాత్రి భర్త బలవంతం చేస్తే సెకండ్ షో సినిమాకు వెళ్లింది సంధ్య. దానికి ఇప్పుడు అత్తగారు నిరసన ప్రకటిస్తున్నదని సంధ్య కర్థమయింది. ఎప్పుడు శ్రీనివాసుతో ఆమె బయటకు వెళ్లినా సుమిత్రమ్మకు మండిపోయేది.

"ఆ మొక్కలపని సాయంత్రం నేను చూస్తాను. మీరు రండి" అంది సంధ్య.

"ఏం ఈరోజు ఇంట్లోనే వుంటావా?"

"రోజూ ఎక్కడికి పోతున్నా? రాత్రి మీ

అబ్బాయే బలవంతంచేసి సినిమాకు తీసికెళ్లారు"

"మగాడు అట్లాగే అంటాడు, ఆడదానికి బుద్ధుండాలి"

"నేనేమంత కానివని చేశాను"

"నువ్వు వండి వార్చి పెడుతుంటే తిన్నది అరక్క నేనే కానివనులు చేస్తున్నాను" అంది సుమిత్రమ్మ.

"మాటకు మాట తెగులని తెల్సినా సంధ్య వుండబట్టలేకపోయింది.

"ఇదిగోండి అత్తయ్యా! ఎవరోకన్న పిల్లకదా అని నన్నిలా అయిందానికీ, కానిదానికీ ఏదో వంకలు పెట్టి రాద్ధాంతం చేయటం ఏం





బాగోలేదు. నేనేమంత చేయరాని నేరం చేశానని పొద్దుటినుండీ మీరు కాఫీ కూడా తాగకుండా వంతంబట్టటానికి. మీకూ ఆడపిల్లలున్నారుకదా" అంది సంధ్య.

"ఇదిగో వదినా! మా సంగతెత్తకు. నీకు పడకపోతే అమ్మనేమయినా అనుగానీ మా ఊసు ఎత్తవద్దు మర్యాదగా ఉండదు" అంది జానకి గదిలోనుండి పత్రిక చేతబట్టుకునొచ్చి.

"ఇదిగో, జానకీ పెళ్లికావాల్సిన దానివి, ఒకింటికి పోవాల్సినదానివి, నువ్విలా మాట్లాడటమేం బాగాలేదు. నీ ఊసు ఏం ఎత్తలేదు నేను"

"చూశావే అమ్మా! వదిన నన్ను నోర్మూసుకో మంటోంది"

"అంటుందే తల్లీ! అంటుంది, ఎందుకన దు. కట్నం ఇవ్వకపోయినా 'నోరుపెట్టుక బత కవే మాయమ్మా' అని పంపించాడా మహాను భావుడు"

"మావాళ్ళు చేతనైనంత ఇచ్చారు, పెళ్లి చేశారు. తలకుమించిన భారం ఎవరూ మోయలేరు"

"ఆ ఇచ్చారు, చేశారు..." అంది సుమిత్ర మ్మ చేతులు జాడిస్తూ, "అది తినలేకే ఛస్తు న్నాం..."

"మీకంత ఇష్టంలేనప్పుడు అప్పుడే వద్దనా ల్సింది. మేమేం మీ కాళ్లు పట్టుకు బతిమిలాడ లేదే, మీ అబ్బాయే కావాలని"

"బతిమిలాడాల్సిన ఖర్మేం తల్లీ మీకు. మావాడిని పిచ్చివాణ్ణి చేశారు చాలదూ. నీ బోగంటక్కులు చూసి మురిసిపోయి మతిపో యింది వాడికి. లేకపోతే వాడు చదివిన చదు వుకీ, చేస్తున్న ఉద్యోగానికీ ఎంతమంది ఆడ పిల్లల తండ్రులు కాళ్లకి బలపాలు కట్టుకుని నా ఇంటిచుట్టూ తిరిగారో. లక్ష రూపాయల కట్నమిస్తామన్నారు. నీకంటే సుందరాంగులు దొరకనట్టు నిన్నే ఏరి కోరి వరించాడు. అంతా నా ఖర్మ, నా గీత..." అంటూ నుదుటిన బాదుకుంది సుమిత్రమ్మ.

"ఇందులో నేను చేసిందేవుందీ...'

"నువ్వు చేసిందీ లేదూ, ఇంక చెయ్యనూవ ద్దు మహాతల్లీ! నీకూ, నీ వాళ్లకీ ఓ దణ్ణం" అని దణ్ణాలుపెడ్తూ, "రేపామాపో మేం మా ఊరు పోతాం. సుఖంగా వుందూగాని. అష్టకష్టాలూప డి పెంచి పెద్దచేసినా ఇప్పుడు వాడికి మాతో పనేముంది? చెట్టంత కొడుకుని నీకు ధారద త్తం చేశాననుకుని నెత్తిన చెంగేసుకుని వెళ్తా ను" అని ఎవరో పోయినట్లు భోరున ఏడుస్తూ కూర్చుండిపోయింది సుమిత్రమ్మ.

"మీరెందుకు వెళ్లటం. ఇది మీ ఇల్లు, మీ కొడుకు సంపాదన. సాయంత్రం ఆయనొచ్చాక చెప్పి నేనే పోతాను" అని లోపలకు వెళ్లిపో యింది సంధ్య.

ఆమెకు దుఃఖం వస్తోంది. దిండ్లో తలపెట్టు కుని అలా రోదిస్తూనే చాలసేపు వుండిపో యింది ఆమె. అత్తగారి తిట్లు, ఆడబిడ్డ సూటీ పోటీ మాటలకు ఆమెకు మనశ్శాంతి కర వైంది. తనకు చేతనయినంత పని చేస్తున్నా తనే ప్రతి విషయంలోనూతగ్గిపోయి అందరికీ సంతోషం కలిగేట్టు ప్రవర్తించాలనుకున్నా వీలుకావటంలేదు. ఎందుకు తనీ పెళ్లి చేసు కుంది? ఏం సుఖం బావుకుందామని? అత్తగా రితో ఇల్లు వదలిపెట్టి వెళ్లిపోతానంది పంతాని కి. నిజంగా తనలా చేయగలదా?

ఆమె ఆలోచించసాగింది. అత్తగారి సాధింపుతో ఉడుకెత్తి ఉబుకొచ్చిన ఆవేశం చల్లారి బుద్ధి పనిచేయసాగింది. శాంతంగా ఆలోచించినప్పుడు అత్తగారి ప్రవర్తనలోను తప్పు కనపడలేదామెకు. ఆమె కూడా అందరి తల్లుల్లాగానే తన కూతురి పెళ్లి చేయాలని ఆరాటపడుతోంది. పెళ్లి అంటే డబ్బుతో కూడు కున్న పని. కొడుకు పెళ్లికి వచ్చే కట్నంతో కూతురి పెళ్లి చేయవచ్చున్న నిశ్చింతతోవున్న ఆమెకు కొడుకు ప్రేమవివాహం, కట్నం లేని పెళ్లి ఆశాభంగాన్ని కల్గించింది. తనూ పెద్ద కట్నంతోవస్తే, ఆమె తననలా సాధించేది కా దు. నెత్తిన పెట్టుకు చూసేదేమో బహుశః. కానీ పరిస్థితి తారుమారవటంతో తనే ఆమె బాధకు కారణమనుకుంటోంది. ఇది ఇలా కొనసాగరా దు. ఏదైనా చేయాలి. ఈ పరిస్థితులనిలా కొనసాగనిస్తే ఇంట్లో ఎవ్వరికీ మనశ్శాంతి వుండదు. తమ ఉనికి, బతుకు అర్థంలేనివైపో తాయి. ఈ విషయాన్ని భర్తతో చర్చించాలను కున్నది సంధ్య.

మధ్యాహ్నం ఎవరూ భోజనం చేయక పస్తు న్నా రాత్రికి మాత్రం ఎలాంటి అవాంతరాల్లే కుండానే అందరి భోజనాలయాయి. కోడలు పిలిచినప్పుడు బిగుసుకోకుండా అత్తగారు భోజనానికి వచ్చింది. కొడుకుముందు కోడల్నే మీ అనదు సుమిత్రమ్మ. అవసరమొస్తే కొడు కుతో కసిరినట్లు మాట్లాడినా అంతరాంతరాల్లో కొడుకంటే భయపడుతుంది ఆమె. భోజనా లయి పడకగదిలోకి రాగానే అడిగాడు శ్రీనివా సు. "ఇంత ఆలస్యమా? రాణీగారికోసం నేనెప్ప టినుండో ఎదురుచూస్తుంటేను" అని.

"వంటింట్లో అన్నీ సర్ది రావద్దా?" అంది సంధ్య.

"సరేలే... ఇంక ఆలస్యం చేయకు, విరహంతో వేగిపోతున్నాను"

"ముందు లేచి కూర్చోండి, మీతో మాట్లాడాలి"

"ఏం మాట్లాడాలి?"

"మీకు నేను బోగంటక్కుల్ని చూపి వశపర్చుకున్నానుకదూ? కానీ కట్నం తేలేదు. మీరు నాకు ధారాదత్తం అయిపోయారుకదూ?" అంది సంధ్య.

"ఎవరన్నారట్లా

"ఇంకెవరంటారు మీ అమ్మగారే"

"నేను చెప్తాన్లే ఆవిడకు. పెద్దావిడ ఏదో అంటుంది. నువ్వు పట్టించుకోరాదు"

"నిజమే ఇహనుండి పట్టించుకోదల్చుకోలేదు. ఆవిడ పరిస్థితీ నాకర్థమయింది. గుండెల మీద కుంపటిలా పెళ్లికెదిగిన కూతురుంది. నేనేమో కట్నం తీసుకరాకుపోతిని. ఉన్న ఆస్తి ఎప్పుడో కరిగిపోయిందాయె. జానకి పెళ్లెలా అవుతుందా అని ఆమె బాధ"

"నువ్వు అర్థంచేసుకుంటావు, మనుమలను తప్పుగా అంచనా వెయ్యవు అనే కదా హనీ... నేను వెంటపడి మరీ నిన్ను చేసుకున్నది"

"మీరిప్పుడు మాటలతో మురిపించనక్కర లేదు నన్ను. మనం ఇప్పుడున్న పరిస్థితిలో ఏం చెయ్యాలో చెప్పండి. మనది ఆర్థిక సమస్య. మీ జీతంతో ఇల్లే గడుస్తుందా... జానకి పెళ్లే చేస్తామా? నా ఉద్యోగం అంతంత మాత్రపుదే. ఏం చేయాలి. ఆదాయం ఎలా పెంచాలి. అది చెప్పండి" అంది సంధ్య.

"సమస్యని సులువుగా అర్థంచేసుకున్నావుగా. అది నువ్వే చెప్పేసెయ్యి మార్గదర్శీ..." అన్నాడు శ్రీనివాసు ఆమె భుజం మీదవాలుతూ.

"అదుగో కొంటెపనులూ, కొంటె మాటలూ వద్దు"

"కొంటె మాటలు లేదు గానీ నువ్వు చెప్పేదేమిటి? ఈ పంతులమ్మ ఉద్యోగం మానేసి మరో మంచి ఉద్యోగమేమన్నా చూసుకుంటానంటావా?"

"అఁ మన కోసం రెడీగా వున్నాయి ఉద్యోగాలు ఏరి తెచ్చుకోటానికి."

"మరి?"

"భరించే భర్తగారు తమరు చెప్పండి"

"నన్నడిగితే నువ్వేం చెయ్యాల్సిన అవసరంలేదు. రుచిగా వంట చేసిపెట్టు. రాత్రివక్కలోకి..."

"..... పిల్లల్నికను. కోపంవస్తే తన్నులు తిను. ఛీ...ఛీ.. అందరి మొగుళ్లలా మీరూ మాట్లాడుతున్నారు. మీరింతకంటే గొప్పగా ఏమన్నా చెప్తారేమోనని ఆశించాను" అందామె అతని మాటల్ని పూర్తి చేయనివ్వకుండా.

"ఆడదానివయాక పిల్లల్ని కనకతప్పుతుందా?"

"సరే ఆ సంగతి తర్వాత. జానకి పొద్దస్తమానమూ ఆ పుస్తకాలు చదవటం, లేకపోతే సినిమాలు చూడటం ఏం బాగాలేదు. ఇలా అయితే ఏం సాధించేను జీవితంలో. తనకి చదువంటే ఇష్టం లేదు. చదివించొద్దు. కానీ జానకిది చక్కని శ్రావ్యమైన కంఠంకదా ఆ ఫైనార్ట్స్ కాలేజీలో మ్యూజిక్ డిగ్రీలో చేర్పించరాదూ. మొన్న అప్లికేషన్లు కాల్ఫర్ చేస్తూ పేపర్లో వేశారు. స్కూల్లో చూశాను. అప్లయిచేయించండి. సీటు రావటమేం కష్టం కాదనుకుంటాను. ఆమెకీ కొంత కాలక్షేపం అవుతుంది. ఎప్పుడూ తల్లి, వదిన, అన్న అనే సంకుచిత పరిధినుండి బయటపడి బయట ప్రపంచాన్ని చూస్తుంది, నేర్చుకుంటుంది" అంది సంధ్య.

"బాగుంది సంధ్యా... నీ సలహా. దానికి నచ్చచెప్పి వీలయితే రేపే అప్లయిచేయిస్తాను" అన్నాడు శ్రీనివాసు.

జానకికి కట్నం లేకుండా పెళ్లయితే మంచిదే. అందరికీ నాలాగా కట్నం తీసుకోని మొగుళ్లొచ్చే అదృష్టముండొద్దూ. రేపొద్దున ఆమె పెళ్లికి కట్నమివ్వాల్సి రావచ్చు. మీ జీతంలో నెలనెలా దాచే మూడొందలు ఎప్పటికి పెద్ద మొత్తమయ్యేను? ఎప్పటికి తనకి పెళ్లిచేస్తారు? మీరు కట్నం పోగుచేసేసరికి జానకి ముసలిదై పోవచ్చు"

"మరేం చేద్దామంటావు మార్గదర్శి?"

"నేనో కాటేజ్ ఇండస్ట్రీ తెరవాలనుకుంటున్నాను. సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ స్కీం కింద మీ బ్యాంక్ వాళ్లు లోన్ ఇస్తారుగా"

"నేనున్న బ్యాంక్‌లో నీకు లోన్ ఇప్పించను"

"పోనీ మీది కాకపోతే సవాలక్ష బ్యాంకులున్నాయి. వాళ్లిస్తారుకదా"

"ఇస్తారు ఏ ఇండస్ట్రీ తెరవాలనుకుంటున్నావు?"

"ఇంకానేనేం నిర్ణయించుకోలేదు. గుండు సూదులు తయారు చేయొచ్చు. కవర్లు, కొవ్వొత్తులు తయారు చేయొచ్చు... ఇంకా బోలుడున్నాయి. రేపు కుటీర పరిశ్రమల మీద ఏదయినా మంచి పుస్తకంవుంటే తెచ్చిపెట్టండి. చదివి ఏది తేలికో లాభసాటిగా వుంటుందో చూసి అది మొదలెడదాం"

"క్యాపిటలిస్ట్ వైపోతున్నావన్నమాట"

"వ్యవస్థను మార్చే శక్తిలేనివాళ్లు ఆ వ్యవస్థనే తమ ప్రయోజనానికి పని కొచ్చే విధంగా మార్చుకుంటే తప్పేంలేదు. సరే ఒక విషయం. ఏం చేసినా ముఖ్యంగా నాకు కావల్సింది మీ సహకారం. బిజినెస్ అన్న తర్వాత నలుగురు మొగవాళ్లతో మాట్లాడాల్సి రావచ్చు. ఎప్పుడయినా ఇంటికి ఆలస్యంగా రావచ్చు. మీరు ఆఫీసునుండి ఇంటికి రాంగానే కాఫీ ఇచ్చేందుకు నేను ఇంట్లో వుండకపోవచ్చు"

"ఇదేమిటి!సంధ్యా...ఇంతేనా నువ్వు నన్నర్థం చేసుకున్నది?" అన్నాడు శ్రీనివాసు.

"ఎంతైనా మొగవాళ్లుకదా... అందుకని చెప్తున్నాను. ఇంకా మీరు నా పనిలో సాయం కూడా చెయ్యాల్సివుంటుంది"

"ఈ బిజినెస్‌లో ఎంత సంపాదించవచ్చని అనుకుంటున్నావు? నువ్వు సంపాదించి కట్నం కూడాబెట్టే లోపల నా చెల్లెలు ముసలిదయిపోవటం ఖాయం" అన్నాడు శ్రీనివాస్.

"నేనేం పొడిచేస్తాననని చెప్పటంలేదు. విపరీతంగా ధనరాసులూ కురుస్తాయనీ చెప్పటంలేదు. ప్రస్తుతం చేస్తున్న ఈ ఐదొందల రూపాయల టీచరు ఉద్యోగంకంటే బెటర్ కదా... అవసరమొచ్చినప్పుడు అప్పయినా తీసుకునే ధైర్యముంటుంది, అవకాశముంటుంది. ఆదాయముంటే తీర్చగలమన్న ధీమా వుంటుంది గనుక అప్పుచేసయినా పెళ్లిచేయగలం"

"ఆల్‌రైట్... ఐ డు అగ్రీ విత్యూ మార్గదర్శీ"

"అదుగో మీరలా ఎగతాళి చేస్తే నేనేం చెప్పననలు వానూ..."

"ఫైన్. ఎప్పుడూ అలా పిలవరాదూ? నాకదే బావుంది. 'ఏమండీ, 'ఏమండీ' అని వండి వండి నా పుఠమార్చకుండా"

"ఆఁ ఆఁ మీ అమ్మగారు వింటే నా పుఠమార్చుతారు"

"అమ్మేం అంత దుర్మార్గురాలు కాదు"

"నేనన్నానా! మన ఆర్థిక పరిస్థితి మెరుగైతే ఆమే సంతోషిస్తుంది. ముఖ్యంగా కూతురి పెళ్లయ్యే సూచనలు కన్పిస్తే ఆవిడింక సాధింపుగా మాట్లాడటం మానేస్తుంది"

"అలాగే డాళింగ్, ఇహ ఇవాల్టికి నన్ను కరుణించు"

లైటార్పేసి వచ్చింది సంధ్య. పక్కన పడుకుంటూ, "నే చెప్పినవి ఏవీ మర్చిపోవుకదూ వానూ! రేపన్నీ ఆచరణలో పెట్టాలి"

"డెఫినిట్. నువ్వే చూస్తావుగా" అన్నాడతను ఆమెను దగ్గరగా లాక్కుంటూ.

మర్నాడు శ్రీనివాస్ చెల్లెలితో మాట్లాడాడు. సంగీతం నేర్చుకోమనీ, దానివల్ల ఆమె భవిష్యత్తు ఉజ్జ్వలంగా వుంటుందనీ, రేడియోలోనూ, టి.వి.లోనూ పాడే అవకాశం కలుగుతుందనీ చెప్పాడు.

"ఏమో ఎవరు చూడొచ్చారు? రేపు సినిమాల్లో కూడా పాడతావేమో?" అని అతనన్నప్పుడు ఆమె కళ్లల్లో తారకలు మెరిశాయి. ఆమెకెంతో ఉత్సాహం కలిగింది. చెల్లెల్ని సాయంత్రం ఫైనార్ట్స్ కాలేజీకి తీసుకు వెళ్లి వోకల్ కోర్సుకు అప్లయి చేయించాడు. పదిరోజుల్లో తెలిసింది ఆమెకు సీటు వచ్చిందని.

ఆమె రోజూ ఉత్సాహంగా కాలేజికి వెళ్లసాగింది.



“బెల్ మోగుతోంది ఎవరో చూడండి” అంది దేవకి కూరలోకి మసాలా నూరుతూ.

ఒక లాండ్‌స్కేప్‌కి ఫినిషింగ్‌టచెస్ ఇస్తున్న పరమేశానికి అటు కాలింగ్ బెల్ శబ్దంగానీ, కిచెన్లోంచి భార్య అరచిన అరుపుగానీ విన్పించలేదు. అతను ఎడంచేత్తో గడ్డం పట్టుకుని, కుడిచేత్తో బ్రెష్ పట్టుకుని ఇంకా ఎక్కడ లోపం వుందా అని నిశితంగా పరిశీలిస్తున్నాడు.

ఇంకా బెల్ మోగుతూండటంతో నూరుతున్న రాతిని విసరి రోట్లో కొట్టి “మీకేం చెవుడా? పగటి కలలు కంటారా? ఛీ ఛీ... ఎంతో పాపం చేస్తేనే మీవంటి అర్థిష్టు మొగుళ్లు దొరుకుతారు” అంటూ వచ్చి తలుపు తెరచింది దేవకి.

“ఏంచేస్తున్నావమ్మా ఇంతసేపూ! పరమేశం ఉన్నాడా?” అన్నాడు ఇంటిగలాయన.

“వున్నారండీ... రండి. లోపల గదిలో పెయింటింగ్ వేస్తున్నారు” అంది దేవకి ఆయనకు దోవ ఇవ్వటానికి లోపలకు జరుగుతూ.

వెంకటరమణయ్యగారు లోపలకొచ్చాడు. స్నానం, సంధ్య, పూజ కానిచ్చివచ్చినట్టున్నాడు. నుదుట విభూతిరేకలున్నాయి. ఆయన గదిలోకివచ్చి నుంచున్నా పరమేశం ఆయన్ను గమనించలేదు. రెండు నిమిషాలు చూసి దగ్గాడాయన అతని దృష్టి తనవైపు తిప్పుకోవటానికి. వెనక్కి తిరిగి చూసిన పరమేశం వెంకటరమణయ్యగారు కన్పించగానే “అయ్యో, మీరెప్పుడొచ్చారు! రండి, కూర్చోండి” అని కుర్చీ ఆఫర్‌చేశాడు.

“సరే, ఏదో బొమ్మ వేస్తున్నట్టున్నావు. నిన్ను డిస్టర్బ్ చేయటం నాకిష్టంలేదు. ఓమాట చెబ్దామని వచ్చాను” అన్నారాయన కుర్చీలో కూర్చోకుండానే.

“ఏంటదీ?”

“ఏంలేదు. నువ్వేమనుకోవద్దు. ఇది సంసారులుండే కొంప. నువ్వు మందిని చేర్చి అర్థరాత్రిదాకా తాగితందనాలాడుతుంటే చూసేవాళ్లకు బావుండదు. నేను కూడా లిబరల్ ఐడియాస్ ఉన్నవాణ్ణే. నువ్వు తాగితే నాకేం అభ్యంతరం లేదు. అది నీ ఇష్టం. కాని ఇట్లా అందర్నీ పోగుచేసి గొడవ చేయటం మాత్రం బాగుండదు. కనుక మా ఇంటినో బార్‌లా మార్చకు. వక్కపోర్షన్ టెనెంట్‌సత్యన్నారాయణ కూడా అబ్జెక్ట్ చేస్తున్నాడు”

రాత్రి పన్నెండింటిదాకా జరిగిన మందుపార్టీ గురించి చెప్తున్నారాయన. నిన్న దాగిన ద్రవపు హాంగోవర్ ఇంకా దిగని పరమేశానికి కోపం నషాళానికంటింది.

“ఇట్స్ నన్నాఫ్ యువర్ బిజినెస్. దిసీజ్ మై హౌస్. ఐడువాటై లైక్ డూయింగ్” అన్నాడు పరమేశం దురుసుగా.

“అట్లా మాట్లాడతావేమయ్యా! నేను సౌమ్యంగా చెప్తుంటేనూ”

“మరింకెలా మాట్లాడాలి. నా ఇంట్లో నా ఇష్టమొచ్చినట్టుండగూడదని మీరు శాసిస్తుంటే”

“నీ ఇంట్లో నీ ఇష్టమొచ్చినట్టుండవయ్యా. ఇంట్లో జనాభాని పోగుచేసి తాగి తందనాలాడుతుంటే అందరికీ ఇబ్బందిగా వుంది. ఆడవాళ్లు బయటకు కదలటం కష్టంగా వుంది. ఇది మర్యాదస్తులుండే కొంప. నీ ప్రవర్తన మార్చుకోకపోతే ఇల్లు ఖాళీచేసెయ్యి” అన్నాడు వెంకట్రామయ్య కోపంగానే.

“మీరు నాకేం చెప్పనవసరంలేదు. నేను చేసేవన్నీ బయటకు కన్పిస్తాయి. ఇతరుల కళ్లుకప్పి నేనేం తప్పుడు పన్లు చేయను. మళ్లీ చెప్తున్నాను. ఇల్లు ఖాళీ చేయమని చెప్పటానికెప్పుడూ రావద్దు. నా ఇష్టం వచ్చినప్పుడు ఖాళీ చేస్తాను. మీరింక దయచేస్తే నాపెయింటింగ్

కాస్తా పూర్తిచేసుకుంటాను'' అన్నాడు పర మేశం బ్రష్ పక్కనే పెట్టి సిగరెట్టు ముట్టించు కుంటూ.

''చూస్తాను, చూస్తాను నువ్వెందుకిల్లు ఖాళీ చేయవో' టవల్ దులిపి భుజానేసుకుంటూ, రుసరుసలాడాడు వెంకటరమణయ్య.

గదిబయటనుంచి ఇదంతా చూస్తున్న దేవ కికి ఏడుపు వచ్చినట్లయింది. ఈయన తాగు డూ, అలవాట్లూ అందరికీ విమర్శనాంశాలే అయ్యాయి. నాల్గు రోజులక్రితం తల్లిదండ్రుల ను చూడాలని దేవకి పుట్టింటికి వెళ్ళినప్పుడు చెల్లెలు మీనాక్షి అక్కడే వుంది.

''మీరు మా ఇంటికి రానేలేదు ఈ మధ్య. ఓసారి నువ్వూ, మరిదీ రారాదూ?'' అని తను ఆహ్వానించింది.

''నేను రాను బాబూ! బావగారు తాగుతా ట్టగా'' అంది మీనాక్షి.

''నీకెవరు చెప్పారు?''

''ఆయనన్నారు. బావగారికెప్పటినుండో ఆ పాడు అలవాటు వుందట. తాగుడు మైకంలో ఏం మాట్లాడతాడో కూడా ఆయనకే తెలియ దట. ఆయన ప్రవర్తన కూడా మామూలు మనుష్యుల ప్రవర్తనకు భిన్నంగా వుంటుందట'' అంది మీనాక్షి.

నిజానికి రామంచంద్రం ఆమెకలా చెప్పలే దు. తన పెత్తండ్రి కొడుకు పరమేశం మంచి కళాకారుడనీ, కళాకారులు సమాజ నీతి, నియామాల చట్రంలో బంధించబడరనీ చె ప్పాడు. అతను తాగినా తూలి ప్రవర్తించడనీ, బాహ్యప్రవర్తననుబట్టి ఏవ్యక్తినీ అంచనా వేయ కూడదనీ చెప్పాడు. అతని మాటలకు మీనాక్షి తన భాష్యాన్ని విన్పించింది అక్క దేవకికి.

''ఇన్స్పిరేషన్ రావటానికి ఎప్పుడో ఓ చుక్క పుచ్చుకుంటారు. దానికే ఆయన డ్రంకర్డ్ అయినట్లు మాట్లాడుతున్నారే మీరు?'' అంది దేవకి నొచ్చుకుంటూ.

''నాకు తాగేవాళ్లంటే అసహ్యం. నువ్వు బావగారి తాగుడు మాన్పించు, అప్పుడొస్తాం మీ ఇంటికి'' అంది మీనాక్షి.

''ఆయనేం తాగి బజార్లో పట్టంలేదు. మీరు మా ఇంటికి రానవసరంలేదు'' అంది దేవకి ఆవేశంగా.

''అదేంటే మీనా... అన్నదాంట్లో తప్పేంవుంది. కాస్త మీ ఆయన్ని కంట్రోల్లో పెట్టుకోరాదూ. చూసేవాళ్లకయినా ఎట్లా వుంటుంది?'' అంది తల్లి సౌభాగ్యలక్ష్మి.

తల్లికీ, చెల్లెలికీ ఏం చెప్పలేక అక్కసుతో తిరిగి వచ్చిన దేవకి ఆరోజు భర్తతో పోట్లాట వేసుకుంది. అతనికి హితువు చెప్పి అంగీక రింపచేయటం ఎవరివల్లా కాదు. అదో బండ. మరీ బలవంతంచేస్తే మనిషి దూరంగా తొలగి పోతాడేతప్ప, తను మారాలి అనుకోడు.

''ప్లీజ్ దేవకీ! నేను తాగి రోడ్లమీద పట్టంలే దు. ఎవర్నీ బండబూతులు తిట్టటంలేదు. అమ్మాయిల్ని పట్టుకుని గోలచేయటంలేదు. నా మిత్రులను ఇంటికి తీసుకురావద్దంటావు, ప్రయత్నిస్తాను. నా ప్రవర్తనవల్ల ఇతరులకు ఇబ్బంది కలగగూడదనే అనుకుంటాను. వై డోంట్యూ అండర్స్టాండ్ మి?'' అని పక్కకు తిరిగి పడుకున్నాడు. ఇక అతన్ని పలక రించటం, వాదించటం దేవుడి తరంకూడా కాదని, తనలో తనే బాధపడ్తూ ఊరుకుండిపో యింది దేవకి.

నిజానికి దేవకి ఇవన్నీ పట్టించుకోదు. వాళ్లూ, వీళ్లూ భర్తనలా అనటం విన్నప్పుడు ఆమెకు వాళ్లమీద కోపం వచ్చేది. ఇవాళ మళ్ళా ఇంటి యజమాని వచ్చి భర్తకు నీతు లు చెప్పటంచూస్తే దేవకికి భర్తమీద వళ్లు మండిపోయింది. 'అందరిచేతా చెప్పించుకో టానికి ఈయనకు సిగ్గులేదా' అనుకుంది. బొమ్మ వేసేటప్పుడు అతన్ని పలకరించకూడ దు. ఓసారి పెయింటింగ్ వేస్తున్నప్పుడు తను పోట్లాటపెట్టుకుంది. అంతే, రంగులు కలుపు తున్న పళ్ళాన్ని తన ముఖంమీద వేసి కొట్టా డు. రంగులన్నీ చింది తన ముఖం, ఒళ్లు, ఇల్లు అంతా ఖరాబయింది. బట్టలు మార్చుకో కుండా, చెప్పులైనా తొడుక్కోకుండా వేసుకున్న ఆ లాల్చీ, పైజమాలతోనే బయటకు వెళ్లిపో యాడు. ఇంటికి వచ్చింతర్వాత అన్నాడు దీనంగా ముఖం పెట్టి, ''సారీ దేవకీ! అంత కోపం నాకెందుకొస్తుందో నాకే అర్థంకాదు'' అని. తిరిగి తిరిగి ఆకలితో నకనకలాడుతూ

సాయంత్రం వచ్చిన భర్తమీద జాలి కలిగింది దేవకికి. 'ఈయనంటే ప్రపంచానికింత కోప మెందుకూ?' అనుకుంది ఆమె.

ఆదివారం కావటంవల్ల వంట ఆలస్యంగా మొదలెట్టిన దేవకి కూరమాడుతున్న వాసనొస్తే భర్తతో పోట్లాడే విషయాన్ని అప్పటికి వాయిదా వేసి, వంటింట్లోకి వెళ్లిపోయింది.

టైం ఒకటింపావయింది. ఇద్దరూ భోజనం చేశారు. పరమేశం ముందు గదిలో సోఫాలో వాలి ఆర్ట్ బుక్ ఒకటి చదువుతున్నాడు.

''అబ్బబ్బ... ఎప్పుడూ ఆ బొమ్మలేయటం, పుస్తకాలు చదవటం తప్ప ఇంకేం లేదా? సరదాగా కబుర్లు చెప్పరాదూ?'' అంది దేవకి పుస్తకం లాక్కోబోతూ, భర్తతో మాట్లాడటానికి నాందిగా.

పరమేశం దాన్ని గట్టిగా పట్టుకుని, ''దేవకీ ప్లీజ్! ఒక్కక్షణం ఆగు'' అన్నాడు.

''అంతేగామరి. ఇంట్లో వున్నంతసేపూ ఈ తతంగం, లేకపోతే బలాదూర్లు తిరగటం. అదీకాకపోతే వానరసైన్యాన్ని తెచ్చి మందుపా ర్టీలు. ఇంటాయన అన్నాడంటే ఊర్కే అన్నాడా? ఛఛ ఓ ముద్దూ ముచ్చటా లేదు. నాకు బోర్ కొడ్తోంది. ఏమైనా మాట్లాడండి'' అంది దేవకి.

''ప్లీజ్ దేవకీ! కాస్తాగు ఐదారు పేజీలే వుంది''

''ఏంలేదుగానీ లేచి తయారవండి, మాట్నీ కెళ్దాం''

''సినిమాకా! ఎందుకూ? ఇప్పుడు టి.వి.లో సినిమా వస్తుందిగా. చూద్దాం...''

''నేను చూడను. ఆర్ట్స్ ఫిల్మ్స్ చూస్తే వున్న మతి కూడా పోతుంది. మీలాంటి వాళ్లే అటు వంటి సినిమాలు తీసినా, చూసినా, అవార్డులి చ్చినా,పుచ్చుకున్నా. మామూలు వాళ్లకెవరికీ అవి ఎక్కవు''

''నేను రాను. వెళ్తే నువ్వెళ్లు''

''ఒక్కత్తినే ఎప్పుడైనా వెళ్ళానా! మీర్రావల సిందే''

''మర్చిపోయా. ఈ వేళ ఆదివారం కదూ. తులసి వస్తుంది. రేపెళ్దాంలే'' అన్నాడు పర మేశం.

''ఆఁ ఎవరా తులసి? ఏమా కథ?''

''మా ఆర్టిస్ట్ ఫ్రెండ్ లేడా రామ్మూర్తి? అతని కూతురు. డ్రాయింగ్ నేర్పమన్నాడు ఆ పిల్లకు''

''ఆయనా ఆర్టిస్టేగా, తనే నేర్పుకోవచ్చుగా''

''నేనూ అదే అన్నాను. 'నీకంటే గొప్పవాణ్ణా? నువ్వే నేర్పిచ్చుకదయ్యా' అని. కాని 'ఇంటి మొక్క వైద్యానికి పనికి రాదు. రేపు నీకు పిల్లలు పుడ్తే వాళ్లకి నేన్నేర్పుతాలే' అన్నాడు. ఇంక కాదనటం ఎట్లా?''

''ఏడ్చినట్లుంది, మన పిల్లలకు మీరూ, ఆయనా కాదు. ఆ బ్రహ్మదేవుడు నేర్పినా ఊర్కోను. మీతోనే వేగలేక ఛస్తున్నా. ఇంక వాళ్లూ ఆర్టూ గీర్టూ అన్నారంటే అండమాన్ దీవులకు పంపిస్తా'' అంది దేవకి.

''నా పిల్లలు నాలాగే అవ్వాలి'' అన్నాడు పరమేశం.

''ఏమక్కర్లా. నేను వాళ్లను బాగా చదివించి, డాక్టర్లనో, కలెక్టర్లనో చేస్తాను'' అంది దేవకి.

''ఓయబ్బో పెద్ద ఆలోచనల్లోనే వున్నావు. పుట్టి, పెరిగాక సంగతి ఆలోచిద్దాంలే. ఇప్పుడే మనం తెలుగు సినిమా హీరో, హీరోయిన్లలా కీచులాడుకోవటమెందుకూ?'' అన్నాడు మళ్ళీ పుస్తకం తెరుస్తూ.

''చిన్న పిల్లయితే ఫర్లేదు నేర్పినా. ఆ అమ్మాయి చూట్టానికి గేడికొంగలా ఇంతెత్తున వుంటుంది'' అంది దేవకి.

''ఇదే నయంకదా ... మరీ చిన్నపిల్లల యితే చెప్పిందే చెప్పాలి. కాస్త వయసొచ్చాక ఒకసారి చెప్తే అర్థమవుతుంది'' అన్నాడు పర మేశం.

''ఇరవయ్యేళ్లుంటాయా తులసికి?''

''ఎందుకు? ఆ అమ్మాయి ఎముక పుష్టితో పెద్దగా కన్పిస్తుందే తప్ప వయసంతలేదు. పద్దెనిమిదేళ్లుంటాయేమో''

''ఏమో ... నాకు వాళ్ల తీరుతెన్నులు నచ్చవు. ఆయనో అతిభాషి అంటే ఆ పెళ్లాం మరి పసపిట్ట. ఇక సంతానం వాళ్ల తలలు తినేట్లుంటారు''

''ఎవరి ఇష్టం వాళ్లది, అంతా ఒకేలా

వుంటారా?''

''ఒకేలా వుండాలనో ముక్కుమీద వేలేసుకు వుండాలనో కాదుగానీ మరీ అలా అయితేకష్టంబాబూ...''

''నీది మరీ బావుంది... మాట్లాడనని నన్నంటావు. మాట్లాడ్తే వాళ్లనంటావు. తూకాలూ, కొల్తలూ వేసి ఇంతకాలంలో ఇన్ని గ్రాములు మాట్లాడాలంటావా, ఏం?''

''మీ తెలివి తెల్లారినట్టుంది. మాటలకు కొలమానం గ్రాములా?''

''పోనీ సెంటీమీటర్లలో కొలిచి...''

''ఆ... సెంటీమీటర్లంటే గుర్తుకొచ్చింది, ఏవండీ- మా ఆఫీసులో చాలామంది వనస్థలిపురంలో ప్లాట్లు తీసుకుంటున్నారు. మనం కూడా ఒకటి తీసుకుందామండీ''

''ప్లాటా? ఏం చేసుకుందాం?''

''పోయి తైతక్కలాడ్దాం, ఎంత అర్థంలేకుండా మాట్లాడతారండీ మీరు. ప్లాట్ ఏం చేసుకుంటారు? నిదానంగా ఇల్లు కట్టుకుందాం''

''ఏంటీ, కట్టేది బొమ్మరిల్లా? మనమేం కడ్తాం ఇల్లు. ఆ మనుషులు వేరే వుంటారు''

''ఇదుగో నాకిదే నచ్చదు. ఇల్లు కట్టుకోటం కూడా గొప్ప ఘనకార్యమా.. వాళ్లు వేరే వుంటారట. వాళ్లకేం నాలుగు కొమ్ములుంటాయా. మనకిలేవా?''

''అది గొప్పని కాదుగానీ నాకు సరిపోదు, చాతకాదు''

''మరేమొస్తుంది మీకు? అడ్డమైన అగచాట్లూ పడ్తూ, ఇక ఎప్పటికీ ఈ అద్దె కొంపల్లోనే గడుపుదామా? ఇంటివాళ్లు ఇల్లు ఖాళీచేయమంటుంటే సిగ్గయినా వుండాలి''

''ఎందుకూ, ఏకంగా ఇల్లే కొందాం''

''ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కినట్టుంది''

''నేనిలాగ ఉట్లూ, పిట్టగోడలూ ట్రై చెయ్యను. డైరెక్ట్‌గా స్వర్గాన్నే చేర్తాను''

''అవున్లే ఊహల్లోనేగా'' అని వ్యంగ్యంగా నవ్వి''ఇక లేవండి, టైమయిపోతోంది సినిమాకి'' అంది దేవకి.

''ఇల్లు తాళమేసి వెళ్తే బాగోదు దేవకీ... పాపం తులసి రాంనగర్ నుండి వస్తుంది'' అన్నాడు పరమేశం.

''పీడాపోతుంది వెధవసంత. తాళం చూసుకుని ఇంటికి పోతుంది. అంతకంటే కొంపలేం మునగవు. అయినా మీకేంటి అంతబాధ? ఒక్క విషయం వందసార్లు చెప్పినా గుర్తుండదుకానీ ఆ పిల్ల ఈవేళ వస్తుందని మాత్రం మహాజ్ఞాపకం''

''నీతో అన్నింటికీ పేచీనే. నేనేం సర్వజ్ఞుణ్ణికాదు. అన్నీ గుర్తుండటానికి, అవసరమైనవేవో ఆటోమాటిగ్గా గుర్తుకొస్తాయి. నీకు ఏ కళాకారుడి గురించో కళాఖండం గురించో చెప్తే వింటావా? విన్నా గుర్తుంచుకుంటావా? ఏదైనా అంతే'' అన్నాడు పరమేశం.

''నాకా పిల్లని చూస్తే కంపరం. వెకిలిపిల్లా, పోకిరీ వేషాలూ''

''నిన్నేంచేసింది పాపం. మంచిదామ్మాయి. అయినా నీకు ఎవరు నచ్చారుకనుక'' అని నవ్వాడు పరమేశం.

''నన్నేం చేయాలి. అనలాపిల్ల పద్ధతే నచ్చదు నాకు. సలక్షణంగా లంగాఓణీలో, చీరెలో కట్టుకోక ఆ వెధవడ్రస్సులన్నీ వేసుకోటమెందుకో''

''మన ఇష్టాయిష్టాలని వేరేవాళ్ల మీద రుద్దకూడదు. నీకు చీర ఇష్టం, నాకు జీన్స్ ఇష్టం. ఇంకోళ్లకి ఇంకోటి... అయినా వాటికంత ప్రాముఖ్యతలేదు''

''అయినా మీకాపిల్ల గొప్ప సెంటరాఫ్ ఎట్రాక్షన్ అయిపోయిందిలెండి. అసాధ్యురాల్లావుంది''

''స్టాపిట్, దేవకీ నువ్వు మరీ అమ్మలక్కలా తయారవుతున్నావు. ఇట్లా నోటికొచ్చినట్లు మాట్లాడి నాకు చిరాకు తెప్పించకు'' అని పక్కకు తిరిగి పుస్తక పఠనంలో లీనమయిపోయాడు.

అప్పుడే బెంగాలీ సినిమా మొదలయింది. దేవకి పమిటకొంగు విదిలించి చరచరా వెళ్లిపోయింది. పరమేశం పుస్తకం పక్కనపెట్టి, కాళ్లు బారచాపి టి.వి. చూడటంలో నిమగ్నమయాడు.

మూడున్నరకు సినిమా అయిపోయింది.

టి.వి.ఆఫ్‌చేసి నిద్రపోయాడు. అయిదున్నర వుతుండగా దేవకి వినుగ్గావచ్చి "లేవండి... ఆ అమ్మాయి వచ్చింది" అంటూ నిద్రలేపింది.

వరమేశం మెల్లగా లేచాడు. కళ్లునులుము కుంటూ మంచందిగేసరికి ఎదురుగా కుర్చీలో తులసి కన్పించింది. స్కైబ్లూకలర్ షర్ట్, జీన్స్ పాంటులో టక్ చేసుకుని ముగ్ధమోహనంగా వుంది.

"ఫైన్, బ్యూటిఫుల్. దేవకన్యలావున్నావు. ఇంత లేటయిందేం?"

"సారీసర్... రెండింటికే బయలుదేరాను. కానీ అనుకోకుండా బైక్ ట్రబులిచ్చింది. దాంతో ఇంక మానేద్దామనుకున్నా. కానీ ఇందాక నాన్నొచ్చి బండి చెడినంతలో వెళ్లటం మానేస్తావా? ఎలాగో వెళ్లాలిగానీ లింకన్ ఎన్నోమైళ్లు నడిచి ఎక్కడికో వెళ్లేవాడు అంటూ అరవయ్యారు భాష్యాలిచ్చి ఆటోలో పొమ్మన్నారు" అంది తులసి గుక్కతిప్పుకోకుండా.

వరమేశం నవ్వి "ఇప్పుడేవస్తాను" అని లోపలకెళ్లాడు.

అతను తులసికి పాఠం చెప్పటం క్రిందటి ఆదివారమే మొదలుపెట్టాడు. ఆ వారంలో మూడు రోజులు వాళ్లింట్లోనే చెప్పాడు. ఇహ నుండి తన ఇంటికి రమ్మన్నాడామెను.

ముందు ఏదో ఒక వస్తువు ఎదురుగావుంచి దాని బొమ్మవేయమంటాడు. అది వేశాక ఎక్కడెట్లా తప్పుచేసిందీ విడమర్చి చెప్పి, ఆ తప్పు మరోసారి రాకుండా జాగ్రత్త పడమంటాడు. తర్వాత ఏదైనా గీసిన బొమ్మ ఇచ్చి అలాగే కాపీ చేయమంటాడు. చివరకు చిత్రలేఖనం గూర్చి నాలుగు ముక్కలు చెప్తాడు. అదే అతడు తులసికి చిత్రలేఖనం నేర్పే విధానం. ఆమెకు తోచిన బొమ్మలేవో వేసుకురమ్మని హోంవర్కు ఇచ్చి అవి కూడా కరెక్షన్స్ చేస్తాడు.

తులసి తన స్కెచ్ బుక్‌లో హోంవర్కుగా వేసుకొచ్చిన వాటిల్లో ఒక గడ్డి మోపు పట్టుకున్న యువతి బొమ్మలో చీరకొంగు సరిగా లేనట్లనిపించి బాగ్‌లోంచి రబ్బరు తీసి తుడుపుతోంది.

టవలుతో ముఖం తుడుచుకుంటూ వచ్చిన వరమేశం "చీకట్లోనే కూర్చున్నావే, లైట్లేయక పోయావా తులసీ..." అంటూ లైటేసి ఆమె దగ్గరకు వచ్చి నిలబడి "నీకేం చెప్పాను? రబ్బరు వాడొద్దన్నానా?" అన్నాడు.

"సాధారణంగా వాడటంలేదండీ.. ఎప్పుడయినా ఇలాగే తప్పున్నరయితే తప్ప. ఇంకొన్నాళ్లయితే పూర్తిగా మానేస్తా" అంది తులసి తలెత్తి.

"ఉహూఁ... లాభంలేదు. ఎప్పుడో వాడనంటే కుదరదు. నువ్వు నా దగ్గర డ్రాయింగ్ నేర్చుకోవాలంటే అసలు రబ్బర్ అనేది పట్టుకోకూడదు. ఏదీ ఇలా ఇవ్వు... " అని తులసి అందించిన రబ్బర్ తీసుకుని కిటికీలోంచి రోడ్డుమీదకు విసిరేశాడు. తులసి ఏమీ అనలేదు. నవ్వింది.

"ఇదుగో తులసీ... నవ్వటంకాదు. సీరియస్‌గా చెప్తున్నా. ఇంకెప్పుడూ రబ్ చేయకు. నా ఎదుటే కాదు చాటునైనా వీలైనంతవరకు గీతలు తప్పురాకుండా ముందే జాగ్రత్తగా వుండాలి. అయినా వచ్చిందనుకో దాన్నలా వుంచేసి ప్రొసీడవ్వు. ఇందువల్ల ఇంకోసారి జాగ్రత్తపడ్తావు. పైగా నీట్‌నెస్ దెబ్బతినదు" అన్నాడు వరమేశం.

"సరేనండీ ఇంకెప్పుడూ రబ్బర్ అంటుకోను" అంది తులసి.

"అన్నట్టు స్కేల్ కూడా వాడొద్దన్నాను గుర్తుందా?"

"గుర్తుందండీ స్కేలస్సలు వాడటంలేదు. స్ట్రెయిట్ లైన్స్ ఉట్టి చేత్తోనే గీస్తున్నాను"

వరమేశం తల పంకించి "ఊఁ.. బానే వుంది. సొంతమా? ఎందులోనైనా చూసి వేశావా?" అన్నాడు వంగి పరిశీలిస్తూ ఆమె వేసిన బొమ్మని.

"నేనేవేశానండీ ఎందులోనూ చూళ్లేదు. అయినా మీరేం చెప్పారండీ? లెర్నింగ్ స్టేజ్‌లో ప్రతిదీ చూసివేయటం కూడా ప్రాక్టీసుచేయాలి. అట్లా చేస్తే పరఫెక్షన్ వస్తుంది. అన్నారా లేదా? నాన్న చూస్తే కోప్పడ్తారు. ఎప్పుడూ కాపీ కాట్‌లా చూసివేయటమేనా? సొంతగా వెయ్యి. లేకపోతే క్రియేటివిటీని కోల్పోతావు అంటారు" అంది తులసి తండ్రిమీద గురువుకి ఫిర్యాదు చేస్తూ.

"నువ్వేదేం లెక్కచేయకు. అక్షరాలు రాకుండానే గ్రంథాలు రాయమన్నట్టుంది. ఏవైనా చూసి తెల్సుకున్నప్పుడే మరో కొత్తదాన్ని సృష్టించగల్గుతాము. ముందు నీకు చక్కగా వేయగలనేర్పూ సమర్థతా రావాలంటే చూసే వేయాలి. నీ స్వంతదైన శైలి ఒకటి నీకు ఏర్పడుతుంది. అయినా ప్లాటో ఏమన్నాడు. కళంతా అనుకరణే అన్నాడు. భావం గొప్పదన్నాడు. ఆ భావానికి రూపకల్పనే కళాఖండం. అది రచన కావచ్చు, చిత్రం కావచ్చు, శిల్పం కావచ్చు. భావమంత స్వచ్ఛంగా కళవుండదన్నాడు. ప్రకృతిని చూసి చిత్రకారుడు బొమ్మలేస్తున్నాడు. అది ప్రకృతికి అనుకరణేకదా... బొమ్మని చూసి బొమ్మను వేయటంలో తప్పులేదు. ఆయనన్నట్టుగా అవి ట్వైస్ రిమూవ్డ్ ఫ్రరియాలిటీ కాకుండా థ్రైస్ రిమూవ్డ్ ఫ్రరియాలిటీ అవుతుంది. ఏమయినా బిగినర్స్‌కి అభ్యాసం వుండాలి. సొంతవైనా ఫర్లేదు, అద్దెవైనా ఫర్లేదు వేయాలి. నిరంతరం వేస్తూ వుండాలి. అప్పుడే చేయి తిరిగిన కళాకారిణివవుతావు'' అన్నాడు పరమేశం.

అంతలో దేవకి రెండుకప్పులలో టీ తెచ్చి ఇద్దరికీ ఇచ్చి తనూ ఒకటి తెచ్చుకుని ఓ కుర్చీ అవతలకు జరుపుకుని తన మానాన తను టి.వి. చూడసాగింది.

"పద, మనం పక్కగదిలో కూర్చుందాం'' అన్నాడు టీ తాగి పరమేశం.

"నా వల్ల మీరు సినిమా మిస్సవటమెందుకూ? ఇవి చూసి హెూంవర్కు ఇచ్చేయండి ఇవాల్టికి'' అంది తులసి.

"ఫర్లేదు... అదెట్లాగూ నేను చూసిందే'' అన్నాడు పరమేశం.

ఇద్దరూ పక్కగదిలోకి వెళ్లారు. గదిలో మూలగావున్న ఒక చాపతీసి పరిచింది తులసి. "ఆ ప్లాటో ఎవరండీ.. ట్వైస్ రిమూవ్డ్ ఫ్రంరియాలిటీ' అంటే ఏంటండీ' అని అడుగుతూ.

పరమేశం చెప్పాడు ప్లాటో గ్రీకు తత్త్వవేత్త అనీ ఆయన కళా సిద్ధాంతం, తన రిపబ్లిక్ ఎలా కళాకారులు సంఘ బాహ్యులో వివరిస్తూ... ఆయనకూ ఆయన శిష్యుడు అరిస్టాటిల్ కీ ఉన్న భావసామ్యాన్ని భేదాన్ని గురించి చెప్తూ చిన్న ఉపన్యాసమిచ్చాడు.

"మీరెంత బాగా చెప్తారండీ'' అంది తులసి అతని వంకచూస్తూ.

"నేను చెప్పటం కాదవి వాళ్ల మాటలు. ప్లాటో అరిస్టాటిల్ చెప్పినవి. వాళ్ల మాటల్లోని గొప్పదనమే అది. నా మాటల్లోదికాదు. అంటూ పరమేశం కుండ ఆకారంలోవున్న గాజుపాత్ర మీద ఒక గ్లాసు బోర్లించాడు. దానికి పక్కగా మరో రెండు గ్లాసులు పెట్టి అవి చూసి వేయమన్నాడు. అన్నిటికంటే గాజు పాత్రలు వేయటం కష్టం. అందులో రాత్రి కావటాన ఒకదానినీడ, ఇంకోదాని మీద పడ్తూవుంది. తులసి హెూంవర్క్ బుక్ అతని చేతికిచ్చి తన రెండో స్కెచ్ బుక్‌లో ఆ గాజు పాత్రలని వేస్తూ సర్ చాలా కష్టమండీ ఆ షేడ్స్ సరిగ్గా వస్తాయో లేదో'' అంది.

"షేడ్స్ సంగతి తర్వాత ముందు ఆకారాలయినాదించు'' అన్నాడు పరమేశం.

తులసి వేసింది కాని అందులో గాజుఛాయలుగానీ ఒకదాని నీడ మరో దానిమీద పడినప్పుడు అది కన్పించేతీరుగానీ సరిగ్గా రాలేదు. పరమేశం ఆ బొమ్మను చూసి నాలుక చప్పరిస్తూ- "ఉహూఁ లాభంలా షేడ్స్ సంగతలా వుంచి గీతలయినా సరిగ్గా గీయకపోతే ఎలా?'' అని తను తీసుకుని రెండు నిమిషాల్లో వస్తువుల ఆకారాన్ని జీవంవుట్టిపడేలా వేశాడు.

తులసి అతని మీదకువంగి అతను గీసే బొమ్మవంక చూస్తోంది.

"వ్వా వ్వా... భలేవేశారు'' అంది సంతోషంగా.

"నాల్రోజులు పోతే నువ్వూ వేస్తావులే'' అన్నాడు పరమేశం.

"ఇంతబాగానా? ఎప్పటికీ వేయలేను''

"నెవర్ అనే ప్రసక్తి వుండదు, వుంతగూడదు''

"ఇది మరీ బావుంది. అందరూ అన్నీ వేయలేరుకదా అసాధ్యం అనేది లేదు. కృషితో నాస్తి దుర్భిక్షం ఇవన్నీ వట్టిమాటలు. కొందరు ఎంత ప్రయత్నించినా ఏమీ చేయలేరు''

"ప్రయత్నించినా పని కాలేదంటే అక్కడ ఏకాగ్రత లోపించిందనుకోవాలి''

"అదేంటి అలా అంటారు? ఏదైనా మొద

లెడితే కాన్సన్ట్రేట్ చేయకుండా ఎలా వుంటారు? ఊరికినే మజా చూస్తారా ఏం?''

"అని కాదు. ఒక క్లాసులో వందమంది పిల్లలున్నా టీచర్ ఒకడే వుంటాడు. అందరికీ కలిపి ఒకేసారి చెప్తాడు. అయినా అందరూ ఒకే పద్ధతిలో తయారవుతారా? కొందరికి అంతా అర్థమవుతుంది. కొందరికి కొంతే బుర్ర కెక్కుతుంది. ఇంకొందరికి ఏమీ అర్థంకాదు. తప్పు ఎక్కడుంది? వినేవాళ్లల్లోనేకదా? అయితే పాత్రత, మనోపరిపక్వత, సహజ ప్రతిభ కూడా పరిగణలోకి తీసుకోవాల్సిందే. కాని శ్రద్ధ అనేది వుంటే ఈ హద్దుల్ని గూడా అధిగమించవచ్చు కొంతవరకూ. కాన్సెన్ట్రేట్, దేరీజ్ నథింగ్ ఇన్సర్మౌంటబుల్ టు అఛీవ్'' అన్నాడు పరమేశం.

తులసి అలా అతని మొహంవంకే చూస్తూండిపోయింది.

"ఏంటలా చూస్తున్నావు?'' అన్నాడు పరమేశం.

"మీ బొమ్మలే కాదు, మీ మాటలూ బావుంటాయి''

"నువ్వూ బావుంటావు - నీ బొమ్మలూ ఇంక బావుంటాయి'' అన్నాడు పరమేశం నవ్వుతూ.

"ఐలైక్యు వెరీమచ్ సర్'' అందామె.

"ఇదేం ఆరాధన? ఇటువంటి ఆలోచనలు నీ వంటికి మంచివి కావమ్మాయి!''

అప్పుడే దేవకి ఆ గదిలోకి వచ్చింది. "ఏం ఆలోచన్లు మంచివి కావని చెప్తున్నారు తులసికి'' అంది.

"ఏంలేదు. ఈ పిల్ల నా ఆరాధనలో పడిందిలే. నేను బొమ్మలు బాగా వేస్తానట'' అన్నాడు పరమేశం.

"రియల్ ఆంటీ! సార్ బొమ్మలు బాగా వేస్తారు''

దేవకికి అసలే చిరాకుగావుంది. పరమేశం ఆ పిల్లతో అంతసేపు గడపటం ఆమెకిష్టంలేదు. 'తనతో సరదాగా నాలుగు కబుర్లు చెప్పటానికే తీరికలేని మనిషి ఈ అమ్మాయితో ఇంతసేపు గడపటమా' అని ఆమె మనసు చివుక్కుమంది. "బొమ్మలు వేయటం, నేర్పటం వరకూ మీ పరస్పర ఆరాధనవుంటే మంచిదే తులసీ! ముందే చెప్తున్నాను. నువ్వేం చిన్నపిల్లవు కాదు. కాస్తంత అర్థం చేసుకో' అని విసురుగా గదిలోనుండి వెళ్లిపోయింది దేవకి.

"ఏంటలా అంటారు ఆంటీ? నేను తప్పుగా ఏమైనా అన్నానా సార్!'' అని అడిగింది తులసి పరమేశాన్ని.

"ఏంలేదులే. ఆవిడతీరే అంత. పగలు కాలేజీ ఎన్నింటికయిపోతుంది నీకు?''

"మూడింటికి''

"మంగళ, గురు, శనివారాలు కాలేజీ వదలగానే రా. పగలయితే తీరిగ్గా కూర్చోవచ్చు. ఇహనుండీ ఆదివారాలు మానేద్దాం'' అన్నాడు పరమేశం.

"ఆంటీ వుంటారా ఇంట్లో''

"వుండదు. ఆఫీసుకెళ్తుందిగా''

"అయితే వస్తాను''

"ఆమె ఇంట్లో వుండదని రమ్మనటంలేదు నిన్ను. ఆదివారంకంటే తీరుబాటుగా వుంటుందికదా అని రమ్మంటున్నాను'' అన్నాడు పరమేశం.

"అలాగే సర్... మరి వస్తాను'' అని తన స్కెచ్బుక్స్ సర్దుకుని బాగులో పెట్టుకుని వెళ్లిపోయింది తులసి.

* * *

మీనాక్షీ రామచంద్రంలు ఒకటయింతర్వాత కొత్త కాపురం పెట్టటంలో జాప్యం చెయ్యలేదు. అంతకుముందు మీనాక్షి దృష్టి చదువు మీద కంటే 'రామచంద్రం సిటీకి ఎప్పుడు వస్తాడా' అని ఎదురుచూడటంలో ఎక్కువ శ్రద్ధ కనపరిచింది. ఇప్పుడు ఆమెకు ఈ చదువు ఎందుకు తద్దినంలా వచ్చిపడిందా అని అన్పించసాగింది. తానే చదువుతానని పట్టుబట్టి, ఇప్పుడు మానేస్తానంటే తల్లిదండ్రులు ఏమంటారోనని సంకోచించసాగింది ఆమె. ఏమయినా భర్తకు దూరమై తానుండలేదు. తానే రామచంద్రానికి వేరే ఇల్లు తీసుకుని కాపురం పెడ్దామని సూచించింది. రామచంద్రం, "నీ చదువు కానీ, తొందరేమొచ్చింది?'' అన్నాడు. అయితే ఆమె అలా

వీల్లేదంది. వెంటనే కాపురం పెట్టాలని పట్టుబట్టింది.

''మరయితే చదువు మానేయాల్సివస్తుంది'' అన్నాడు రామచంద్రం.

''మానేస్తాను'' అందామె.

''మానేటట్లయితే అసలు మొదలు పెట్టటమెందుకూ?''

మీనాక్షి జవాబివ్వలేదు.

''పోనీ ఒకపని చేస్తే సరి. మా ఊరికి వస్తే నీ చదువుపోతుంది. ఇక్కడ సిటీలోనే కాపురం పెడ్దాం. నేనెలాగో బిజినెస్ పనిమీద వారానికో నాల్గురోజులయినా హైదరాబాదులోనే వుండవల్సివస్తోంది'' అన్నాడు అతను.

''మీ అమ్మా, నాన్నా ఏమంటారో?''

''వాళ్లకు నేను నచ్చచెప్తానుగా''

''అయితే సరే...''

మీనాక్షి పుట్టింటిదగ్గరే ఓ చిన్న ఇల్లు అద్దెకు తీసుకుని కొత్తకాపురం పెట్టారు మీనాక్షి, రామచంద్రంలు. మీనాక్షి తల్లిదండ్రులు వాళ్లని తమ ఇంట్లోనే వుండమన్నారు కానీ, అది ఆమెకి ఇష్టంలేదు.

సాయంత్రం క్లాసులు కాగానే డైరెక్ట్‌గా ఇంటికి రాసాగింది మీనాక్షి. స్నానం, వంట ముగించి, ముస్తాబు చేసుకుని అతను ఊళ్లోవున్న రోజుల్లో భర్త రాకకోసం ఎదురుచూసేది. ఊళ్లో నేవుండి బిజినెస్ పనిమీద బయటకు వెళ్లినవాడు ఓ నిర్ణీత సమయానికి రాలేకపోయేవాడు. అది మీనాక్షికి సహించరానిదిగా తయారయింది. సాయంత్రం త్వరగా ఇంటికి రమ్మని ఒకోసారి కోపంతో అలకసాగించేది.

ఆరోజు పొద్దున మీనాక్షి యూనివర్సిటీకి వెళ్లేటప్పుడు సాయంత్రం పెందలాడే వస్తానని, సినిమాకు వెళ్దామని చెప్పివెళ్లాడు రామచంద్రం. మీనాక్షి క్లాసులు ఎగగొట్టి మధ్యాహ్నమే ఇంటికి వచ్చింది. వంటచేసి, అలంకరించుకుని, అయిదుగంటలవగానే ఇంక భర్త ఎప్పుడు వస్తాడా అని ఎదురుచూడసాగింది. ఏ చిన్న చప్పుడయినా భర్తేమోనని తలుపులు తీసి చూడసాగింది. రామచంద్రం రాలేదు. ఆరైంది. బయటకు వెళ్లాలనే ఉత్సాహం నీరుగారిపోయింది. 'ఈయన ఎప్పుడూ ఇంతే'. అని విసుక్కుంది. కోపంతో బయటకు వెళ్లాలని కట్టుకున్న ఖరీదైన చీర విప్పేసి, సాదా చీర కట్టుకుంది.

ఏడు, ఎనిమిది గంటలయినా రామచంద్రం అయిపులేదు. నిముషనిముషానికీ ధర్మామీటరులో తాపం పెరగసాగింది. తొమ్మిది గంటలకు కాబోలు ఇంటిముందు కారు ఆగిన శబ్దమయి, మీనాక్షి తలుపు తెరిచి చూసింది. రామచంద్రం కారు దిగుతున్నాడు.

''రా లోపలకురా... మా ఆవిణ్ణి పలకరించి వెళ్దువుగాని'' అంటున్నాడు రామచంద్రం.

''లేదు... ఇప్పటికే పొద్దుపోయింది ఇంకోసారి వస్తాను'' అంది విన్నీ కారు విండోనుండి తల బయటపెట్టి.

''అదుగో... మా ఆవిడ కూడా వచ్చింది బయటకు రారాదూ...''

''హాయ్! మళ్ళీ వచ్చినప్పుడు మీ ఇంటికి వస్తాను'' అని మీనాక్షిని పలకరించి రేపు కలుద్దాం అని రామచంద్రంతో అని కారు ముందుకు నడిపించింది విన్నీ.

ఆలుమగలు తలుపుమూసి ఇంట్లోకి వచ్చారు. విన్నీని చూశాక మీనాక్షి కోపం తారామండలానికి పాకింది. తనకిచ్చినమాట లెక్కచేయకుండా ఈ పెద్దమనిషి ఈవిడతో తిరుగుతున్నాడన్నమాట అనుకుంది.

భార్యను చూడగానే వాతావరణం ఎలా వుందో పసిగట్టాడు రామచంద్రం. వెళ్లి బట్టలు విప్పి స్నానం చేసివచ్చాడు. మీనాక్షి ఏదో పత్రిక తిరగేస్తూ సోఫాలో కూర్చుని వుంది. టి.వి. ఆన్‌చేసి వచ్చి ఆమె పక్కగా కూర్చున్నాడు రామచంద్రం. ఆమె అతనికి దూరంగా జరిగి కూర్చుంది.

''ఆయాం సారీ డార్లింగ్! అనుకోకుండా ఆలస్యమయింది'' అన్నాడతను. మీనాక్షి ఏం మాట్లాడలేదు. పత్రిక సీరియస్‌గా చదువుతోంది.

''కోపం వచ్చినట్టుందే?''

''... ...''

''మాట్లాడకపోవటం నీవంటికి పడదు. మాటల రూపంలో లోపలి ఉష్ణం బయటప

డితే శరీరానికీ, మనస్సుకీ స్వస్థత కల్గుతుంది.

"అవును... రాత్రి పదిగంటలదాకా తిరుగు తూంటే, మీకూ ఆరోగ్యం మహాబాగా వుంటుంది."

"తప్పలేదు... విన్నీ ఇంట్లో పార్టీ వుంది. నేను ఊళ్లో వున్నానో, లేనో తెలియక ముందుగా తెలియబర్చలేకపోయింది. ఇవాళ సాయంత్రం వాళ్ల కంపెనీకి వెళ్లాను పనిమీద. బలవంతపెట్టి వాళ్లింటికి తీసుకెళ్లింది" అన్నా డతను తను ఆలస్యంగా రావటానికి గల కారణాలు వివరిస్తూ.

"నేనేం మిమ్మల్ని ఎక్స్‌ప్లనేషన్లు అడగలే దు"

"నువ్వడగలేదు. నేను చెప్పాలికదా!"

"మీరు మగమహారాజులు. చెప్పాల్సిన అవ సరం మీకేం వుంది. ఇంట్లో ఆడది ఎట్లా ఛస్తే మీకేం?"

"చదువుకున్నదానివి. నువ్వుకూడా ఇలా అంటే ఎలా? అర్థం చేసుకోవాలి"

"అవును... మీరు మాబాగా అర్థంచేసు కుంటున్నారు"

"నాకు తోచినంతలో అర్థంచేసుకోటానికే ప్ర యత్నిస్తున్నాను. నువ్వు అర్థంచేసుకో. లేకపోతే ఎవరికీ మనశ్శాంతి వుండదు"

"మీకు మనశ్శాంతి దొరికినచోట తిరిగి రండి. ఇంట్లో ఎలానూ మనశ్శాంతి వుండదు"

"ఇంట్లో మనశ్శాంతిగా వుండదని నేననలే దు"

"చెప్పాలా? చేసే పన్లే చెప్తున్నాయి"

"ఒకరోజు సినిమాకి పోనంతలో ప్రమాద మేంలేదు"

"సినిమా విషయం ఎవరు మాట్లాడారిప్పు డు?"

"సినిమాకు వెళ్లలేకపోయామనేగా నీ కోపం"

"ముష్టి సినిమా, దాని సంగతి వదిలే యండి. పార్టీకి వెళ్లేటప్పుడు నాకు చెప్పి వెళ్లొచ్చుకదా... పోనీ నన్నూ తీసుకెళ్లొచ్చుగా..."

"అవును... నిజమే. నాకాలోచన తట్టలేదు. అయామ్ సారీ"

"మీకు తట్టవు. ఇంట్లో ఆడది ఎక్కడకు పోతుంది? బయట అలా కులాసాగా తిరిగివ స్తే హాయిగా వుంటుంది"

"ఈ ముసుగులో గుద్దులాటలనవసరం. నీ మనసులో మాట స్పష్టంగా చెప్పు" అన్నాడు రామచంద్రం.

అతని మాటలని విన్పించుకోలేదు మీనాక్షి. తన ధోరణిలో తను చెప్పుకుపోసాగింది.

"అందుకే ఈ అరేంజ్‌డ్ మారేజెస్ అంటే నాకిష్టంలేంది. ఇంట్లో పెళ్లాం, మొగుడెప్పుడొ స్తాడా అని ఎదురుచూసి, ఎదురుచూసి విసిగి వేసారి పోవాలి. మగమహారాజులకు సర్వస్వా తంత్ర్యం. వాళ్లకు తీరిక దొరికినప్పుడు, బయట వేరే పనులు లేనప్పుడు, తిరిగేందుకు మనుషులు దొరకనప్పుడు ఇంటికి రావచ్చు. దగ్గరకు రానివ్వనంతవరకూ నా చుట్టూ చు ట్టూ తిరిగారు. ఇప్పుడు పెళ్లాం అనే చచ్చు ఆడదాన్నయిపోయాను. ఇంట్లో వుండక ఎక్క డకు పోతాను. చచ్చినట్లు పడివుంటాను. మీ కోసం ఎదురు తెన్నులు చూస్తూనే వుంటాను. మీకు అనుగ్రహం కలిగినప్పుడు ఇంటికి దయచేయండి" కొంగుతో కళ్లనీళ్ళు తడుచు కుంటూ అంది మీనాక్షి.

"నువ్వు అనుకున్న అర్థంలో లవ్ మారేజ్ అయినా అంటే పెళ్లి కానంత వరకూ చుట్టూ తిరిగి, పెళ్లవగానే పెళ్లామే కదా అని తనకు తీరిక అయినప్పుడే ఇంటికి రావచ్చు. ఆ ప్రీ మారిటల్ గ్రేట్ లవర్. నీ అసలు ప్రాబ్లం అది కాదు. యువార్ వెరీ పొజెసివ్ ఇన్ నేచర్. యు డోంట్ వాంట్ అలౌ ఫ్రీడం టు అదర్స్ అబౌట్ యు" అన్నాడు రామచంద్రం నవ్వుతూ.

"అవును... దయ్యంలాగా పట్టాను మిమ్మ ల్ని"

"చూడు! మనం పెళ్లయిన సంవత్సరం కాకుండానే ఇలా పోట్లాడుకుంటుంటే మన సంసారం బాగానే జరుగుతుంది"

"కారణం మీరు, నేను కాదు"

"సరే... నేనే ననుకో. నువ్వు లేచి అన్నం తిను. నాకు ఆకలిగాలేదు. ఇంకా పెద్ద టైం కాలేదు, రెండో ఆటకు వెళ్లవచ్చు"

''నేను సినిమాకు రాను. నాకు ఆకల్లేదు. నేవెళ్లి పడుకుంటున్నాను'' అని కోపంగా లోప లికెళ్లిపోయింది మీనాక్షి.

ఇప్పుడు మీనాక్షికి చదువుమీద శ్రద్ధ తగ్గిపో యింది. ఇంటిని తీర్చిదిద్దుకోవటం, కడిగిందే కడగటం, తుడిచిందే తుడవటం, కావల్సిన వస్తువులు బజారుకెళ్లి తెచ్చుకోవటంతో టైంన రిపోతోంది. యూనివర్సిటీ క్లాసులకు వెళ్లటం మానేసింది. ప్రీవియస్ పరీక్షలు దగ్గరకొస్తు న్నా ఆమెకు చదువుమీద శ్రద్ధలేదు. పుస్తకాలు తెరవటమే మానేసింది.

''ఇదేం బాగాలేదు, క్లాసులు ఎగ్గొట్టి ఇంట్లో కూర్చోటం'' అన్నాడు రామచంద్రం ఓరోజు.

''నాకు చదవాలనిలేదు, నేనిక చదవను''

''మరి అలాంటిదానివి ఎందుకు చేరావు?''

''అప్పుడు చదవాలన్పించింది''

''ఇప్పుడు చదవాలన్పించటంలేదు, మానే స్తానంటావు ... అంతా నీఇష్టమేనా?''

''బావుంది ... బలవంవతంగా చదివిస్తారా ఏమిటి? నేను చదవను''

''అలాంటప్పుడు మనం సిటీలో కాపురం పెట్టటమెందుకు? మా ఊరికి వెళ్లిపోదాం''

''ఆఁ... అప్పుడు పెళ్ళాం బాధలేకుండా ఎప్పుడూ సిటీలోనే వుండవచ్చు. అలా వీల్లేదు. ఎప్పుడో వారానికో రెండు వారాలకో నాకు మొహం చూపించాలనుకుంటున్నారు కదూ?''

''అటు చదువు లేకుండా మనం పట్నంలో వుంటే మా అమ్మానాన్నా ఏమనుకుంటారు? వాళ్లకు నేనేం జవాబు చెప్పాలి?''

''వాళ్లను కూడా తీసుకురండి. ఇంకా పెద్ది ల్లు తీసుకుని ఇక్కడే వుందాం. వాళ్లకు మాత్రం ఊళ్లో ఏంతోస్తుంది''

''వాళ్లు ఆ ఊరిని వదలిరారు. మనం ఇక్కడ కాపురం ఎత్తేద్దాం''

''మరయితే మీరు ఊళ్లోనే వుండి బిజినెస్ చూసుకోండి. మీరు వారానికి నాలుగురోజులు బయటుంటే నేనిక్కడ ఎవరికోసముండాలి?''

''అదేం ... మా అమ్మానాన్నా లేరూ?''

''నేను పెళ్లిచేసుకుంది మిమ్మల్ని వాళ్లని కాదు''

''నిజామాబాదులో బిజినెస్ చిన్నది, ఇక్క డకు రాకతప్పదు''

''అందుకే అందరం ఇక్కడుందామనేది''

''రామచంద్రం భార్యకు వేయివిధాల నచ్చ చెప్ప ప్రయత్నించాడు. ఆమె వినలేదు. అతనికి రోజురోజుకీ తన స్వాతంత్ర్యపరిధి కుంచించు కుపోతున్న అనుభూతి కలగసాగింది. ఎప్పుడ యినా ఇంటికి ఆలస్యంగావస్తే ''ఇంత ఆల స్యమయిందేమని'' అడగనే అడిగేది.

''పనుండి ఆలస్యమైంది'' అనేవాడు, తన బిజినెస్ గొడవలన్నీ ఆమెకు చెప్పి విసిగించటం ఎందుకని.

''ఏంటాపని?''

''ఏదో పని. అన్నీ నీకు చెప్పి ఏడవాలా?''

''బయటకు చెప్పుకోలేని పన్లు చేస్తున్నారా ఏం?''

''అలాంటి పన్లేం లేవునాకు''

''మధ్యాహ్నం అమ్మ చీరకొనాలంటే కోఠీకి వచ్చాం. అక్కడ కన్పించారు మీరూ, ఇంకో ఆడమనిషీ. ఆటోలో వెళ్తున్నారు ... ఎవ రామె?''

''బావుంది ... నామీద సి.ఐ.డి. పనికూడా చేస్తున్నావన్నమాట''

''నేనేం ఆ పనిమీద బయల్దేరలేదు. ఇంత కీ ఆమె ఎవరు?''

''కామేశ్వరి అని బియ్యేలో మా క్లాస్‌మేట్''

''అబ్బో ... మీకు చాలామంది గర్ల్‌ఫ్రెండ్సు న్నారే''

''ఇలా నూటిపోటీ మాటలు అంటావనే నీకు చెప్పంది''

''ఏం నూటిపోటీ మాట్లాడాను? ఉన్నమా టంటే ఎవరకైనా ఉలుకెక్కువ''

''ఏంటా ఉన్నమాట?''

''మీకు చాలామంది ఆడ స్నేహితురాళ్లు వున్నారన్నది''

''ఆ ... ఆడస్నేహితులున్నారు, మగస్నే హితులున్నారు''

''పోన్లెండి అక్కడకు నయం. మగస్నే



హితులుకూడా వున్నారన్నమాట''

''చూడు ... అసలు విషయంవిని ఆ తర్వాత మాట్లాడు. కామేశ్వరి భర్త ఈమధ్యే ఏక్సిడెంట్‌లో పోయాడు. వాళ్ల కిద్దరు పిల్లలు. ఆయన ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్‌లో ఇంజనీరుగా పని చేసేవారు. భర్త పోయాడు కాబట్టి, ఆమెకేమయినా ప్రభుత్వం సింపథిటిక్ కన్సిడరేషన్తో ఉద్యోగమిస్తుందేమోనని ప్రయత్నం చేస్తున్నాం. ఆఫీసులచుట్టూ తిరిగి ఆమెకి సాయంచేసేవాళ్లు ఎవరూలేరు. ఈ సాయం చేయమని నన్నర్థించింది. అందుకే సెక్రటేరియట్‌కి వెళ్లాం. సెక్రటరీ ఆమెకి ఉద్యోగం వస్తుందని హామీ ఇచ్చాడు. అప్లికేషన్ ఇచ్చొచ్చాం. అదీ కథ. దీంట్లో నువ్వు ఊహించే సంబంధాలేం లేవు'' అన్నాడు రామచంద్రం వినుగ్గా వివరిస్తూ.

''పావం అనాధలందరికీ మీరే నాధుడు. మీరు తప్ప మరెవరూ సాయం చెయ్యరు వాళ్లకు''

''ఛీఛీ నీతో మాట్లాడటం నాదే తప్పు''

''అవున్లెండి, బయటవాళ్ల మాటల్లాగా ఇంట్లో పెళ్లాం మాటలు తీయగా వుంటాయా?''

"పెళ్లాలు ఇలా వుంటారు అనుకుంటే అసలు పెళ్లే చేసుకునుండేవాణ్ణి కాదు"

"మీ మనస్తత్వానికి పెళ్లి చేసుకోకపోవటమే మంచిది"

"నువ్వేం గమనించావు నా మనస్తత్వాన్ని? కష్టాల్లో వున్నావాళ్లకి ఎవరైనా చేతనైనంత సాయం చెయ్యటం కనీస మానవధర్మం"

"నేనీ కామేశ్వరి సంగతి మాట్లాడటంలేదు. కామేశ్వరి కాకపోతే విన్నీ విన్నీకి తీరికలేకపోతే లలిత లేదా పద్మజ. మరింకెంతమంది ఉన్నారో నాకు తెలీదు"

లలిత, పద్మజ రామచంద్రం మేనమామ కూతుళ్లు. ఎప్పుడైనా వాళ్ల ఇంటికివస్తూ వుంటారు.

"వాళ్లెవరికీ తీరికలేకపోతే రామారావు, హరికిషన్, జనార్ధనరెడ్డి... వాళ్ల సంగతి మాట్లాడవేం!"

"అవును. ఇంతమంది స్నేహితురాళ్లమధ్య మీకు నేనెక్కడ కన్పిస్తాను" అని ముక్కుచీదుకుంటూ లోపలికెళ్లిపోయింది మీనాక్షి.

రామచంద్రానికి మనసు చికాకుగా వున్నది. బట్టలువిప్పి స్నానానికి బయల్దేరాడు. బాత్రూంలో వేణ్ణీళ్లూ, కొత్తసోపూ, టవల్ రెడీగా వున్నాయి. మీనాక్షి భర్త ఏదీ వెతుక్కోకుండా అన్నీ సిద్ధంగా వుంచుతుంది, ఏలోటూ రాకుండా చూస్తుంది. వంటలోకూడా ఏ లోపం చేయదు. మనసు దగ్గరుంచి వంట చేస్తుంది. భర్త కిష్టంలేని కూరలూ, పదార్థాలూ ఇంటికి తీసుకురాదు. తనకిష్టం వున్నా వాటిని మానేస్తుంది. పక్కనే కూర్చుని వడ్డిస్తూ బలవంతపెట్టి అతనిచేత ఎక్కువే తినిపిస్తుంది. చాకలి బట్టలు తేగానే పాంటులు, షర్టులు తనిఖీచేసి వేటికైనా గుండీలు పోతే వెంటనే కుట్టేస్తుంది. రామచంద్రానికి బట్టలు కొనుక్కోవటం అశ్రద్ధ. బట్టలు చినిగిపోయినప్పుడు తనే షాపుకు వెళ్లి బట్టలుకొని పాంటూ, షర్టూ కుట్టిస్తుంది. రెడీమేడ్ గుడ్డలంటే ఆమెకు రోత. భర్తను కొననివ్వదు. బట్టల ఎంపికలో కూడా ఆమె అభిరుచి మెచ్చుకోదగ్గది. రామచంద్రం ఆమె సెలక్షన్ని మెచ్చుకుంటాడు. భర్త బయటకు వెళ్లకముందే షూస్ పాలిష్ చేసి పెడ్తుంది. అతను వాడే బ్లేడ్లూ, క్రీంలూ, షాంపూ అయిపోతే అతనికి పట్టదుకానీ, ఆమె మాత్రం కొని తెచ్చి పెడ్తుంది. అతడు ఆమె ఆస్తి. ఆస్తిని జాగ్రత్తగా, శ్రద్ధగా కాపాడుకొనే యజమానురాలులా అతన్ని కంటికి రెప్పలా కాపాడుకుంటుంది. అతని పట్ల ఆమె శ్రద్ధ ఎంతటిదంటే అతడు ఏదీ అడక్కుండానే ఆమె అన్నీ అమరుస్తుంది. అతను ఇంటికి వచ్చేటప్పటికి ఇల్లు చక్కగాసర్ది వుంచుతుంది. అతని కాయితాలు, పుస్తకాలు, వస్తువులు వేటిస్థానంలో అవి వుంటాయి. అతను వాటికోసం వెతుక్కోవాల్సిన అవసరంవుండదు. సాయంత్రం అతను ఇంటికొచ్చేటప్పటికి తనూ స్నానంచేసి, అందంగా తయారయి, భర్త సమయానికి వస్తే చిరునవ్వుతో ఆహ్వానిస్తుంది. సమయానికి రాకపోతే అప్పుడప్పుడు కీచులాటలు అవుతుంటాయి. సినిమాకు, షికారుకు వెళ్తే బాగానే వుంటుందికానీ, భర్త అలసిపోయినట్లు కనిపిస్తే వాటికోసం ఆమె అతన్ని ఇబ్బంది పెట్టదు. ఎప్పుడయినా అతనికే అన్పించి బయటి కెళ్దామంటే "ఇప్పుడొద్దు లేండి, మీరు చాలా అలసిపోయారు రెస్ట్ తీసుకోండి ఇవాల్టికి ఇంట్లోనే వుందాం. రేపు వెళ్లవచ్చులే" అంటుంది. ఎప్పుడూ భర్త ఆమె కళ్ల ఎదుట వుంటే చాలు, అతనేమాత్రం కష్టపడినా ఆమె కష్టపడిపోతుంది, నొచ్చుకుంటుంది. అతను ఆమె జీవితానికి కేంద్రబిందువు.

ఎట్టొచ్చీ భర్తకు స్వాతంత్ర్యం, స్వేచ్ఛా ఇవ్వాలనుకోదు. అతను ఎక్కడకు వెళ్ళినా, ఎవరితో తిరిగినా, ఏం పనిచేసినా తనకు చెప్పి తీరాల్సిందే. చెప్పకపోతే అతను తన నుండి పారిపోతున్నట్లు భావించేది. తనకూ, తన భర్తకూ మధ్య స్నేహితురాళ్ళే కాదు, స్నేహితులు అడ్డం వచ్చినా ఆమె సహించలేదు. ఈ అసహనమే రామచంద్రాన్ని బాధించేది.

స్నానం చేసి, లుంగీ కట్టుకుని రామచంద్రం టి.వి. చూడసాగాడు. రాత్రి తొమ్మిది గంటలయింది.

"ఇహ లేవండి భోజనానికి" అందామె.

రామచంద్రం మనసు చికాకుగావుంది. కంచంముందు కూర్చుని వేళ్లతో అన్నం కెలుకుతున్నాడు.

"అయ్యో! అదేంటి అలా తింటున్నారు?"

"నాకు ఆకలిలేదు"

"ఆకల్లేకపోవటమేమిటి? చిక్కుడుకాయ మీకిష్టమని చేశాను బావుండలేదా?"

"బానేవుంది"

"మరింకేం మనను బావుండలేదా? ఆవిడకు ఉద్యోగం వస్తుంది లెండి, దిగులుపడకండి"

"ఆవిడ ఉద్యోగాన్ని గురించి నాకేందిగులు లేదు"

"మరేమొచ్చిందబ్బా?"

"ఏం రాలేదు కానీ, నీ భోజనం కానీ"

"నాకేంలెండి తింటాగానీ, నేనట్లా మాట్లాడానని కోపం వచ్చిందా?"

"కోపం లేదు తాపం లేదు"

"లేకపోవటమేం పాపిష్టిదాన్ని మీ మనను కష్టపెట్టి మిమ్మల్ని అన్నం కూడా సరిగా తిననీయకుండా చేశాను"

"అబ్బ మీనూ! అదేం లేదుగానీ మజ్జిగపొయ్యి"

"మీరలా లేస్తే నా మీద ఒట్టే. కొంచెం చారు పోసుకోండి. మజ్జిగేం ఖర్మ పెరుగుతోడుపెట్టాను"

ఇహ లాభంలేదు. తను తినకపోతే ఆమె ఊర్కోదు. ఒట్లు, ఆత్మనిందలు, నిష్ఠూరాలూ మొదలవుతాయి. తినాలని లేకపోయినా ఆమె చెప్పినట్లు భోజనం ముగించి లేచాడు రామచంద్రం.

అన్నం తిని బిజినెస్ కాయితాలు చూస్తూ కూర్చున్నాడు అతను. మీనాక్షి వంటింట్లో అన్నీ సర్ది, వచ్చి పక్కలు సరిచేసింది. పది గంటలైనా ఇంకా కాయితాలు చూడటం ఆమెకు నచ్చలేదు.

"ఊఁ లేచి పడుకోండి. పొద్దుపోతే మీ ఆరోగ్యం చెడిపోతుంది"

"రామచంద్రానికి లేవక తప్పలేదు. ఆమెతో వాగ్యుద్ధానికి మానసికంగా సిద్ధంగా లేడతను. తను ఎక్కువసేపు బయట వుండకూడదు. ఆకలి లేకపోయినా భోజనం చేయాలి. రాత్రిళ్లు ఎక్కువసేపు మేల్కోరాదు. తనకి ఇష్టాలు లేవా? ఏమాత్రం స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు ఇవ్వని ప్రేమ ఇదేం ప్రేమ. ప్రేమకాదు బంధనం. ఒకోసారి రామచంద్రానికి ఈ ప్రేమ బంధనాన్ని వదుల్చుకు పారిపోవాలని అనిపిస్తుంది. కాని అదీ వీల్లేదు. సాలెగూడులా చక్కగా, దట్టంగా అల్లేసింది ఆమె అతని చుట్టూ తన ప్రేమ సూత్రాల్ని.



జానకి సంగీతం కాలేజీలో చేరటంతో ఆమెకో వ్యాపకం ఏర్పడింది. సాయంత్రం కాలేజీకి వెళ్ళటం పొద్దున ప్రాక్టీసుతో ఆమెకంత వెసులుబాటులేకుండా వుంది. ఇంట్లో సూటీపోటీ మాటలు, మూతి విరవటాలూ, ముక్కు చీదటాలు, తల్లితో ఉబుసుపోక కబుర్లు తగ్గాయి. సుమిత్రమ్మ కూడా కొంతవరకు సంతోషించింది.

శ్రీనివాస్ స్మాల్‌స్కేల్ అండ్ కాటేజ్ ఇండస్ట్రీస్ మీద పుస్తకం ఒకటి తెచ్చాడు. భార్యాభర్తలిద్దరూ తర్జనభర్జనలు పడ్డారు. చివరకు కవర్లు తయారు చేయించి అమ్మాలి అనే నిర్ధారణకొచ్చారు. ముందే కట్టింగ్ మిషన్లూ అవీ కొనటానికి సంధ్య ఉత్సాహం చూపించలేదు. ఆపని చేసేవాళ్లున్నారు. కొద్ది లాభంతో పని చేస్తారు. తను ఆర్డర్లు పట్టుకురావాలి. తనకు గిట్టిన ధరపై కొద్ది లాభం తీసుకుని ఆర్డర్లుతెచ్చుకోవాల్సివుంటుంది. అలా అని మార్కెట్టులో మిగతా కవర్లు తయారు చేసేవాళ్లు అమ్మే ధరకంటే ఎక్కువ వుండకూడదు. స్కూలులో టీచరు ఉద్యోగానికి రాజీనామాచేసింది. బాంకులో సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ స్కీంకింద 20 వేలకు

లోనుకప్లయి చేసింది సంధ్య. ఆ డబ్బు వచ్చింది. ఆర్డర్లకై తిరగటంలో మొదట కొంత ఇబ్బందే అయింది ఆమెకు. అనుభవంలేని వ్యవహారం. మెల్లమెల్లగా బిజినెస్‌లో ప్రవేశించసాగింది ఆమె. కంపెనీలూ, సంస్థలూ అన్నింటికీ రకరకాల సైజుల్లో కవర్లు కావలసివుంటాయి. రోజుకు అయిదారు కంపెనీలకు, సంస్థలకూ వెళ్ళటం, మాట్లాడటం మొదలెట్టింది. మొదట్లో కొత్త మనిషికి బిజినెస్ ఇవ్వటానికి కొంతమంది ఉత్సాహం చూపకపోయినా ఆడకూతురు కావటంతో కొంతమంది ప్రోత్సాహమిచ్చారు. మొదట్లో కంపెనీలకు, సంస్థలకు వెళ్లి మాట్లాడటం బెరుకనిపించినా త్వరలోనే అలవాటయింది ఆమెకు. తిరగటం కూడా చాలా శ్రమతో కూడుకున్న పని అయింది. మొదట్లో బిజినెస్ అంత ప్రోత్సాహకరంగా లేదుగానీ పోనుపోను ఆమెకు తాను నిలదొక్కుకోగలనన్న ధీమా కలిగింది. ఆర్డర్లు తేవటం సంధ్యవంతు, వాటినిఎక్జిక్యూట్ చేయటం శ్రీనివాస్ పని.

బిజినెస్ పెట్టిన మొదట్లో సుమిత్రమ్మ చాలా గొడవే చేసింది. ''ఇంట్లో పనీ బయట పనీ.చేయలేక ఛస్తున్నాను'', ''కోడలు మహారాణిలా ఊరిమీదబడి తిరిగివస్తూంటే వంటావార్పూ చేయలేక నడుంవిరిగిపోతోందహని గోలపెట్టింది . ఒకసారి కొడుకుతో అంది ''నేను మన ఊరు పోతానురా. నావల్లకాదు ఇంతపని చేయటం. నన్ను పంపించెయ్యి'' అంది. కొడుకు ఆమెకి తీరిగ్గా నచ్చచెప్పాడు. ఇప్పుడు మధ్యలో జానకి సంగీతం ఆపేసి ఊరికెళ్లిపోతే ప్రయోజనం లేదనీ, ఊళ్లోకంటే జానకి పెళ్ళి చేయగలిగే అవకాశాలు నగరంలోనే చాలా వున్నాయనీ, సంధ్య కూడా జానకి పెళ్లికోసమే డబ్బు దాచ ప్రయత్నిస్తున్నదనీ చెప్పాడు. జానకి కూడా ఊరికి తిరిగి వెళ్లిపోవటానికి ఉత్సాహం చూపించకపోవటంతో సుమిత్రమ్మ ఏం మాట్లాడలేకపోయింది. అయితే కోడలి మీద అధికారం చేయటం మాత్రం మానలేదు ఆమె. సంధ్య ఆమె మాటలకేమీ బదులవలకక తన పని తాను చేసుకుపోసాగింది. సంవత్సరం లోపల ఆర్థికంగా చాలా ముందంజవేయగలిగింది. లోను రూపేణా తీసుకున్న ఇరవై వేలలో సగం తీర్చివేసింది. మూడు నెలలకోసారి అత్తగారికీ, ఆడబిడ్డకూ బట్టలు కొనేది. ఆరు నెలల తరువాత ఆడబిడ్డకు మూడుతులాలలో గోల్డ్ చెయిన్ చేయించి పెట్టింది. ఆమెకి పాకెట్‌మనీ ఇస్తున్నది. జానకికి వదినంటే వున్న చిన్నచూపు పోయింది. కూతురికి గొలుసు చేయించినప్పటినుండి అత్తగారి తరహా మారిపోయింది. కోడలంటే పూర్తిగా స్నేహభావం లేకపోయినా ఇదివరకులా కోడలు కట్నం తేలేదేమని సాధించటం మానేసింది. ''బయట తిరిగివస్తున్నావు, ఇంట్లో పని నేను చేసుకుంటానులే'' అనేంతవరకూ వచ్చింది.

పెళ్లయిన రెండు సంవత్సరాలు కాకుండానే భార్య ఇలా డబ్బు సంపాదనలో పడటం, తాను హైరానపడి తనను హైరాన పెట్టటం ఒకసారి శ్రీనివాసుకు కష్టం కలిగించేది.

''ఏమిటిది సంధ్యా ... ఎప్పుడూ డబ్బు సంపాదన గురించి ఆలోచనలేనా? ఓచర్లూ, అకౌంట్లూ అంటూ పుస్తకాలు ముందేసుకు కూర్చుంటావు. కట్టుకున్నవాడితో కబుర్లు చెప్పటానికైనా నీకు తీరికలేదు. అయాంగెటింగ్ ఫెడల్ విద్దిస్ డ్రియరీ లైఫ్'' అనేవాడు.

సంధ్య అకౌంటు పుస్తకాలు మూసేసి వచ్చేది అతని దగ్గరకు.

''ఆదేం వాసూ ... మనమేం ముసలాళ్లమా? నువ్వెప్పుడు బిజినెస్ మానేయమంటే అప్పుడు మానేస్తాను. పుస్తకాలు మూసి వచ్చానుగా చెప్పు, ఏం చెప్తావో''

''మరీ రొటీన్ జీవితం విసుగ్గా వుంది. ఎక్కడైనా హాలీడేట్రిప్ పెట్టుకుంటే బావుండేటట్లుంది'' అన్నాడు శ్రీనివాసు.

''అవును హనీమూన్‌కి ఎలాగూ వెళ్లలేదు మనం. ఇప్పుడు వెళ్దామా అందరం? పోనీ ఇంకో ఏడు నెలలుంటే బాబుతోనో పాపతోనో వెళ్లవచ్చు'' అంది సంధ్య.

''నిజమా ... చెప్పలేదేం?''

''తమరి ఘనకార్యం తమకి తెలీదా ఏం?''

''నాదేం లేదు ... ఆ ఘనకార్యం నీదే. పోన్లే బాబుతోనే వెళ్దాం''

# ఏరిన ముత్యాలు

★ భగవంతుడు మేథన్సు మగవారికి తలలోనూ, ఆడవారికి హృదయంలోనూ పెట్టాడు. అందుకే ఆడవారు సాధారణంగా ప్రేమతో హృదయంతో పనులు సాధిస్తారు.

— లామర్టైన్

★ మేథావి అంటే ఆశ్చర్యపడేవాడు కాదు, ఆశ్చర్యపరచేవాడు.

— డేవిడ్మెకాల్నే

★ అనేక విషయాలను కొద్దిమాటల్లో చెప్పడం మేథావుల లక్షణం. విషయం అనేది లేకుండా మాటలు అల్లుకుపోవడం అల్పబుద్ధుల లక్షణం.

— ఫ్రాంకాయిస్ డెల్లారోష్

★ ఏ విషయాన్నయినా స్పష్టంగా చూడగలిగినవాడే నిజమైన మేథావి.

— జాన్సన్

★ మోసం చేసేవ్యక్తి ఎన్నడూ సుఖంగా నిద్రపోలేడు.

— నెహ్రూ

★ మనం ప్రేమించేవ్యక్తి మనల్ని సులభంగా మోసం చెయ్యగలడు.

— మోలియర్

★ ఇరువదేండ్ల ప్రాయంలో మనిషికి ఆశ, పురుషత్వం చేకూరుతాయి. అప్పుడతడు ప్రపంచాన్ని బాగుచేయాలనుకుంటాడు. అతడు డెబ్బయిఏండ్ల ప్రాయంలోకూడా బాగుచేయాలనుకుంటాడు, కాని ఏమీ చేయలేనని అనుభవం ద్వారా గ్రహిస్తాడు.

-- ఎన్డైరో

★ మూర్ఖుడు తన అనుభవాల నుండి పాఠాలు నేర్చుకుంటే వివేకవంతుడు ఇతరుల అనుభవాల సారం గ్రహించి గుణవంతుడవుతాడు.

-- జోసెఫ్ కొలెన్స్

★ బహుగ్రంథ పఠనంకన్న పరిశీలన, అనుభవం మనిషికి ఎక్కువగా జ్ఞానోదయాన్ని కలిగింపజేస్తాయి.

-- ఎ.బి. ఆల్కాట్

★ పడనివాడికంటే పడిలేచేవాడే గొప్పవాడు. ఎందుకంటే అతడు గోతులుకూడా చూశాడు.

-- ఎమర్సన్

★ ఒక టన్ను శాస్త్రజ్ఞానంకన్నా ఒక ఔన్సు అనుభవ జ్ఞానం గొప్పది.

-- వివేకానంద

★ అన్యాయానికి గురికావడం కంటే, అన్యాయం చెయ్యటం మరింత అవమానకరం.

-- ప్లేటో

★ అన్యాయం పునాదులపై ఏర్పడ్డ రాజ్యం సుస్థిరంగా ఉండదు.

-- సెనెకా

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

"ఆఁ ... అది ముచ్చటైన మాటన్నారు. పాలడబ్బా, సీసా, చిన్న ఉయ్యాల ఇవికూడా తీసుకెళ్దాం. మనకి పాటలెలాగోరావు. జానకిని తీసుకెళ్తే డ్యూయెట్లు తనే పాడుతుంది. అత్తగారు మనం దగ్గర కాకుండా కాపాడ్తారు"

"చూశావా ... మావాళ్లమీద నీకింకా కోపం పోలేదు"

"వాళ్లమీద నాక్కోపం ఎందుకండీ? ఇంత ముచ్చటైన మొగుణ్ణి కానీకట్నం లేకుండా ఇచ్చినందుకా?"

"మళ్లీ అండీ అంటున్నావు"

"నాఇష్టం ... నా మొగుణ్ణి నువ్వంటాను, మీరంటాను"

"అలా అని నాకు స్వాతంత్య్రం లేకుండా చేయకు"

"స్వేచ్ఛా స్వాతంత్ర్యాల విలువ నాకు తెలుసు వానూ! నువ్వు నన్నెంత స్వేచ్ఛగా వుండనిస్తున్నావు? హాయిగా విహంగమై ఎగిరిపోవాలనుంది"

"నేనూ..."

"నీ దోవన నువ్వెళ్ళు. మళ్లీ సాయంత్రానికి గూటికిరా నాకోసం. నేను ఎదురుచూస్తూ వుంటాను"

సంధ్యకు ఐదు నెలలు నిండిన తరువాత ఆలోచనలో పడిపోయారు భార్యాభర్తా బిజినెస్ ఎలా నడపాలా అని. నెలలు నిండిన మనిషి ఎక్కువగా తిరగటం కుదరదు. త్వరగా అలసిపోతుంది.

సంధ్య చెప్పింది, మీరేమనుకోనంటే ఒక మాట. మా మీనా అన్నగారు కృష్ణ - మీరు చూసేవుంటారు అతన్ని. ఆయన నాలాగే సెల్ఫ్‌ఎంప్లాయ్‌మెంట్ స్కీంకింద గుండుసూదులు, క్లిప్స్ తయారుచేసే ఇండస్ట్రీ పెట్టుకున్నాడు. ఆయనా తన బిజినెస్‌కి తిరగాల్సిందే. నేను కంపెనీలకు, ఆఫీసులకు వెళ్ళినప్పుడు ఆయనా కన్పించాడు అక్కడ. నేను చేస్తున్న పనికి ఎంతో అభినందించాడు. ఆయనే నాకు ఏడెనిమిది సంస్థల్లో బిజినెస్ ఇప్పించాడు. మొన్న ఓ కంపెనీలో కనపడినప్పుడు నా పరిస్థితి వివరించాను. "దానికేముందమ్మా! నేనెటూ తిరగాలిగా. నీక్కూడా ఆర్డర్లు సంపాయిస్తాలే. అయితే నా కమీషను మాత్రం ఇవ్వాలి" అన్నాడు నవ్వుతూ. "మీరు చేసిపెట్టాలేగానీ, తప్పకుండా ఇస్తాను అన్నయ్యా!" అన్నాను. "దానికేముందిలే అమ్మా!" నవ్వుతూ అన్నారాయన. మీరు 'సరే'నంటే ఆర్డర్లు తీసుకొచ్చేపని ఆయన కప్పజెబ్దాం. ఆర్డర్లు ఎక్జిక్యూట్ చెయ్యటానికి మీరెలాగో వున్నారు" అంది సంధ్య.

"దానికేం సంధ్యా! అలాగే ఇద్దాం" అన్నాడు శ్రీనివాసు.

"ఆయన చేత ఊరికే పనిచేయించుకోవటం నాకు నచ్చదు. ఇంత అని కమీషను ఆయనకిద్దాం. ఓ అయిదారు నెలలు మన లాభాలు కొద్దిగా తగ్గుతాయి. ఎవరిచేతా ఊరికే పనిచేయించుకోవటం నాకిష్టముండదు" అంది సంధ్య.

భార్యాభర్తా వెళ్లి కృష్ణతో మాట్లాడారు. అతను ఎంతో ఆనందంగా ఒప్పుకున్నాడు. "అలాగేనమ్మా! మా దేవకో, మీనానో అయితే చేయనా, ఐదారునెల్లేగా" అన్నాడతను.

అతిబలవంతంమీద నలభైశాతం కమీషన్ తీసుకుని పనిచేయటానికి అతను ఒప్పుకున్నాడు.

అతనితో మాట్లాడి బయటకొచ్చిన తరువాత అన్నాడు శ్రీనివాసు, "చాలా తేలిగ్గా సమస్య పరిష్కరించావు సంధ్యా! నేనింకా ఈ గడ్డు ఎలా ఎదుర్కోవాలన్న మీమాంసలో పడిపోయాను"

"ప్రయత్నిస్తే ఏ సమస్యలయినా పరిష్కారమవుతాయి. ప్రయత్నించకుండా అవి మనవల్ల కావు అని కూర్చుంటే పరిష్కారమెలా అవుతాయి"

"అలాగాండి. మరి మన పెళ్లి విషయంలో తమరేం ప్రయత్నంచేయ నిరాకరించారెందుకో"

"నిరాకరించానా? ప్రయత్నమేం చేయలేదా? మీ అమ్మగార్ని అడగండి చెప్తాంది. 'బోగంటక్కుల్ని చూపి మిమ్మల్ని వశపరుచుకున్న తర్వాత నేను చెయ్యాల్సిందేవుందీ"

"అదుగో మళ్లీ అమ్మమీద అక్కసు వెళ్లబోస్తున్నావు"

"అక్కను కాదుగానీ, ఎంత మర్చిపోదామన్నా ఒక్కోసారి ఆమె అన్నమాటలు గుర్తుకొస్తుంటాయి. అలా అని ఆమెని అగౌరవపరచటంకానీ, అలక్ష్యం చేసే మనస్తత్వం కాదు నాది''

"నాకు తెలీదా మార్గదర్శీ!''

★ ★ ★

"కళాభవన్‌లో ఆర్ట్ ఎగ్జిబిషన్ పెట్టారు. నావి, రామ్మూర్తివి కూడా పెయింటిగ్స్ ఎగ్జిబిట్ చేస్తున్నారు, వెళ్దామా దేవకీ'' అన్నాడు పరమేశం సాయంత్రం భార్య ఆఫీసునుండి తిరిగి రాగానే.

ఆమె పొద్దుటినుండీ పనిచేసి అలసిపోయి వుంది. ఇంకా వంటపని చూడాలి. బజారుకెళ్లి సరుకులు కూడా తెచ్చుకోవాల్సివుంది. పైగా ఆ బొమ్మలు చూడటమంటే చిరాకు దేవకికి. అంతకంటే సినిమాకు రమ్మంటే ఓపకి లేకపోయినా ఎలాగో ప్రయత్నించి బయలుదేరేది.

"నావల్లకాదు బాబూ! వళ్లు కొట్టిన పిండైంది. పొద్దుట్నుంచీ ఒకటే చాకిరి. ఇంకా వంట కూడా చేయాలి'' అంది.

"రాత్రికి ఏ హొటల్లోనయినా భోజనం చేద్దాంలేవోయ్. ప్రపంచంలోకెల్లా పనికిమాలిన వాటికి ప్రాముఖ్యతనిస్తావు నువ్వు'' అన్నాడు అతను.

"ఏది పనికిమాలిన పని. భోజనం చేయటం పనికిమాలిన పనా?''

"ఆఁ భోజనం ఎక్కడ చేస్తే సరిపోదు. కుదరకపోతే మానేస్తే సరి. ఓపూట తినకపోతే కొంపలేం ముంచుకపోవు. లెట్స్ గో, అండ్ సీ ద ఆర్ట్స్ ఎగ్జిబిట్స్. యువిల్బీ ట్రాన్స్‌పోర్టిట్ ఇంటూ సబ్లైమ్ రెలమ్స్ ఆఫ్ డిలైట్. దట్స్ లైఫ్''

"బాబూ! మీ కళాజీవితానికో నమస్కారం. ఇంట్లోవుండే బొమ్మలే చూడలేక ఛస్తున్నాను. ఇంకా అక్కడకు వెళ్లి కూడా అవే చూడాలా? కొంపనిండా వున్న ఈ పెయింటింగులు చూస్తుంటే చిరాకొస్తోంది. ఎప్పుడో మంచిరోజు చూసి అన్నిటిన్నీ తీసి, గుట్టగా పడేసి తగలెట్టేస్తాను''

"ఆపనిమాత్రం చేయక. అవి నా ప్రాణం''

"అవును, ప్రాణమున్న మనుమలు మీకు లెక్కలేదు. నిర్జీవమైన ఆ కాన్వాసులే పెళ్లాంకన్నా మిన్న అంతేగా''

"వాటితో పోటీ ఏంటి నీకు? నన్నర్థం చేసుకోటానికి ప్రయత్నించు''

"మీ కళాకారుల కర్థముంటేగా అర్థమయేందుకు''

"ఇంతకీ ఏమంటావు. ఎగ్జిబిషనుకు వస్తావా, రావా?''

"మీ తులసి వస్తోందా?''

"మా తులసేంటి? ఎందుకు రాదామ్మాయి! వాళ్ళ నాన్న పెయింటింగ్స్ కూడా ఎగ్జిబిట్ చేస్తుంటే...''

"ఇంక నేను రాకపోయినా ముంచుకుపోదు లెండి. అయినా ఆ బొమ్మలంటే నాకేమాత్రం ఇంట్రస్ట్ లేదు. మీరు వెళ్లండి''

"సరే... నీ ఖర్మ'' అంటూ చరచరా నడుచుకుంటూ వెళ్లిపోయాడు పరమేశం.

'ఇంటికి అలసిపోయివస్తే కాఫీ కాచిఇచ్చే దిక్కయినా లేదు' అనుకుంటూ గుడ్డలు మార్చుకుని, ముఖం కడుక్కుని కాఫీ కలుపుకు తాగింది. కాస్తంత అలసట తీరినట్లనిపించిందామెకు. సాయంత్రం ఆరున్నరే అయింది.ఇంకో గంటాగి అయినా వంట మొదలెట్టవచ్చు. తొందరేంలేదు. బయటకెళ్లిన మనిషి ఎప్పుడొస్తాడో తెలీదు. వచ్చినా భోజనం చేస్తాడని నమ్మకం లేదు. బయటే తినిరావచ్చు. ఒకరోజు ఇంటికే రాడు. టయిముకొచ్చినా పరధ్యానంగా భోజనం చేస్తాడు. తనకీవస్తువు ఇష్టమనీ, అయిష్టమనీ లేదు. ఏవంకా పెట్టకుండా భోజనం ముగిస్తాడు. ఇలాంటి మనిషికోసం వంటచేయటానికి ఏమీ కష్టపడవల్సిన పనిలేదు. రుచిగా పదార్థాలు చెయ్యాల్సిన పనిలేదు - నిజానికామెకు వంటమీద శ్రద్ధ తగ్గిపోతుంది. ఏదో ఒకటి వండిపడేస్తుంది. తనకోసమయినా వంట చేయకతప్పదు. అందువల్ల ఆమెకు ఏమాత్రం ఉత్సాహంలేదు. సరుకులు తెచ్చుకోవాలి. అన్నీ నిండుకున్నాయి. అతనికేం పట్టదు. వారంరోజులనుండి బజారుకెళ్లాలని ప్రయత్నిస్తోంది కాని తీరుబాటు కావటంలేదు.ఇవాళయినా

తెచ్చుకోకపోతే ఇబ్బంది అని లేచి గుడ్డలు మార్చుకుని హాండ్‌బాగ్ తీసుకుని కప్‌బోర్డ్‌లో డబ్బు తీసుకుందామని సీక్రెట్‌లాకర్‌లో చెయ్యిపెట్టింది. నరుకులు తెచ్చుకోటానికి, మిగతా అవసరాలకి వుంటాయని ఫస్టుతారీఖున జీతం రాగానే 500 రూపాయలు అందులో దాచింది ఆమె. అక్కడేం ఆమెకు పైన కన్పించలేదు. "డబ్బేమయింది. ఆయనగారు తీశారా? సాధారణంగా తనకు చెప్పకుండా తీయరే. ఆయనే తీసివుండాలి. చెప్పటం మర్చివుంటాడు" అనుకుంది కోపంగా దేవకి. తను ఇంట్లోకి ఇచ్చేది అంతంతమాత్రమే అయినా తన జీతండబ్బు కూడా వాడుకుంటే ఎట్లా? ఇల్లు గడిచేది ఎలా? ఆమెకి మండిపోయింది. ఇక బజారుకెళ్లాల్సిన పని లేకపోవటంతో అలాగే పక్కమీద పడుకునుండిపోయింది. అలసిపోయివుండటంతో నిద్ర పట్టేసింది ఆమెకు. మెళకువ వచ్చేటప్పటికి తొమ్మిదిగంటలయింది. ఇంకా పరమేశం అంతులేడు. దేవకి బద్ధకంగా లేచి వంట ప్రయత్నాలు చేసి, స్నానం చేసి వంటింట్లో నుండి బయటపడేటప్పటికి రాత్రి పదిగంటలయింది.

"పరమేశం ఇంకో అరగంటకుగాని ఊడిపడలేదు. అతన్ని చూడగానే అప్పటిదాకా అణచుకున్న కోపం అంతా బయటపడింది.

"ఇంతసేపూ అక్కడే వున్నారా?" అన్నది.

"లేదు. ఎనిమిదిగంటలకల్లా అక్కడ నుండి బయటపడ్డాను. తులసి ఏదో షాపింగ్ చేద్దామంటే వెళ్లాం. ఆమెను వాళ్లింటి బస్సు ఎక్కించి వస్తుంటే తోవలో లక్ష్మణరావు కనిపించాడు. వాడు బలవంతం చేస్తే బార్‌లో రెండు పెగ్గులు పుచ్చుకుని వచ్చేటప్పటికి ఆలస్యమయింది" అన్నాడు పరమేశం. అతడు ఉత్సాహంగా వున్నాడు. భార్య మూడ్ పరికించేస్థితిలో లేడు.

"భోజనంచేసే ఆలోచన వుందా లేదా?"

"ఎందుకు చేయను. పద వడ్డించు, కాళ్లు చేతులు కడుక్కువస్తాను"

అన్నం వడ్డిస్తూ అంది దేవకి. "వాళ్లనాయనా, అమ్మా లేరా తులసిని షాపింగ్‌కి తీసుకెళ్లటానికి. ఇంట్లో వస్తువులు తేవటానికి తీరికుండదుగానీ, బయటవాళ్లకు అడ్డమైన పన్లు చేయటానికి బోలెడంత తీరికొస్తుంది మీకు" అని.

"రామ్మూర్తికేదో పనుండి ఎగ్జిబిషన్‌కి రాలేకపోయాడు. 'మీరు ఇంటికి వెళ్లేతోవే కదాసార్! వస్తారా' అని ఆమె అడిగితే కాదనలేకపోయాను"

"ఈమధ్య ఆ పిల్ల డ్రాయింగు నేర్చుకోవటానికి వస్తున్నట్టు లేదేం?"

"వస్తూనే వుంది, వారానికి మూడురోజులు. కాలేజీనుండి డైరెక్ట్‌గా ఇటే వస్తోంది. మన ఇంటికొచ్చి నాలుగు, నాలుగున్నరకల్లా వెళ్లిపోతోంది"

"పొన్లెండి ఎవరికీ ఇబ్బంది లేకుండా నేను ఇంట్లో వుండని సమయాన్ని ఎన్నుకున్నారు. మరి మీరు పత్రికల ఆఫీసులకెప్పుడు వెళ్తొన్నారు?"

"వన్నెండెంటికెళ్లి మూడు గంటల్లోపల తిరిగి వస్తున్నాను. నువ్వేదో ద్వంద్వార్థాలతో మాట్లాడుతున్నట్టుంది. గుర్తుంచుకో. ఆ పిల్లతో నా సంబంధం ఒట్టి శిష్యురాలుగా మాత్రమే. అంతకంటే ఏంలేదు"

"శిష్యురాలికి పాఠాలు బాగా చెప్పి మీకు నచ్చేటట్లు మలచుకోండి. ఆ పాఠాలేవో వాళ్ళింటోనే చెప్పిరారాదూ! రోజూ నేను లేని సమయంలో ఆ పిల్ల మనింటికి రావటం, ఇరుగు పొరుగులు చెవులు కొరుక్కోటం ఈ బాధంతా ఎందుకు?"

పరమేశం ఆమెకేం సమాధానమివ్వలేదు.

"అదినరే కప్‌బోర్డ్ లాకర్‌లో అయిదొందలు వుంచాను, నరుకులు తెద్దామని. మీరుగాని తీశారా?"

"అవును తీశాను. నీకు చెప్పటం మర్చిపోయాను. వెంకటకృష్ణ మొన్న డబ్బు అవ్వు కావాలని వస్తే ఇచ్చాను. వాడు చాలా ఇబ్బందుల్లో వున్నాడు. దీనంగా మొహంపెట్టి అడిగితే కాదనలేకపోయాను. రెండువేలయినా కావాలన్నాడు. నా దగ్గరా డబ్బులేదు. కప్‌బోర్డ్‌లో చూస్తే అయిదొందలే కనిపించింది. ప్రస్తుతానికి వుంచు, తరవాత చూద్దామని చెప్పాను" అన్నాడు పరమేశం.

''రెండువేలేం ఖర్మ, ఇచ్చేవాడుంటే పదివే లయినా అడుగుతాడు. కిందటినెల్లో వెయ్యి రూపాయలు పట్టుకెళ్లాడు. తిరిగి ఇచ్చాడా? మీ దగ్గర లేకపోతే మీ తమ్ముడు రామచంద్రం దగ్గర అప్పుచేసి తీసుకొచ్చి ఇచ్చారుగదా! అయినా నా బుద్ధి తక్కువగాని మిమ్మల్ని అడగటం. అతనెందుకు తిరిగి ఇస్తాడు. 'పాత బాకీ కట్టి కొత్త అప్పు అడగ'మని మీరు చెప్తేగా, అతను ఇవ్వటానికి. సరే రామచంద్రా నికి అప్పు తీర్చారా మీరు''

''లేదు కుదరలేదు, వెసులుబాటు కాలే దు''

''ఇంకా, మీ మిగతా స్నేహితులకు మీరు తెచ్చిన బాకీలు చెల్లించలేకపోయినా ఫర్లేదు గాని రామచంద్రానికి మాత్రం వెంటనే తీర్చే యండి''

''ఎందుకివ్వను. డబ్బులుండాలిగదా''

''డబ్బు లేకపోతే అప్పయినా తెచ్చి అతని బాకీ తీర్చేయండి''

''వాడు నేను అప్పు తీర్చలేదనేం బాధపడ డులే. అలాంటి మనిషి కాడు వాడు. అయినా మా తమ్ముడి బాకీ విషయంలో నీకింత పట్టింపు ఎందుకు. నేను చూసుకుంటాగా?''

''ఆ మాబాగా చూసుకుంటారు. రామ చంద్రం దగ్గర అప్పు తెచ్చారంటే మా మీనాకి తెలియకుండా వుండదు. అది ఖచ్చితం మనిషి. అప్పంటే తీర్చాల్సిందేనని దాని ఉద్దేశం. రేపొద్దున 'అక్కా! బావగారు మా ఆయన దగ్గర వెయ్యిరూపాయలు పట్టుకెళ్లా రు. బావగార్ని ఆ డబ్బు త్వరగా ఇవ్వమను' అని అన్నా అనగలిగిన మనిషి. అదే జరిగితే నేను మొహం ఎక్కడ పెట్టుకోను. ఇంతకు ముందే మీరు తాగుతారని దానికి మంట. ఇలా అప్పులుచేసి ఎగ్గొట్టే మనిషని తెలిస్తే ఇంక నా పరువు గంగలో కలుస్తుంది''

''నేనేం చేస్తానో ఆమెకనవసరం. ఆమె దగ్గ రేం నేను అప్పు తేలేదు. మా తమ్ముడి దగ్గర తెచ్చాను. మా మధ్య ఈ అరమరికలేంలేవు. వాడు ఎం.బి.యే. నా దగ్గరే వుండి చదువుకు న్నాడు. వాడి ఖర్చుకింద నేనేం మా చిన్నాయ నసుండి డబ్బేం తీసుకోలేదు. పైగా మా నాన్నా చిన్నాయన కూడా డబ్బు మనుమలు కారు''

''ఎప్పుడో ఇక్ష్వాకుల బాలసారెనాటి సంగ తులు చెప్పకండి నాకు. పెళ్లయింతర్వాత మనుమలు మునవటిలా వుండరు. ముందా బాకీ తేర్చేయండి''

''అలాగే''

''అలాగే అంటే ఎప్పుడు?''

''రేపో ఎల్లుండో చూద్దాంలే''

''ఇంట్లో సరుకులు అయిపొయ్యాయి. ఉన్న డబ్బు కాస్తా ఆ వెంకటకృష్ణ ఎదానపోశారు. ఇచ్చేనా చచ్చేనా. ఇంటి ఖర్చుకోసం డబ్బు కావాలి''

''అలాగే''

''ఎప్పుడిస్తారు?''

''రేపో, ఎల్లుండో''

''అలా అంటే కుదరదు. సరిగ్గా రేపో, ఎల్లుండో చెప్పండి''

పరమేశం విసుగ్గా ఆమెవంక చూశాడు. చెయ్యి కంచంలో కడిగేసుకుని ముందు గదిలో కిపోయి లాల్చీ జేబులోనుండి ఓ చెక్కు తీసుకొ చ్చి డైనింగ్ టేబిల్‌మీద ఆమె ఎదురుగా పడేస్తూ- ''ఇదుగో, ఈ చెక్కు బ్యాంక్‌లో ప్రె జెంట్‌చేసి, నీ ఇష్టమొచ్చినట్టు చేసుకో ఆ డబ్బుతో. ఆఁ నీ పరువుపోకుండా రామచంద్రా నికి కూడా డబ్బు పంపు. నన్నిలా ప్రతి చిన్న విషయానికీ రాచిరంపాన పెట్టకు'' అన్నాడు పరమేశం.

దేవకి ఆ చెక్కుని చూసింది. పదివేలరూపా యల చెక్కు అది.

''ఇంత డబ్బుకి ఎవరిచ్చారీ చెక్కు?'' అన డిగింది.

''నా పెయింటింగ్ ఒకటి అమ్ముడుపో యిందిలే'' అన్నాడు విసుగ్గా పరమేశం.

''మిగతా డబ్బు నేను ఉంచుకునేదా?''

''ఉంచుకో ఉంచుకోమనేగా ఇచ్చాను'' అన్నాడు పరమేశంకోపంగా.

''ఎందుకండీ అంతకోపం. నాతాపత్రయ మంతా మనం పరువుగా బతకాలనేగా. మా పుట్టింట్లో మీకున్న గౌరవం పోకోడదనేగా నా

బాధ. తులసి విషయంలో కూడా వాళ్లు వీళ్లు ఏం చెప్పుకుంటారో అనే కష్టం కలుగుతుంది. అంతేకాని మీరంటే అనుమానముండికాదు. నా మాటలు అర్థంచేసుకోండి'' అంది దేవకి అనునయంగా.

''దేవకీ... నీవన్నీ అర్థంలేని భయాలు. వాళ్లూ వీళ్లూ ఏదో అనుకుంటారని మన బతుకు మనకిష్టమొచ్చినరీతిలో బతకలేకపోతే ఎలా?'' అన్నాడు పరమేశం బెడ్‌రూంలోకివెళ్తూ.

★ ★ ★

ఆరోజు రామచంద్రం ఇంటికి వచ్చేటప్పటికి రాత్రి పన్నెండుగంటలయింది. మీనాక్షి సోఫాలో కూర్చుని పుస్తకం చదువుతూ భర్తకై నిరీక్షిస్తోంది. డోర్‌బెల్ మోగితే వచ్చి తలుపుతీసింది. వచ్చింది రామచంద్రమే.

''ఇంత లేటయిందేం?'' అంది సోఫాలో కూర్చున్న భర్త దగ్గరకు వచ్చి అతని షూస్ విప్పటానికి లేస్‌లు వదులుచేస్తూ.

''ఓ ఫ్రెండ్ బలవంతం చేస్తే సెకండ్ షోకి వెళ్లాను'' సమాధానమిచ్చాడు రామచంద్రం.

''ఇంతే మీకెప్పుడూ సినిమాలూ షికార్లూ. ఇల్లాలు ఇంట్లో ఒక్కతే వుంటుందనే ఇంగితమే వుండదు''

''ఇంగితమా అదెట్లావుంటుంది? పోనీ ఆ ఇంగితమో, సంగీతమో నీకేవుండొచ్చుగా. పాపం మగవాడు నలుగురితో తిరిగేవాడు, నూటిక్కోటికో సినిమాకి సరదాగా పోతే ఏం బోయిందని నువ్వర్థం చేసుకోవచ్చుగా. అయినా రాత్రి పన్నెండు అయినా నిద్రపోకుండా ఈ నిరీక్షణేమిటి? నిన్ను నువ్వు శిక్షించుకుంటున్నావా? నాకు శిక్ష వేస్తున్నావా?'' అన్నాడు రామచంద్రం ఆమె చేతులు పక్కకి నెట్టి తనే షూస్ విప్పుకుంటూ.

''రాత అట్లా తగలడితే ఎవరేం చేయగలరు? హూఁ... అబ్బా... గుర్రం కూడా ఎక్కొచ్చారన్నమాట'' వ్యంగ్యంగా కంపరంగా అంది మీనాక్షి.

''ఛఛ నేనేం రాకుమారుణ్ణా, గుర్రమెక్కటానికి? మీనాక్షమ్మ చచ్చు మొగుణ్ణి. సూర్యం ఆటోలో దింపి వెళ్లేను...''

''ఎందుకెక్కరూ? నానెత్తి కెక్కినవాళ్లు గుర్రాలూ, గాడిదలూ ఏం ఖర్మ, దేన్నయినా ఎక్కుతారు. అయితే ఆ సూర్యం నిర్వాకమన్నమాట ఇది'' అంది మీనాక్షి కోపంగా.

''అబ్బబ్బా... నేనేదో మర్డరు చేసొచ్చినట్టు ఏంటా మాటలు? సూర్యానికి కొడుకు పుట్టాడు. అందుకని సరదాగా కాస్త పుచ్చుకున్నాం. ఈ మాత్రపుదానికి చేయరాని నేరమేదో చేసినట్లు...''

''సరే ఇది చెప్పండి సూర్యమెక్కడ కలిశాడు మీకు''

''గంగలో కలిశాడు నీకెందుకు?''

''ఇద్దరూ కల్సి గంగలో మునిగారు. ఏ సినిమా చూశారు?''

''కిరాయిరౌడీ''

''ఏ హాల్లో''

''శాంతిలో కాబోలు''

''కాబోలేంటి? సినిమాకు వెళ్లలేదా?''

''వెళ్లాం వెళ్లకేం''

''కాని శాంతిలో 'ఇద్దరు పెళ్లాలు' సినిమా వుందే?''

''వుందేమో''

''అంటే మీరు సినిమాకు వెళ్లిన మాట అబద్ధం''

''అవును అబద్ధమే. అయితే ఏమిటంటావు?''

''అంటే మీరిద్దరూ ఏ ఆరు గంటలకో కలిశారు. పదకొండున్నరదాకా బార్‌లోవున్నారు. అయిదున్నర గంటలు తాగారు. ఎన్ని బాటిల్స్ తాగారు? ఇది కాస్త పుచ్చుకోవటమా? ఇలా తాగితే బతికేందుకేనా? నన్నేం చేయదల్చుకున్నారు? అసలు మీరు పెళ్లెందుకు చేసుకున్నారు?'' అంది ముక్కు చీదుకుంటూ మీనాక్షి.

ఆమె అంచనాలో ఏమీ తప్పులేదు. తాగిన విషయం ఆమె కనుక్కోలేదు లెమ్మని సెకండ్‌షో అని అబద్ధమాడాడు. ఆమె క్రాస్ ఎగ్జామినేషన్ చేసి, సిఐడిలా కూపీలాగి సత్యాన్ని బయటపెట్టేసింది. ఆమె పరిస్థితిచూస్తే తను పుచ్చుకున్న హాఫ్ బాటిల్ విస్కీమత్తు

పూర్తిగా దిగిపోయింది రామచంద్రానికి. ఆమె భోజనం కూడా చేయకుండా తనకై నిరీక్షిస్తోంది. అలాంటి భార్యతో ఏం వాగ్వివాదం చెయ్యాలో ఎలా జవాబు చెప్పాలో తోచలేదు అతనికి.

"ఇది మరీ అన్యాయం. ఈ రోజుల్లో ప్యూన్ నుండి పి.యమ్‌దాకా తాగనివాడే లేడు. అయినా నేనేం రోజూ తాగుతున్నానా? ఎప్పుడో ఓసారి కంపెనీకోసం తప్పదు. అకేషనల్‌గా తాగే వాళ్లందరూ డ్రంకర్డ్స్‌కాదు" అన్నాడతను.

"ఆ రోజులు ఇంకెంతో దూరం లేవులేండి. ఇప్పటిదాకా మీ అన్నగారే తాగుడుకు బానిస అనుకున్నాను. ఈ తాగుడు వ్యసనం మీ వంశంలోనే వున్నట్టుంది"

దాంతో కోపమొచ్చింది రామచంద్రానికి "పాపం అక్కడికి మీ వంశం స్వచ్ఛమైంది. నీకు తెలీకపోతే తెల్సుకో. ఇవాళ మీ అన్నా అదే కృష్ణ బార్‌లో కన్పించాడు. మాకూ కాసేపు కంపెనీ ఇచ్చాడు. జాగర్తండోయ్ బావగారూ.. మా చెల్లాయికి తెలీకుండా జాగర్త పడండి అని హెచ్చరిక కూడా చేశాడు"

"ఎదుర్రంకు కట్టకండి. మిమ్మల్ని అన్నానని వాడికీ ఆ వ్యసనాన్ని అంట గడ్తున్నారు. మా కుటుంబంలో అలాంటి అలవాటు వున్నవాళ్లెవరూలేరు. మీరు చెప్పినా నేను నమ్మను"

"మూర్ఖత్వం ముందు పుట్టి ఆడవాళ్లు తరువాత పుట్టారు. నమ్మొద్దులే అతన్నయినా హాయిగా బతకనీ. మీ అమ్మా నాన్నలకు చెప్పి గొడవచేయక"

"గొడవ చేయాల్సిన ఖర్మ నాకేంలేదు. వాడి సంగతి వాడి భార్య చూసుకుంటుంది నిజంగా మీరన్నమాట నిజమయితే"

"అంటే భార్యలు భర్తల గార్డియన్లు అన్నమాట"

దారితప్పి చరించేవాళ్లకు మంచి మార్గంలో పెట్టేవాళ్లెవరైనా వుండాలిగా"

"నేనేం దారి తప్పి చరించటం లేదు. నువ్వు నాకు చెప్పాల్సిన అవసరంలేదు"

"ఇంక మీరేం మాట్లాడకండి. తాగుబోతులూ, తిరుగుబోతులూ అంటే నాకసహ్యం. మీకిది ఫైనల్‌వార్నింగ్. మీరింకెప్పుడూ తాగటానికి వీల్లేదు"

"మీనా ... దిసీజ్ టూమచ్"

"టూమచ్ లేదు, త్రీమచ్ లేదు, లేచి పడుకోండి"

"భోంచేద్దాంలే" అన్నాడు రామచంద్రం. తనకు ఆకలేయకపోయినా తను తినకపోతే ఆమె అభోజనంగా పడుకుంటుందని లెమ్మన్నాడతను.

"ఇంత పొద్దుపోయింతర్వాత భోంచేస్తే అరగదు. ఆరోగ్యానికి మంచిదికాదు. గ్లాసుడు మజ్జిగ తెచ్చి ఇస్తాను. తాగి పడుకోండి. ఆ తాగిన మత్తయినా వదులుతుంది" అంది మీనాక్షి లేస్తూ.

"మరి నువ్వు ... నువ్వూ తినవా?"

"నేను తినను"

"ఇలా నిన్ను నువ్వు శిక్షించుకుని ఆ విధంగా నన్ను శిక్షించాలనుకోవటం మహా దుర్మార్గం"

"అవును ... మీ ప్రవర్తన సన్మార్గం, నాది దుర్మార్గం"

ఆమె లేచి వెళ్లి గ్లాసుతో మజ్జిగ తెచ్చిచ్చింది. మజ్జిగ తాగి, బట్టలు మార్చుకుని పక్కమీదకు చేరాడు రామచంద్రం.

మీనాక్షి లైటార్పి వచ్చి భర్తకు దూరంగా పడుకుంది.

"మీనా ... ఇటు తిరుగు" అంటూ ఆమె మీద చెయ్యివేశాడు అతను.

"చెయ్యి తీసెయ్యండి" అంది ఆమె అతని చేతిని తోసేస్తూ.

"తాగినంతమాత్రాన మొగుడు మొగుడు కాకుండా పోతాడా?"

"తాగిన మగవాడు మొగుడు కాదు, సైతాన్"

"నేను సైతాన్లా కనిపిస్తున్నానా?" అంటూ మళ్లీ ఆమె భుజంమీద చెయ్యి వేశాడు రామచంద్రం ఆమెను తనవేపు తిప్పుకునేందుకు ప్రయత్నిస్తూ.

"మాటలనవసరం. ఇంక గప్‌చిప్‌గా పడు

కోండి'' అని అతని చెయ్యిని విదిలించి లేచివెళ్లి కింద చాపపరుచుకు పడుకుంది మీనాక్షి.

రామచంద్రానికి భార్య ప్రవర్తనవల్ల కోపం వచ్చింది. అయినా ఏంమాట్లాడలేకపోయాడు. ఆమెకు మంచీచెడూవల్ల కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి. ప్రపంచంలో మంచీచెడేకాక వాటిమధ్య షేడ్స్ వుంటాయని ఆమెకసలు ఆలోచనే వుండదు. తాగటం చెడు అని ఆమె పూర్తి నమ్మకం. ఎలా వాదించీ ఆమెనీ, ఆమె అభిప్రాయాలనీ ఎవరూ మార్చలేరు. ఆమెది మూఢత్వమో తెలివిగలతనమో అతనికర్థంకాదు. ఈ ప్రేమ, ఈ బంధనం, ఈ బంగారు సంకెళ్లనుండి ఎలా బయటపడాలి? ఎక్కువ ఆలోచన చేయకుండానే తాగిన మత్తు అతనికి త్వరలోనే నిద్రపట్టించేసింది.



ఇంటివాళ్ల పెద్దమ్మాయి జ్యోతికీ, దేవకికీ చాలా స్నేహం. జ్యోతికి సుమారు 18 ఏళ్ల వయసు వుంటుంది. కల్లాకపటం తెలియని పిల్ల. మనసులో ఏం దాచుకోదు. సాయంత్రాలు వీలైనంతగా దేవకి ఇంట్లోనే కాలక్షేపం చేస్తూవుంటుంది. అదీ పరమేశం ఇంట్లో లేకపోతేనే. అతను ఇంట్లో వుంటే ఆ ఛాయలకు కూడా రాదు. వయసులో పదేళ్లే తేడావున్నా దేవకిని 'ఆంటీ' అని పిలుస్తూవుంటుంది.

ఆరోజు దేవకి ఆఫీసునుండి వచ్చింది. అలసటగా వున్నట్లుంటే కాళ్లు మాత్రం కడుక్కుని బట్టలు మార్చకుండా పక్కమీద నడుంవాల్చింది. తలుపు చప్పుడయితే వెళ్లి తలుపు తీసింది.

"ఇప్పుడు నిద్రపోతున్నారా ఆంటీ?" అని నవ్వుకుంటూ దేవకి వెనకవేపుకొచ్చి చనువుగా మంచంమీద కూర్చుంది.

"నిద్ర కాదు జ్యోతీ ... ఇవాళ ఆఫీసులో ఊపిరి సలుపుకోటానికి కూడా తీరిక లేనంత పనుంది. అలసిపోయినట్లుంటే పడుకున్నాను. కాఫీ కలుపుకునే ఓపిగ్గూడా లేదు" అంది.

"నేను కలిపిస్తాను వుండు ఆంటీ" అని అయిదు నిమిషాల్లో రెండు కప్పుల్లో కాఫీ పట్టుకొచ్చింది. "అంకుల్‌కి కూడా ఓ కప్పు కాఫీ ఫ్లాస్కులో పోశాను. ఆ తులసి వస్తే మాత్రం చాలదు" అంది దేవకికి కాఫీ కప్పు ఇస్తూ.

"ఏం, ఆమె అంటే నీకిష్టంవున్నట్టు లేదు"

"నాకేంటి? ఎవరికీ ఇష్టంలేదు. అసలామెని చూస్తేనే నాకు కంపరం. మగాళ్లతో అలా రాసుకు పూసుకు తిరగటం తప్పుకాదా ఆంటీ? పైగా పెళ్లయినవాళ్లతో ఇంకెంత జాగ్రత్తగా వుండాలి? మాకు చూసేవాళ్లకే అంత చిరాగ్గా వుంటే మీకెలాగుందో? మీరింత అలుసు ఈయబట్టే ఆ అమ్మాయి అంత చొరవ తీసుకుంటోంది. నన్నడిగితే తప్పంతా మీదే ఆంటీ" అంది పెద్ద ఆరిందాలా.

"డ్రాయింగ్ నేర్చుకోవటానికి వస్తున్నది. ఏ ఆర్ట్ ఎగ్జిబిషన్‌కో కలసి వెళ్తూంటారు. మనసు మంచిదయితే మగవాళ్లతో చనువుగా వుంటే తప్పేం?" అంది దేవకి.

"హయ్యో రామ! మీకెందులోనూ తప్పు కన్పించదు. మీరింత అమాయకంగా వుండబట్టే వాళ్ళు మిమ్మల్నిలా ఆడిస్తున్నారు. ఈ చుట్టుపక్కలవాళ్లంతా వాళ్లిద్దరి గురించే అనుకుంటున్నారు. మీకు బాధగా లేదా ఆంటీ! అంకుల్ గురించి చెడుగా అనుకుంటుంటే"

"ఏమనుకుంటున్నారు?"

"వాళ్ళిద్దరూ కల్సి పెళ్లి చేసుకున్నా చేసుకుంటారని"

ఆ మాటతో కోపం వచ్చింది దేవకికి.

వాళ్లకి బుద్ధిలేకపోతే నీకూ లేదూ? చదూకోగానే సరిపోదు జ్యోతీ! కాస్తంత బుద్ధికూడా ఎదగాలి. మనమింకా మన బామ్మల్లా ఆలోచిస్తే ఎలా? ఆడ మగ కల్సి ఎక్కడికైనా వెళ్ళి

నంతలో వంకర చూపులు, వంకరమాటలూ తప్ప మరో ఆలోచన వుండదా...

"మీక్కోపం వస్తూందేమోకాని ఆంటీ! ఎప్పుడైనా నిప్పులేకుండా పొగరాదు. మీకేంతెల్సు. మీరు ఆఫీసుకుపోతారు"

"ఆ అమ్మాయి చాటుమాటుగా వస్తుందనుకుంటున్నావేమో. ఆమె డ్రాయింగు నేర్చుకోటానికి వస్తుందని నాకు తెల్సు"

"అయినా అది సరైన పద్ధతా ఆంటీ!

మీరున్నా లేకపోయినా గంటల తరబడి కూర్చోవటం... ఆ ఇకయికలు, పకపకలూ... అన్నీ వెకిలివేషాలే. నాన్నయితే ఏమన్నారో తెల్సా. మిమ్మల్ని చూసి ఊరుకోవటమే తప్ప లేకపోతే ఇల్లు ఖాళీ చేయించేవాడిని అన్నారు"

దేవకి మౌనంగా, భారంగా వింటోంది.

"సారీ ఆంటీ! కోపమొచ్చిందా? అంకుల్ బొమ్మలు బాగా వేస్తారని ఆయన అంటే అందరికీ అభిమానమే. కాని ఇలా తాగటం, పెళ్ళికాని పిల్లతో తిరగటం- ముఖ్యంగా ఆ అమ్మాయి మీ ఇంటికి రావటంతో అంతా చులకనగా చూస్తున్నారు. అసలే అలసిపోయారు. నామాటలు మిమ్మల్ని బాధపెట్టినట్లున్నాయి. రెస్ట్ తీసుకోండి ఆంటీ!" అని ఆమె వెళ్లిపోయింది.

ఇంకెక్కడి రెస్ట్. దేవకి మనసంతా వికలమయింది ఆమెకి భర్తంటే ఎంతో అభిమానం. అతడు కళాకారుడు. అతడికి కొన్ని బలహీనతలు వున్నాయి. వాటిని అంతగా పట్టించుకోకూడదు అని ఈ ఐదేళ్ల వైవాహిక జీవితంలో నేర్చుకుంది ఆమె. అతడు తాగినా, ఇతర స్త్రీలతో సంబంధం పెట్టుకున్నా ఆమె సహించగలదు. ఎవరికీ తెలియకుండా అన్నీ గుట్టుమట్టుగా జరిగిపోతే ఆమె అసలు పట్టించుకోదు. ఇతరులెవరైనా వేలెత్తి చూపినప్పుడు ఆమెకు తల కొట్టేసినంత బాధ కలుగుతుంది. భర్తకి తులసితో సంబంధం వుందో లేదో ఆదేవుడికే తెలియాలి. వుందని నమ్మకమూ లేదు. వున్నా బాధలేదు. అతన్నడిగితే కుండబద్దలు కొట్టినట్టుగా సత్యాన్నే చెప్తాడు అబద్ధం చెప్పడు కానీ అతన్నడిగితే చెప్పే సమాధానం తనకు సహించలేనిదయితే ఆమె భరించలేదు. తనకు తెలియకుండా ఏం జరిగినా భరించగలదు. అందుకే అతన్నడగదు ఆమె. అయితే తనకి లేని బాధ ఈ లోకానికెందుకు? అనుకుంటుంది ఆమె. అంతా భర్తను చెడుగా చూస్తూన్నారే అన్న బాధతో అలా నిస్త్రాణంగా పడుకుని వుండిపోయింది దేవకి.

జ్యోతి వెళ్లిన చాలాసేపటికి పరమేశం తులసి కలసి ఇంటికి వచ్చారు. జ్యోతి మాటలు, పైగా వాళ్లిద్దరూ జంటగా ఇంటికి రావటం చూసిన దేవకికి పుండుమీద కారం జల్లినట్టయింది. జ్యోతి వెళ్ళేటప్పుడు తలుపు బారవేయటంలో, లేచి తలుపు తీయాల్సిన బాధ తప్పిందామెకి. వాళ్లు వచ్చింది తెలీనట్లు అటుతిరిగి పడుకునుండి పోయింది దేవకి.

"ఊఁ... చూశావుగా. ఆపెయింటింగ్స్ చూసి నువ్వేలా ఫీలయావు" అంటున్నాడు పరమేశం తులసితో.

"అద్భుతం. అవి చూస్తూ నన్ను నేను మర్చిపోయాను. చూస్తుంటే అలాంటి పెయింటర్ని నెనెప్పుడయినా అవగలనా అన్పించింది" అంది నవ్వుతూ తులసి.

"పట్టుదల వుండాలిగాని ఎందుకు కాలేవు?" అని "దేవకీ కాస్త కాఫీ పెట్టవేయ్" అన్నాడు పరమేశం.

"ఫ్లాస్క్‌లో ఓ కప్పు కాఫీ వుంది. చాల్తే తాగండి చాలకపోతే పెట్టుకోండి. నాకు వంట్లో బాగాలేదు. ఆ కాఫీ కూడా జ్యోతి కలిపింది" అంది దేవకి పక్కమీదనుండి లేచే ప్రయత్నం చేయకుండానే.

తులసికి వాతావరణం అర్థమయిపోయింది. ఆమెతో పరియమైన ఈ మూడు నాలుగేళ్లలో తనంటే ఆమెకి పడదని తెలిసిపోయింది తలసికి. అయినా పరమేశం దగ్గరకు రాకుండ వుండలేదు ఆమె. అతని ఆకర్షణ అలాంటిది.

"మీరు తాగండి సార్! నేనెలాగూ వెళ్లిపోతున్నాను" అని వారిస్తున్నా వినకుండా వెళ్ళిపోయింది తులసి.

పరమేశంకి కోపం వచ్చింది "ఆదేనా మాట్లాడేతీరు, మంచీ మర్యాదా లేకుండా?" అన్నాడతను.

"అవన్నీ మీదగ్గరనేర్చుకునే స్థితిలో లేను. నేను కాబట్టి సరిపోయింది. ఇంకో స్త్రీ అయినట్ల యితే మీ తిక్క చక్కగా కుదిర్చేది. మీకు నాకంటే ఆ పిల్లే ఎక్కువైంది. వెరుపూ, జడుపూ లేకుండా ఆ పిల్లని వేంటేసుకు తిరిగితే సరిపోదు, నలుగురూ ఏమనుకుంటా రన్న ఆలోచన, జ్ఞానం కొంచెమయినా వుండాలి"

"అసందర్భంగా మాట్లాడకు" అన్నాడు పరమేశం చికాకుగా.

"సందర్భం లేకేం... మీరూ, ఆ పిల్లా కలసి తిరుగుతూంటే అంతా రకరకాలుగా అను కుంటున్నారు తెల్సా? అందుకే అంటారు కుండను మూయ మూకుడుందిగానీ, లోకం నోరు మూయలేం అని" అందామె.

"అందులో తప్పేంవుంది? పనీ పాటాలేని వెధవ మొహాలకి వేరే వాళ్లసంగతులు పట్టించుకోవటమే తప్ప వాళ్ళ ఏడుపు వాళ్లు ఏడవలేరా?"

"అంటారు... వాళ్లకు తోచినట్లు వాళ్లంటా రు. వాళ్లని మనం ఆపలేం. అందుకే మన జాగ్రత్తలో మనం వుండాలి. అయినా ఎన్ని సంవత్సరాలు నేర్పుతారు ఆ అమ్మాయికి డ్రా యింగ్. దానికేమయినా అంతం వుందా అని"

"కళకు అంతంలేదు. ఎంత నేర్చుకుంటే, అనుభవంగడిస్తే అంతగా రాణిస్తారు. ఈ పని కిమాలిన చవటాయిల మాటలు నాకు లెక్కలే దు" అన్నాడు పరమేశం నిర్లక్ష్యంగా.

"అవును మీకు ఎవరి మాటలూ లెక్కుండవు. ఎవర్నీ లెక్క చేయాల్సిన పనిలే దు. మీకు మీరే భగవత్స్వరూపులు"

"సో వాట్?"

"రేపట్నుండి తులసి మనింటికి రావటానికి వీల్లేదు"

"నువ్వెవరివి అలా చెప్పటానికి?"

"నేను మీ పెళ్ళాన్ని అది మర్చిపోకండి. రేపాపిల్ల వచ్చిందంటే చీపురుకట్ట తిరగేస్తా ను"

"సరే ... తులసీరాదు, నేనూరాను" అంటూ విసురుగా లాల్చీ తగిలించుకుని, చెప్పులు తొడుక్కుని గుమ్మంవైపు వెళ్లిపోయాడు పర మేశం.

"అయ్యో ... ఆగండి. సంధ్య కొడుకు పుట్టిన రోజు చేస్తోంది. శ్రీనివాసూ, సంధ్యా ఇద్దరూ వచ్చి మరీమరీ రమ్మని పిల్చారు. వెళ్ళకపోతే బావుండదు" అంది దేవకి.

ఆ బాగోగులు అతనికి పట్టలేదు. అతను వెళ్లిపోయాడు. ఆ వెళ్లటం వెళ్లటం ఆర్రోజులు ఇంటి ముఖం చూడలేదు పరమేశం. ఏడో రోజు నుండి మళ్లా అంతా మామూలే. తులసి రావటమూ మానలేదు. ఆమె పరమేశంతో చనువుగా ప్రవర్తించటంలోనూ మార్పులేదు. దేవకి తిరిగి ఆ ప్రసక్తి తేలేదు.

★ ★ ★

"ఎంతసేపైంది వచ్చి" అంది మీనాక్షి భర్త ఇంట్లో వుండటంచూసి. ఆమె పుట్టింటి నుండి తిరిగి వచ్చింది.

రామచంద్రం ఏదో ఫైల్ తిరగేస్తూ "చాలా సేపైంది" అన్నాడు. ఆమె లోపలకువెళ్లి చీర మార్చుకుని ఇల్లు ఊడవటం మొదలెట్టింది. రెండు గదులు ముగించి హాలు ఊడ్చేందుకు వచ్చింది. కుర్చీలూ గట్రా జరిపి ఊడుస్తూ సోఫాకి పక్కగావున్న కాఫీ కప్పులుచూసి "ఎవ రొచ్చారండీ" అంది.

రామచంద్రం ఆవేళ బిజినెస్ పనులలో చాలా విసుగ్గా వున్నాడు. ఎంతకీ లెక్కసరిపోక సతమవుతున్నాడు.

"కాసేపు నన్ను మాట్లాడించకు" అన్నాడత ను.

"ఎందుకు ... ఇక్కడ కాఫీ తాగిన కప్పు లుంటే ఎవరు వచ్చారని అడిగాను... అదీ తప్పేనా?"

"అన్నీ ఆరాలు నీకు. నేను చెప్పేదాకా ఆగలేవు"

"చెప్తే తెలుస్తుందిగా"

"మీ సంధ్యా, శ్రీనివాసూ వచ్చి వెళ్లారు. వాళ్ల అబ్బాయి పుట్టినరోజని ఆహ్వానించటాని కి వచ్చారు ... ఎల్లుండి వెళ్లాలి" అన్నాడతను.

"మరింతసేపు చెప్పరేం?"

"చెప్పేదాకా నువ్వాగుతావా? వాళ్లు తప్ప ఇంక నావాళ్లు ఎవరూ రాలేదు ... చాలా?

ఇంకా ఏమైనా సందేహాలున్నాయా?'' అన్నాడు రామచంద్రం చిరుబురులాడుతూ.

"ఏం లేవుగానీ అక్కడ లేవండి, ఊడ్చాలి'' అంది మీనాక్షి. అతను టేబిల్ దగ్గరనుండి లేచాడు.

"రేపు నిజామాబాదు వెళ్తున్నా. రాత్రికి ఇంటికి రాను'' అన్నాడు.

" మరి ఎల్లుండి తప్పకరావాలి. సంధ్య కొడుకు పుట్టినరోజుకు మనం వెళ్లకపోతే అది



బాధవడుతుంది''

"చూద్దాం...''

"చూద్దాం అంటే కుదరదు. మర్చిపోకుండా రండి. పొద్దునకల్లా వచ్చేయండి''

రామచంద్రం పొద్దున్నే నిజామాబాదుకు పోగానే, ఇంట్లో తానొక్కర్తివుండటమెందుకని పుట్టింటికి వెళ్ళింది మీనాక్షి. మర్నాడు పొద్దున్నే ఆమె వచ్చేసరికి తలుపు సందులోంచి పోస్ట్‌మాన్ వడేసిన ఓ ఉత్తరం వుంది. అది భర్తకు వచ్చిన ఉత్తరం. ఫ్రం అడ్రసు చూస్తే రేవతి, మారేడువల్లి అని రాసుంది. ఆ పేరు



గల బంధువుగానీ, స్నేహితురాలుగానీ భర్తకు వున్నట్లు ఆమె వినివుండలేదు. ఓ క్షణం ఆ ఉత్తరాన్ని అక్కనుగా చూసింది. చింపి ముక్క లు చేద్దామనుకుంది. తీసి చదవాల న్పించింది. భర్త ఉత్తరం కాబట్టి చదివే హక్కు తనకుందని భావించింది. హాండ్‌బాగు అల్మా ర్లో పడేసి తలుపు గడియపెట్టి సోఫాలో కూలబ డి, ఉత్తరం చింపి చదవసాగింది.

"హలో చంద్రా డియర్ ...

ఆ సంబోధనచూసి పళ్లు నూరుకుంది మీ నాక్షి.

మారేడుపల్లి అనేదొకటుందనీ, అక్కడ తమరి రాకకై క్షణాలు యుగాలుగా గడిపే, నిరంతరం నిరీక్షించే రేవతి అనే ఓ అమాయ కప్పక్షి ఉందనీ కూడా గుర్తు లేదుకదూ?! నిన్ను చూసి నెలరోజులయింది. నీకు ఎంత అర్జెంట్ వర్క్‌వున్నా ఒక్కసారి వచ్చెళ్లు. లేకుంటే కనీసం ఫోన్‌చెయ్యి ... నీ, రేవతి"

తెల్లటి బాండ్ పేపరుమీద ఈ నాలుగు ముక్కలే వున్నాయి. ఆ ఉత్తరం చదివిన మీనాక్షి అరికాలిమంట నెత్తికెక్కింది. అంత చనువుగా రాసిన ఆ అమ్మాయెవరో, వారిద్దరికీ మధ్యగల అనుబంధం ఎటువంటిదో, దీనికి తన భర్త సంజాయిషీ ఎలా వుంటుందో ఆమె కర్థంకాలేదు. ఎప్పుడు భర్త వస్తాడా, తన కోపాన్నంతా ఎలా వెళ్లగక్కాలా అని ఆలోచిస్తూ కూర్చుంది ఆమె. ఆమెకి చాలా ఉడుకుమోత్త నంగా అన్పించింది. తను భర్తకు ఏం తక్కువ చేస్తోందని ఇట్లా అడ్డమైన ఆడపిల్లల్తో పరిచ యంపెంచుకుంటున్నాడు? అతడికి సకల సౌకర్యాలు కలగజేసి, పువ్వుల్లో పెట్టి పూజించటం చేసినా తనకంటే పరాయివాళ్ల మీదే మోజుగా వుందా? - అనుకుని ఏడుస్తూ పడుకుంది మీనాక్షి.

అయితే ఆమె అలా ఎక్కువసేపు పడుకోలే కపోయింది. రామచంద్రం ఏక్షణంలోనయినా రావచ్చు. ఆకలిమీద వుంటాడేమో. వంటచే యాలి. నిస్త్రాణగా లేచి ఇంటిపనీ, వంటపనీలో పడిపోయింది మీనాక్షి.

రామచంద్రం ఊరినుండి వచ్చేటప్పటికి మధ్యాహ్నమయింది.స్నానం, భోజనాలయిన తరువాత తీరిగ్గా నడుం వాలుస్తూ, "మీనా ... ఈ రోజు పేపర్ రాలేదా?" అన్నాడు పెద్దగా వంటింట్లోవున్న మీనాక్షికి వినవడేటట్లు.

"ఎదురింటివాళ్లు తీసుకున్నారు" అందామె వంటింట్లోనుండి వస్తూ.

"ఎదురింటివాళ్లు, పక్కింటివాళ్లు, పైవాళ్లు, కిందవాళ్లు ... ఎప్పుడూ ఎవరో ఒకళ్ల దగ్గర వుండటం తప్ప మన పేపర్ మనింట్లో మాత్రం వుండదు. నీకు మరీ దోస్తులెక్కువయి పోయారు. తీసుకెళ్లినవాళ్లు తిరిగి ఇవ్వవ ద్దూ?" అన్నాడు రామచంద్రం.

"నాకా దోస్తులెక్కువైంది? ఇరుగూ పొరుగూ తప్ప మీలాగా పేటకో ఫ్రెండుల్లేరు నాకు" అందామె.

"ఏం మాట్లాడుతున్నావు మీనా? వాళ్లందరి కీ పేపర్లిస్తున్నానా?"

"పేపరేం ఖర్మ, మనసే ఇస్తున్నారు"

"ఏమైంది మీనా? మనసివ్వటమేంటి?"

"మారేడ్‌పల్లి వెళ్లరా?"

"ఎందుకు?"

"ఏం అమాయకత్వం!"

"విషయం చెప్పు, విసుగు తెప్పించకు"

"మీ రేవతి కోసం"

"ఎవరా రేవతి"

"ఇంకా నటించకండి"

"నా సహనాన్ని పరీక్షించకు. ఎవరా రే వతి?"

"అదే నేనూ అడిగేది? మీకంటే నాకు తెలుస్తుందా? లెటర్ రాసింది, చదువుకోండి" అంటూ ఉత్తరం తెచ్చి అతని పక్కన పడే సింది.

రామచంద్రం అయోమయంగా చూసి, ఉత్తరం చదివి, కొంతసేపు ఆశ్చర్యపోయి, తలగోక్కుని, మరికొంతసేపు ఆలోచించి, చివ రకు కవరుమీద అడ్రసు చూశాడు. అతనికి పట్టరాని కోపం, చికాకు కలిగాయి.

"ఖర్మ! ఇది నా లెటర్ కాదు, ఆ మూలగ దిలో వుండే బాచిలర్ది" అన్నాడు రామ చంద్రం భార్యను కసురుకుంటూ. ఆ బ్రహ్మా చారి పేరు జి.రామచంద్రరావు, ఇతని పేరు సి.రామచంద్రం. పేర్లు రెండూ ఒకేలా వుండ

టాన పోస్ట్‌మాన్ పొరపాటున అతని ఉత్తరం వీరింట్లో వడేశాడు. మీనా కూడా అంత పరిశీల నగా చూడలేదు అడ్రస్. తమ ఇంట్లో పడిన ఉత్తరం తమదేననుకున్నది.

"అయ్యో, అలాగా! మీ మీద భలే కోపమొచ్చిందండీ! హమ్మయ్య నాకిప్పుడు రిలీఫ్‌గా వుంది" అంది మీనాక్షి తృప్తిగా.

"నాపై ఓ నేరం ఆరోపించబడినదనుకో. నేను ఆ నేరం చేయలేదని నీతో అన్నప్పుడు నువ్వు నమ్మగలగాలి. మనిషిమీద ఆ నమ్మకం వుండాలి. కనీసం భార్యాభర్తలు, స్నేహితుల మధ్యనయినా ఆ నమ్మకం వుండాలి. న్యాయస్థానంలో సాక్ష్యాధారాలతో నిందితుడు కాదని నిరూపింపబడినప్పుడు కాదు నమ్మాల్సింది. అప్పటిదాకా వేచిచూడాలనుకోవటం ఆత్మీయుణ్ణి దగాచేయటం, మనిషిని అనుమానించటం అవుతుంది"

"ఈ చిన్నదానికి ఇంత ఫిలాసఫీ చెప్పాల్సిన అవసరమేం లేదు"

"ఇది చిన్నదా. నా వ్యక్తిత్వంపట్ల, శీలంపట్ల నాకు నమ్మకం లేదని చెప్పక చెప్పావు"

"ఐయాంసారీ అండీ! నా భయం కూడా అర్థం చేసుకోండి"

"మొత్తానికి నీ అనుమానంతో వస్తున్నాయి తిప్పలు. అయినా ఇంత చదువు చదువుకున్నావు. ఇంకోళ్ల ఉత్తరాలు చదువకూడదని తెలీదూ?"

"ఆదర్శాలు చెప్పటం తేలికే. అయినా నా భర్త ఉత్తరం నేనెందుకు చదవకూడదు. నాకే పరాయిమొగవాడు ఉత్తరం రాస్తే మీరు చింపి చదవరా?"

"ఛఛ... ప్రాణం పోయినా చదవను" అంటూ వినుగ్గా నడుంవాల్చాడు రామచంద్రం.

"పోన్లెండి. నాకే ఆదర్శాలు లేవు. వట్టి ఆడదాన్ని. భర్త ఏమవుతాడే అని భయపడే పెళ్లాన్ని. సాయంత్రం వేరే ప్రోగ్రాములు పెట్టుకోకండి. సంధ్య కొడుకు పుట్టినరోజు ఇవాళే. నేను తను వచ్చినప్పుడు కనపడలేదని మా అమ్మవాళ్ల ఇంటికి కూడా వచ్చి చెప్పింది"

"నేను రాను, నువ్వెళ్లు"

"మీరు రాకుండా నేనెక్కడికీ వెళ్లను"

"నీకు మొగుడుకాదు కావల్సింది. మెడకో డోలు"

"పోన్లెండి. మంచిదో, చెడ్డదో ఓ డోలు సంపాదించుకున్నాగా ఈ జీవితానికి. వాయిద్య విశేషంలేకండా ఉత్సవాలకేం వెళ్తాం? నేనలా అనుమానించానని కోపం వచ్చిందికదూ! పాపిష్టిదాన్ని. మీ మనసు కష్టపెట్టాను. నన్ను క్షమించండి" అంది మీనాక్షి నొచ్చుకుంటూ.

ఈ క్షమావణలు భరించటం మరీ కష్టమనుకొని రామచంద్రం మారుమాట్లాడకుండా "సరే, సరే వస్తానుగాని, ప్రస్తుతానికి నన్ను కాస్తంత నిద్రపోనీ" అని వక్కకు తిరిగాడు.

★ ★ ★

కొడుకు శిరీష్‌చంద్ర మూడో పట్టినరోజు చాలా సింపుల్‌గా జరుపుకుంది సంధ్య. ఎక్కువమంది ఆహ్వానితుల్లేరు. వాళ్ల కుటుంబం, తన పుట్టింటివాళ్లూ, శ్రీనివాస్ మేనమామ రంగనాథం, ఆయన భార్య, కూతురు సునంద, ఆమె భర్త, మీనాక్షి, దేవకి, కృష్ణ కుటుంబాలు.

మీనాక్షి, రామచంద్రంలు వెళ్లేటప్పటికే అంతా వచ్చివున్నారు. సంధ్య వచ్చి రెండు చేతులు పట్టుకుని ఆహ్వానించింది మీనాక్షిని.

"ఇప్పటికైనా తీరిందామ్మా నీకు? పొద్దున్నే రమ్మంటే ఇప్పుడొచ్చారు" అంది సంధ్య.

"నేనేం చేయను. ఊరెళ్లిన మనిషి మధ్యాహ్నానికిగాని ఊడిపడలేదు. వచ్చినప్పటి నుండి ఆపసోపాలు. తీరా బయలుదేరేటప్పటికి ఈవేళయింది"

"నేరం నామీద వేయకపోతే, పొద్దున్నే తమరు రావచ్చుగా, సాయంత్రానికి నేనూ వచ్చేవాడిని" అన్నాడు రామచంద్రం.

"నేనెలాగూ వస్తాను. నేను రాకుండా అది కొడుకు పుట్టినరోజెలా చేసుకుంటుంది. మిమ్మల్ని తీసుకురావాలనే ఆగాను" అంది మీనాక్షి.

"ఆడవాళ్లు ఓడిపోవటానికి అంత సులువుగా ఒప్పుకోరు బ్రదర్. వాళ్లు పొరపాట్లు చేయరు. లోపాలుండవు. పారగన్స్ ఆఫ్ వర్ట్యూ" అన్నాడు శ్రీనివాసు నవ్వుతూ రామచంద్రంతో.

"పాపం అక్కడికి మేమేదో మిమ్మల్ని కష్టపెడుతున్నట్టు" అంది సంధ్య.

"అమ్మాయి... బావగార్లు అలానే అంటూంటారు. అనుకోనీ. కనీసం మాటలు స్వాతంత్ర్యమయినా ఇవ్వకపోతే ఎలా?" అన్నాడుకృష్ణ.

"అన్నయ్యా... బావగార్ల పక్షంలో చేర్తున్నావు. ఇదేం బాగాలేదు" అంది మీనాక్షి.

"వీడు కడుపులోవున్నప్పుడు బిజినెస్‌లో అన్నయ్యచేసిన సాయం జన్మలో మర్చిపోలేను. ఆయనే సాయం చెయ్యకపోతే నేను బిజినెస్ మానుకోవాల్సివచ్చేది" అంది సంధ్య.

"నేను చేసిన సాయం ఏ వుందిలే అమ్మా... నా పనితోపాటు నీ పనీ చూసిపెట్టాను. దానికెలాగో కమీషను ముట్టచెప్పావు" అన్నాడు కృష్ణ.

"అన్నా చెల్లెళ్లు ఒకే ఇదిగా ఒకళ్లనొకళ్లు పొగుడుకుంటున్నారు. ఆలికి అన్నంపెట్టడం ఊరికి ఉపకారంచేయటమా ఏంటి. మా అన్నలు అమాయకులు కాబట్టి మీ అన్నా చెల్లెళ్ల ఆటలుసాగుతున్నాయి" అంది కృష్ణ భార్య లక్ష్మి.

"పాపం అక్కడికీ నీ అన్నలూ నువ్వూ ఏం కష్టపడిపోతున్నారమ్మా" అంది మీనాక్షి.

సంధ్య తండ్రి సంగమేశ్వరరావు, శ్రీనివాసు మేనమామ రంగనాథం రాజకీయాలు మాట్లాడుకుంటున్నారు. సంధ్యతల్లి వసుంధర, అత్తగారు సుమిత్రమ్మ, రంగనాథంగారి భార్య కబుర్లు చెప్పుకుంటున్నారు. సునంద, ఆమె భర్త అక్కడకు వచ్చినా ఎవరితో ఏం కలవకుండా వాళ్లల్లో వాళ్లే మాట్లాడుకుంటున్నారు. సంధ్య చెల్లెలు వింధ్యా తమ్ముడు ఆదిత్యా శ్రీనివాసు చెల్లెలు జానకీ అన్ని ఏర్పాట్లు చేస్తున్నారు.

"అక్కా... ఎంతసేపైందే వచ్చి?" అనడిగింది మీనాక్షి దేవకిని.

"ఇంతకుముందేనే"

"బావగారు రాలేదేం?"

"ఆయనకు కుదర్లేదు. అర్జెంటుపనుందని వెళ్లారు"

"అవున్లే... ఆయనకు వందపనులు, తీరికెలావుంటుంది?" అంది మీనాక్షి.

దేవకి మొహం చిన్నబుచ్చుకుంది.

"అవును. మా అన్నయ్య ఆర్టిస్ట్. అందరిలా ఆయన్ని అంచనా వేయకు" అన్నాడు రామచంద్రం వాతావరణం సరసంగా మారుస్తూ-

"రావమ్మా మీనాక్షమ్మా... మా కోడలు నువ్వు రాలేదని తపన పడ్తున్నది" అంది లోపల నుండి వచ్చిన సుమిత్రమ్మ.

"అవును మేం ఇందరం వున్నా మీరూ, మీ అక్కా రాలేదని ఒకటే ఇదవుతున్నది వదిన" అంది జానకి.

"పదండి లోపలికెళ్లాం బాబును చూద్దురుగాని" అంది సంధ్య.

"బర్తడే కేక్ తెప్పించలేదా సంధ్యా" అడిగింది సునంద.

"ఆవిడ స్వదేశీ పద్ధతిలో పుట్టినరోజు వేడుక జరపాలనుకుంది" అన్నాడు శ్రీనివాసు సమాధానమిస్తూ.

"అలా అంటే మనకుపుట్టినరోజు జరుపుకునే సంప్రదాయమేలేదు" అంది సునంద.

"లేకేం శ్రీరామనవమి, కృష్ణాష్టమి పుట్టిన రోజువేడుకలు కావూ?" అన్నాడు ఆమె భర్త.

సంధ్యా వాళ్లు ఇప్పుడు పెద్ద ఇల్లు అద్దెకు తీసుకున్నారు. జానకికి తమ స్వగ్రామంలో స్వంత ఇంట్లోవున్నట్టుగావుంది. మ్యూజిక్ కాలేజికి వెళ్లటం సంగీత సాధనలో ఆమెకి తీరిక లేకుండావున్నది.

బాబు శిరీషచంద్ర తల్లిపోలిక. గుండ్రటి మొహంతో ముద్దొచ్చేటట్లు వున్నాడు. పిల్లవాడికి హారతులివ్వటం వగైరా పుట్టినరోజు కార్యక్రమాలయి, భోజనాలయి అతిథులంతా వెళ్లేటప్పటికి రాత్రి పది గంటలయింది.

కొడుకూ, కోడలూ పడుకోటానికి వెళ్లబోతుంటే "జానకికి పెళ్లి చేస్తేబావుండురా" అంది సుమిత్రమ్మ కొడుకుతో.

"డక్కన్‌ప్లాస్టిక్స్‌లో పనిచేస్తున్నాడో అబ్బాయి అత్తయ్యా... మనవాళ్లే. ఆ మధ్య బిజినెస్ పనిమీద, వాళ్లకంపెనీకి వెళ్తే అతన్తో పరిచయమయింది. రేపు నేనూ, ఆయనా వెళ్లి, అతని తల్లిదండ్రులను కల్సిమాట్లాడతాము. నేను అనుకోవటం మనకా సంబంధం అన్ని

విధాలా తగిందని''

''పిల్లవాడెలావుంటాడే అమ్మాయి''

''బాగానే వుంటాడు. చామనఛాయ ఒడ్డూ పొడుగూ. జీతం రెండు వేలదాకా వస్తుంది. ఎంకాం పాసయాడు. పేరు రమేష్''

''మరి కట్నం అదీ బాగానే అడుగుతారేమో'' అన్నాడు నసుగుతూ శ్రీనివాసు.

''బాగుందండీ మీరు చెప్పేది. కట్నంలేకుండా పెళ్లిలా అవుతుంది ఈరోజుల్లో. అందరూ మీలాగా వుంటారా? మీ జీతంలో లోను తీసుకోండి. నెలకింతని జానకి పెళ్లికి మీ జీతంలో దాస్తూనే వున్నారుగా. అదోపాతివేలు వుండదూ? అవసరమయితే బయట అప్పుచేయండి. మెల్లగా అప్పు తీర్చుకోవచ్చు'' అంది సంధ్య.

''ఇంకో రెండేళ్లాగితే మనం ఇంత ఇబ్బంది పడకుండా అయిపోతుంది కదా...'' అన్నాడు శ్రీనివాసు.

''మా బాగా చెప్పారులేండి. అప్పటికి మీ చెల్లెలు ముసలిదైపోవటం ఖాయం. వయసులోవున్న సేవళీకం, ఇంకా ఏళ్లుముదిరితే వుంటుందా అత్తయ్యా?''

'బాగా చెప్పావమ్మాయ్.. వాడు మగాడు. మనమెందుకు బాధపడ్తున్నామో వాడికర్థంకాదు'' అంది సుమిత్రమ్మ.

''నేనిప్పుడు పెళ్లిచేసుకోను. మ్యూజిక్ డిగ్రీ అయిపోయింతర్వాతే చేసుకుంటాను'' అంది జానకి వాళ్ల మాటలు విని.

''నిన్ను కాలేజీ మానిపిస్తామని ఎవరు అన్నారు? అతడిదీ ఉద్యోగం ఊళ్లోనేనాయె. పెళ్లి చేసుకున్నా చదువుకోవచ్చు'' అంది సంధ్య.

''దానికేం తెల్సులే సంధ్యా... చిన్నపిల్ల. మీరు మాత్రం త్వరగా ఆ ప్రయత్నాలు చేయండి. నా బాధ్యత వదిలిపోతుంది'' అంది సుమిత్రమ్మ.

''పెళ్లయితేమాత్రం, మీ పిల్లలపట్ల మీకు బాధ్యత ఎలా వదిలిపోతుంది అత్తయ్యా? వాళ్ల బాగోగులు చూడటానికి పెద్ద దిక్కుగా మీరుండవద్దూ?'' అంది సంధ్య.

బెడ్‌రూంలోకి వెళ్ళింతర్వాత శ్రీనివాస్ అన్నాడు.

''మా అమ్మకీ, చెల్లికీ ఏమందుపెట్టావోగానీ, వాళ్ళకు నువ్వంటే ఆరాధన పెరిగిపోయింది''

''అవును నీకు పెట్టిందే వాళ్లకూ పెట్టాను'' అంది సంధ్య.

''చాలా రుచిగావుందోయ్! ఇంకాస్త పెట్టు''

''దూరం... దూరం.. చూస్తే కొరుక్కుతినేట్టున్నావు నన్ను''

''నువ్వుమాత్రం అలా అక్షయంలాగా వుండిపోతావు''

''మనుషుల సంబంధాలన్నీ ఆర్థికపరిస్థితులమీద ఆధారపడివుంటాయి. అవి బాగాలేకుంటే మిగతావాటి ఆలోచనలు వస్తాయి; అవి బాగావుంటే, అన్నీ బాగానే ఉంటాయి''

''బాగుంది, నీ గీతోపదేశం''

''నిజం, భార్యాభర్తల సంబంధాలు కూడా అంతే''

''ఛస్, నోర్ముయ్యి'' అని ఆమె నోటిని తన నోటితో మూసేశాడు శ్రీనివాసు.

★ ★ ★

ఇరవై అయిదు సంవత్సరాల తర్వాత - 2016లో-

''నీకు బుద్దేమయినా వుందా? ఇంట్లో చెప్పి వెళ్లాలనే జ్ఞానమేమయినా వుందా? దాంతో బెంగుళూరు పోయి, అక్కడనుంచి ఉత్తరం రాస్తావా? మీ నాన్న వరస అదీ, నీ వరుస ఇదీ. ఎలా బాగుపడతార్రా మీరు?'' అని అరుస్తోంది మీనాక్షి కొడుకు కాశ్యప్‌పైన.

దేవకి కూతురు దీప బెంగుళూరులో డాన్స్ ప్రోగ్రాం ఇస్తూవుంటే కాశ్యప్ కూడా ఆమెతో కలిసి వెళ్లాడు. తల్లికి చెప్తే వెళ్లవద్దంటుందని తల్లి ఇంట్లో లేనిసమయంలో కావాల్సిన బట్టలు సూట్‌కేసులో సర్దుకుని ఉడాయించేశాడు. తండ్రి ఆఫీసుకువెళ్లి తానూ, దీపా బెంగుళూరు వెళ్తున్నామని, అమ్మకు చెప్పవద్దనీ తండ్రి ఇచ్చిన ఐదువేల రూపాయలు జేబులో వేసుకుని వెళ్లిపోయాడు కాశ్యప్. కొడుకు ఉత్తరం వచ్చిందాకా 'వాడేమయిపోయాడో'నని దిగాలు పడిపోయింది మీనాక్షి. వారంరోజుల తర్వాత వచ్చిన కొడుకును పట్టుకుని దులిపేస్తోంది ఆమె.

"ఇక్కడ హైదరాబాదులో ఉక్కిరిబిక్కిరిగా వున్నట్లుంటే కాస్తంత గాలి పీల్చుకుందామని బెంగుళూరు వెళ్లాను. దీనికే ఇంత రాద్ధాంతం చేస్తావేమిటమ్మా, ఏదో కొంప ముంచుకుపోయినట్లు..." అన్నాడు కాశ్యప్.

"హైదరాబాదులో ఉక్కిరిబిక్కిరవుతోందా? మన ఇంట్లోనా? వెధవబుద్ధులెక్కడికి పోతాయి? ఆ తండ్రిబుద్ధులే వచ్చాయి. ఆమాటలే వచ్చాయి. నేను మీ ఇద్దరి ప్రాణాలు తీస్తున్నానట్రా? ఇద్దరికీ కావాల్సినవన్నీ అమర్చి, వీసమంత కష్టంకూడా మీకు లేకుండా నేను పాటుబడుతొంటే మీకు చేదయింది" అంది మీనాక్షి వాక్యూం క్లీనర్ పక్కన వడేసి, సోఫాలో కూర్చుంటూ.

తల్లి సోఫాలో కూర్చోగానే కాశ్యప్‌కి అర్థమయింది - ఆమె క్రాస్ ఎగ్జామినేషన్ ప్రారంభిస్తుందని. వీలయినంత త్వరలో బయటవడటం మంచిదనే అభిప్రాయంలోకి వచ్చాడతను.

"నువ్వెంత కష్టపడటమెందుకమ్మా? మా పనులు మేం చేసుకోలేమూ! మమ్మల్నేదీ ముట్టుకోనీవాయె. ఆపైన అవసోపాలు పడ్తూ మేమేదో నిన్ను కష్టపెడుతున్నట్లు బాధపడిపోతావు" అన్నాడు కాశ్యప్.

"సరే అట్టా కూర్చో, నీతో మాట్లాడాలి" అంది మీనాక్షి.

"కాలేజీకి వెళ్లాలి, టయిమవుతోంది" అన్నాడు కాశ్యప్.

"అంత కొంప మునిగేదేం లేదులే. వారంరోజులనుండి కాలేజీ ఎగ్గొట్టిన నీకు ఒక్కరోజు మానేస్తే ప్రమాదమేంలేదు"

"ఇహ క్రాస్ఎగ్జామినేషన్ మొదలెడతావుకాబోలు"

"నోర్మూసుకో, దీప డాన్స్‌ప్రోగ్రాం ఎన్నాళ్లురా బెంగుళూరులో'

"రెండురోజులు'

"రెండురోజులయితే, వారంరోజులదాకా తిరిగి రాలేదెందుకూ?"

"అంతదూరం వెళ్లినవాళ్లం ఏంచూడకుండా తిరిగెలావస్తాం? మైసూరు, బేలూరు, హళేబీడుకూడా వెళ్ళాం"

"బెంగుళూరులో ఎక్కడున్నారు?"

"ఎక్కడుంటాం, హొటల్లో...!"

"విడివిడి గదులు తీసుకున్నారా, ఒకేగదిలో వున్నారా?"

"ఏంమాటలమ్మా నీవి? ఈ ఇరవైఒకటో శతాబ్దంలో కూడా నీ పాతచింతకాయ పచ్చడి భావాలు"

"ఇరవై ఒకటో శతాబ్దం అయితేమాత్రం ఆడది ఆడది కాకుండా పోతుందా, మగవాడు మగవాడు కాకుండాపోతాడా? అయినా పెత్తల్లి కూతురు, అక్కలాంటిది, దాంతో ఏంతిరుగుళ్లురా నీకు?"

"దాంతో ఏంతిరిగాను నేను? విఆర్ లైక్ ఫ్రెండ్స్"

"ఫ్రెండ్సంటే అర్థమవుతున్నది, నువ్వు చెప్పనక్కరలేదు"

"ఏంఅర్థమవుతోంది?"

"ఇన్‌సల్ట్... థూ థూ"

"ఏమిటి మీనా? పొద్దున్నే వాణ్ని పట్టుకుని దులిపేస్తున్నావు? ఎంతసేపైందిరా వచ్చి?" అన్నాడు తలరుద్దుకుంటూ బాత్‌రూంలో నుండి వస్తున్న రామచంద్రం.

"ఇప్పుడే నాన్నా! వచ్చినప్పటినుండి అమ్మ నన్ను ఉతికేస్తున్నది"

"అది మీ అమ్మకు చిన్నప్పటినుండి వున్న అలవాటేరా. బెంగుళూరు ట్రిప్పు హాయిగా జరిగిందా? కేరళ కూడా వెళ్తామన్నారు, వెళ్లారా లేదా?"అడిగాడు రామచంద్రం.

"అంటే వాడు వెళ్లేటప్పుడు మీకు చెప్పేవెళ్లాడన్నమాట" అంది మీనాక్షి భర్తవంక అనుమానంగా చూస్తూ.

"నాకేం చెప్పలేదు. బెంగుళూరునుండి వాడు ఉత్తరం రాశాడుగా, అప్పుడే నాకూ తెల్సింది"

"వాడు రాసిన ఉత్తరంలో కేరళ వెళ్తున్నట్టు రాయలేదు. అంటే అర్థం వాడు వెళ్తున్న

ట్టు మీకు ముందే చెప్పివుండాలి'' అంది మీనాక్షి నిటారుగా సోఫాలో కూర్చుంటూ.

రామచంద్రం ఇలాంటి చిన్న చిన్న పొరపాటులు చేసి దొరికిపోతూవుంటాడు. ఇహ ఆరోజు మీనాక్షి నోటికి హద్దూ వద్దూ వుండదు. ఇంట్లో శాంతి లేకుండా చేస్తుంది. తండ్రీ కొడుకూ తన చేతి నుండీ జారిపోయి, చెడిపోతున్నారని వాపోతుంది. ప్రస్తుతం కొడుకునైనా కాపాడదామని ప్రయత్నించాడు రామ చంద్రం.

''నాకేం చెప్పలేదు వాడు. పక్కనే కదా కేరళ కూడా వెళ్తారేమోననుకున్నాను'' అన్నాడు రామచంద్రం.

''ఏరా కేరళ ఎందుకు వెళ్లలేదు?'' అడిగింది మీనాక్షి కొడుకు వంక చూస్తూ.

''డబ్బు చాల్లేదు''

''ఎంత పట్టుకెళ్లావ్?''

''ఐదువేలు''

''అంత డబ్బు నీ దగ్గరెక్కడిది?''

''నాన్నిచ్చాడు''

''అంటే నువ్వు బెంగుళూరు వెళ్లబోయే ముందు మీ నాన్నని కలుసుకుని డబ్బడిగి తీసివెళ్లావన్నమాట''

''కాదు అంతకు ముందే నాన్న అప్పుడప్పుడూ ఇచ్చిన డబ్బు దాచుకున్నాను''

''మీరిద్దరూ కల్సి నన్నింత మోసం చేస్తారా?'' అని గుండెలు బాదుకుంటూ సోఫాకి చేరగిలపడిపోయింది మీనాక్షి.

''ఒరే కాశ్యప్.. నీకు కాలేజీ టైమవటంలా? పదపద'' అన్నాడు రామచంద్రం.

కాశ్యప్ దొంగలాగా జారుకున్నాడు. వీలయినంత త్వరలో ఇంట్లో నుండి బయటపడాలనే ఉద్దేశంతో బాత్‌రూంలో దూరాడు.

''మీరు పిల్లవాడిని బాగుపడనివ్వరా?'' అందామె కొంతసేపటికి తేరుకుని.

''ఇంతలో ఏమైంది? సరదాగా ఊళ్లు తిరిగొచ్చాడు''

''సరదాగా కాదు సరసాలకెళ్లొచ్చాడు''

''ఛఛ తప్పుడు మాటలు మాట్లాడక''

''పెళ్లీడు కొచ్చిన పిల్లతో ఏం తిరుగుళ్లండీ అవి? అంటే నేను నోరు పారేసుకున్నట్టుంటుంది గాని''

''నువ్వనుకునే సంబంధంమేం లేదులే వాళ్ల మధ్య. అయినా అక్కాతమ్ముళ్లని కూడా అనుమానించే స్థితికి దిగజారావు. ఇదేం బాగా లేదు'' అన్నాడు రామచంద్రం.

''ఈ కాలపు పిల్లలకు ఆ మాత్రం జ్ఞానం వుందని నేననుకోను''

''ఏం? ఆ పిల్లను పెళ్లి చేసుకుంటానన్నాడా వాడు?''

''అంటాడా? అంటే నోటిమీద వాత పెట్టనూ?''

''మరింకేం అన్నీ నీ ఊహాలే. నీ ఆలోచనల మురికి వాళ్ల బుర్రల కెక్కించకు''

''నావి మురికి ఆలోచనలు కావు. మీ బుర్రలే చెడిపోయాయి. పిల్లవాణ్ని దారిలోకి తేవటంపోయి, వాడికి ఇంకా ఎక్కిస్తున్నారు మీరు''

''నువ్వనలు మనిషికి స్వేచ్ఛనివ్వకుండా గుప్పిట్లోపెట్టుకు పెంచాలంటే మాత్రం వాడు చెడిపోయేది ఖాయం. వాడింకా ఇంత మాత్రమైనా అలా బుద్ధిగా వున్నాడంటే నేనిచ్చే స్వేచ్ఛే కారణం''

''అసలు మీరే వాణ్ణి చెడగొడుతున్నది. మీకు అరవచాకిరీ చేసి ఏం బావుకుంటున్నాను నేను? నాకేం కావాలి ఈ జీవితంలో? నా కంటే మీ ఇద్దరి బాగూ కోరేవాళ్లెవరు వుంటారీ ప్రపంచంలో? చివరికి ఏమయింది? నేను మీకు స్వేచ్ఛనివ్వటం లేదా? మీ ఇద్దర్నీ ఇష్టమొచ్చినట్టు ఆడనివ్వాలా? ఓరి భగవంతుడా... ఏం రాసి పెట్టావురా నాకీ జీవితంలో'' అని సోఫాలో వెనక్కివాలి ఆవేదన వెళ్ల గక్కుతోంది మీనాక్షి.

రామచంద్రం ఏం మాట్లాడలేదు. ఆమెను మార్చాలని అతనుచేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమయాయి. ఒక్కోసారి భార్య తన్ను దయ్యంలా పట్టిందని అనుకునేవాడు. అయినా ఆమెనిస్వార్థసేవకు విపరీతమయిన ప్రేమకు కట్టుబడివుండిపోయాడు. కొన్ని జీవితాలింతే. సంసారంలో సుఖంలేకపోయినా విడి

పోరు. అలాగే దుర్భరజీవితాలు గడుపుతూ వుంటారు.

"వాడికి గుండెలో వాల్వ్ సరిగా లేవని ఆపరేషను చేస్తే మూడు నెలలు మద్రాసు అపోలో ఆస్పత్రిలో కంటికి రెప్పలాగా చూసుకున్నదెవరు? మీరు రాలేదు. మీకు బిజినెస్ దెబ్బతింటుంది. అప్పుడప్పుడు వచ్చి చూసి పోవటమేగానీ, పిల్లవాడిని కనిపెట్టుకు వుండాలని మీరనుకున్నారా? వాడు ఆస్పత్రినుండి డిశ్చార్జయి. ఇంటికి వచ్చినా మళ్లీ ఏం ప్రమాదం ముంచుకొస్తుందోనని రెండేళ్లు అహర్నిశలూ, కంటికి కునుకు లేకుండా తిండితినకుండా నా ప్రాణంలాగా చూసుకున్నానే వాడిని. ఇవాళ వాడూ మీరూ అంటారా నన్ను స్వేచ్ఛ ఇవ్వటంలేదని? చెడగొడుతున్నానని? ఆపై వాడెవడైనా వుంటే వాడైనా నా మాటల్లో సత్యం గుర్తిస్తాడు" అని మీనాక్షి తన ఆవేదన వెళ్లగక్కుతోంది.

ఆమె అనేవన్నీ సత్యాలే. కొడుకుని ఎత్తెత్తుగా నడిస్తే అరిగిపోతాడేమో నన్నంత ఇదిగా పెంచింది. వ్యక్తిత్వపు పాము తల ఎత్తినప్పుడల్లా నెత్తిన మొట్టి తన దారికి తెచ్చుకోవాలని యత్నించింది. అంత ఒద్దికలో పెరిగిన పిల్లాడు అసలు చెడిపోవాలి, చదువూ రాకూడదు. కానీ తల్లి రోజూ రాత్రిళ్లు దగ్గర కూర్చోబెట్టుకుని చదివించింది. వాడి పాఠాలు తనుచదివింది. ఫస్టు మార్కులు రాకపోతే తిట్టింది. ఏరోనాటిక్స్ ఇంజనీరింగ్ చదువుతున్నా వ్యక్తిత్వం ఇంకా పూర్తిగా ఎదగలేదు కాశ్యప్‌లో. ఈమధ్య తండ్రి ప్రోత్సాహంతో తల్లి నుండి బయటపడాలని ప్రయత్నం చేస్తున్నాడు.

రామచంద్రం, కాశ్యప్‌లు బయటకెళ్లటానికి తయారయారు.

"కాల్లో డ్రాప్‌చేస్తానుండు" అన్నాడు రామచంద్రం కొడుకుతో.

"వుండండి, టిఫిను తిని వెళ్లరూ?" అని లేచింది మీనాక్షి.

తన కర్తవ్యాన్నెప్పుడూ మర్చిపోదు మీనాక్షి. వంట రుచ్యంగా, వేగంగా చేయటం ఆమె ప్రత్యేకత. ఇప్పటివరకూ ఆవేదనలోపడి కూర్చుండిపోయినా వెంటనే లేచి పదినిమిషాల్లో లేచి వేడి ఇడ్లీమీద నెయ్యి వేసి, రెండుమూడు చట్నీలతో ప్లేటు పట్టుకొచ్చి డైనింగ్‌టేబిల్ మీద పెట్టింది, కొడుక్కూ, భర్తకూ. ఆమె వంటగదిలో వుండగానే చెప్పాడు రామచంద్రం కొడుక్కు "మీ అమ్మకు సారీ చెప్పు. నువ్వు మంచిదనుకున్నది చెయ్యి. అలా అని మీ అమ్మ మనం తననుండి పూర్తిగా స్వతంత్రమవుతున్నామని అనుకోగూడదు. నువ్వు చిన్న పిల్లాడివి కాదు. మాతరం ఆలోచన్లు నువ్వు చెయ్యాల్సిన పనిలేదు. అయినా గుర్తుంచుకో. మీ అమ్మకు తెలియనీయవద్దు. నావల్ల కాలేదు, నీవైనా మెల్లమెల్లగా మార్చు ఆమెని" అని.

ఇడ్లీ ప్లేటు ముందు పెట్టుకుని కెలుకుతూ కెలుకుతూ కూర్చున్నాడు కాశ్యప్.

"ఏమైందిరా తినక" అంది మీనాక్షి.

"మమ్మీ! అయాం వెరీ సారీ! ఇంకెప్పుడూ నీకు చెప్పకుండా వెళ్లను" అన్నాడు తల వంచుకుని.

కొడుకు అలా అనగానే ఆమె మనసు ఆర్ద్రమయిపోయింది. లేచివచ్చి డైనింగ్‌టేబిల్ దగ్గర కొడుకు పక్కన కుర్చీలో కూర్చుంటూ తలమీద చెయ్యేసి, "ఒరే కన్నా! నువ్వు పైకిరావటంకంటే నాకింకా కావల్సిందేముందిరా?" అంది.

"చూశావా, కొడుకు అలా అనగానే వాడు చేసిందంతా మర్చిపోయావు. నువ్వే వాణ్ణి చెడగొడుతున్నది" అన్నాడు రామచంద్రం.

"వాడెలా చెడిపోతాడండీ? వాడు నాకొడుకు" అంది మీనాక్షి.



అక్కడ దేవకి ఇంట్లో మరో డ్రామా ఎనాక్ట్ అవుతోంది.

"ఏంటే, ఈ డాన్సుప్రోగ్రాములు. మరీ బరి తెగించిపోతున్నావు. హైదరాబాదు చాలనట్లు, బెంగుళూరు కూడా వెళ్ళొచ్చావు తైతక్కలాట్టానికి" అంది దేవకి.

"తైతక్కలు కాదు మమ్మీ! కళారాధన" అంది దీప.

"అవును, మీ నాన్న కళారాధన చేసి చేసి అటు లోకం, ఇటు మనంవట్టనట్టున్నాడు. ఇహ కూతురివి నువ్వు మొదలెట్టావు" అంది దేవకి.

"అదేంటి మమ్మీ? నాన్నకు బొమ్మలేనుకోటానికి ప్రశాంతత కుదరక వేరే వుంటున్నారు. నాల్గయిదురోజులకు ఓసారి వస్తూనేవున్నారుగా" అంది దీప.

"అవునే, ఊళ్లో జనమంతా ఏమనుకుంటున్నారు? మనల్ని వదిలేశాడనేగా? వస్తే రెండురోజులిక్కడ వుంటారు. లేకపోతే రెండు నెలలయినా మన ముఖమే చూడరు. అసలక్కడ వుండటమెందుకు? ఆ ఏబ్రాసి బొమ్మలేనుకోటానికి మనింట్లో ప్రశాంతత లేదా? అది కాదే తల్లీ! ఆ తులసితో కాపురం పెట్టాడే మీ నాయన"

"నీవన్నీ అనుమానాలమ్మా!"

"అవునమ్మా, నేనంటే అనుమానాలే. మొన్న మీ పిన్ని కూడా అంది. 'ఆ తులసితో తిరుగుతున్నవాడు, దాన్నే కట్టుకుంటే పోతుందికదా' అని. దానికీ ఇప్పుడు నలభైపైబడినయి. పెళ్లీపెటాకులూ లేకుండా ఎందుకుంటుందంటావు? నువ్వూ దాన్ని పిన్నీ అనే పిలుస్తావుగా తెచ్చి మీనాన్ననీ, పిన్నమ్మనీ ఇంట్లోనే పెట్టుకో. ఇద్దరు భార్యలని తెల్సి లోకం అప్పుడైనా నోరు మూస్తుంది"

"నాన్న జీనియస్ ఆర్టిస్ట్ అమ్మా! ఆల్ జీనియస్ ఆర్టిస్ట్స్ ఆర్ బొహిమియన్స్. దె డోంట్ కన్ఫార్మ్ టు దరూల్స్ ఆఫ్ సొసైటీ. నాన్నని అర్థంచేసుకోటానికి ప్రయత్నించు" అంది కూతురు.

"నువ్వు నాకు చెప్పక్కర్లేదులే తల్లీ! ఈ ముప్పయ్యేళ్లనుండీ అర్థంచేసుకుంటూనే వున్నాను మీ అయ్యను. ఆ ఏడ్చేదేదో చాటుగా ఏడిచ్చావచ్చుగా. ఉహూఁ ... అంతా పబ్లిక్కే. పరమేశంగారి కూతురని అనిపించుకోటానికి నీకు సిగ్గేయటంలేదేమోగానీ ఆయన భార్యనిపించుకోటానికి నాకు సిగ్గుగావుంది. జనం నోట్లో ఉమ్మేస్తున్నారు. మొన్నా తులసి తల్లి వచ్చి నానా తిట్లూ తిట్టి వెళ్లింది"

"ఇవ్వటిదాకా నిద్ర పోయిందా, నేను పుట్టక ముందునుండీ జరుగుతున్న వ్యవహారానికి? అయినా నాన్న అలాంటివాడు కాదే"

"ఆమెమాత్రం ఏంచేస్తుంది. మొగుడెప్పుడో పోయాడా? ఆడకూతురు కూతురికి చెప్పి చూసింది. వెళ్లి మీనాన్నని తిట్టింది. ఊహూఁ... సిగ్గు లేని మొహాలు, ఉలకలేదు, పలకలేదు. చేతకాని మొహంది. ఈ పాతికేళ్లల్లో ఎన్నిసార్లో వచ్చింది మనింటికి. ఆవిణ్నీస్థితికి తీసుకొచ్చింది వీళ్లే"

"నాన్నకు ఫోన్ చేస్తాను, నేను బెంగుళూరు నుండి వచ్చాను రమ్మని"

"ఆఁ వస్తారు. ఆయనకు కూతురు పట్టలేదు, భార్య పట్టలేదు"

అంతలో కాలింగ్బెల్ మోగింది. దీప వెళ్లి తలుపు తెరిచింది.

"హాయ్ డాడీ!"

"హాయ్ బేబీ! హౌడిడ్ యువర్ పెర్ఫార్మెన్స్గో?"

"ఫైన్"

"అమ్మయ్య! మీకో కూతురుందని గుర్తొచ్చిందన్నమాట. దర్శనభాగ్యం కలిగించారు, అక్కడికదే అదృష్టం" అంది దేవకి.

"పాప గుర్తుండకపోవటమేమిటి? బెంగుళూరునుండి ఫోనుచేసిందిగా, ఇవాళ వస్తానని. పాప రాకముందే నేను రావాల్సింది. కొంచెం లేటయింది" అన్నాడు పరమేశం.

దేవకి కాఫీ పెట్టటానికి వంటింట్లోకి వెళ్లింది.

"రెండురోజులున్నాం డాడీ బెంగుళూర్లో. మాతో క్రిష్టఫర్ కూడా వచ్చాడు. ఇట్వాజె జాలీ ట్రిప్. కాశ్యప్ ఆల్సో ఫెల్ట్ వెరీ హాపీ. అక్కడ నుండి మైసూరు, బేలూరు, హళేబీడు వెళ్లాం. బేలూరు, హళేబీడు శిల్పాలని నీ బొమ్మల్లోనే గానీ అంతకుముందెప్పుడూ చూడలేదు డాడీ. మైనంతో మల్చినట్టు ఎంత అద్భుతంగా చె

క్కాడా శిల్పి. అతని చేతిలో ఉలి చెప్పినట్టు నడిచింది'' అంది దీప.

''అవునమ్మా... దె ఆర్ ఇమ్మోర్టల్ పీసెస్ ఆఫ్ ఆర్ట్. ఆ దేవతల శిల్పాలు, నాట్యకత్తెలు, నృత్యభంగిమలు, వాద్యకారులు. కీట్స్ అన్నట్టు ఒక్కొక్క శిల్పం స్టిల్ అన్‌రావిష్‌డ్ బ్రైడ్ ఆఫ్ క్వయట్‌నెస్ వాట్ మెన్ ఆర్ గాడ్స్ ఆర్దీజ్? వాట్ మైడెన్స్‌లాత్.... వాట్ పైప్స్ అండ్ టింబ్రెల్స్? వాట్ వైల్డ్ ఎక్టసీ... వాటిని గురించి చెప్పటానికి నాకెప్పుడూ మాటలు దొరకవు. వాటిని చూస్తుంటే బయటి ప్రపంచాన్ని మర్చిపోతాం. బ్రహ్మానంద సహోదరమైన ఆనందాన్ని అనుభవిస్తాం...''

దేవకి కప్పులతో కాఫీ పట్టుకొచ్చింది. భర్తకూ, కూతురుకు కప్పులు ఇస్తూ అంది- ''బయటి ప్రపంచాన్ని మర్చిపోయి అలా ఊహాలోకాల్లో తేల్తూ వుండండి, తండ్రీకూతుళ్లిద్దరూ. దాని వయసెంతో తెల్సా మీకు. ఇరవైనాలుగు. దాని పెళ్లి మాట తలపెట్టేదేమన్నా వుందా లేదా?''

పరమేశం ఒక్కక్షణం మాట్లాడలేకపోయాడు. ఊహల సుందర ఆనంద లోకాల్లో విహరించే విహంగం వాస్తవికతా బాణం తగిలి గిలగిలా కొట్టుకుంటూ కిందపడినట్లయింది అతని పని. తేరుకుంటూ అన్నాడు ''పాప పెళ్లి మనం చేయాల్సిన ఖర్మేం? దాని పెళ్లి అదే చేసుకుంటుంది''

''అంతా చోద్యంగా మాట్లాడతారు. తల్లీ తండ్రివుండగా దానికా ఖర్మ ఎందుకు? మా సుజాత కొడుకు పిల్లవాడు చక్కగా వున్నాడు. మెడిసన్‌లో పెద్ద పెద్ద పరీక్షలు పాసయాడు. అమెరికా వెళ్తాడట. అతనికిచ్చి చేద్దాం. మాట్లాడటం వగైరా తంటాలు నేను పడ్తాను. మీరు మీ కూతుర్ని వప్పించండిచాలు'' అంది దేవకి కాఫీతాగుతూ.

''నేనీ అరేంజ్‌డ్ మారేజ్ చేసుకోను మమ్మీ... క్రిస్టోఫర్ లవ్స్ మి. ఐ వాంటు మారీ హిం'' అని డిక్లేర్ చేసింది దీప.

''ఓసి నీ మొహం మండ. ఓ మతంగాదు, ఓ కులంకాదు. ఆ పిల్లాడ్ని ఎట్లా చేసుకుంటావే? బంధువులూ, సంఘం దుమ్మెత్తిపోస్తారు. మీ నాన్న పోకిళ్లతోనే నేను తలెత్తుక తిరగలేకండావున్నాను. ఇహ నువ్వు వాడిని కట్టుకో. నేనిక బతికుండక్కర్లా'' అంది దేవకి.

''ఎవరి కోసమో నేను నా ఇష్టాన్ని వ్యతిరేకించి నడచుకోను'' అంది దీప.

''ఏంటండీ మీరు చూస్తూ వూరుకుంటారు. మాట్లాడరేం? అది కులం, మతం కానివాడిని కట్టుకుని వంశనాశనం చేస్తానంటుంటే'' అంది దేవకి ఆక్రోశంతో.

''చూడు దేవకీ దానికిష్టంలేని పెళ్లిచేసి ప్రయోజనమేంటి? లెట్ హర్ హావ్ హర్ ఓన్ ఛాయిస్''

''నా బొందిలో ప్రాణంవుండగా ఈ పెళ్లి జరగదు'' అంది దేవకి.

''ఈ ఇరవై ఒకటో శతాబ్దంలో కూడా ఇలాంటి పట్టింపులు దేనికి?''

''ఏ శతాబ్దంలో అయినా మనుషులు తమ రీతి రివాజుల ననుసరించి బతకాలి. మీ ఊహాలోకాల్లో వున్నట్లుగా లోకం మారిపోలేదు''

''దిసీజ్ అట్రాషియస్, అన్ రీజనబుల్ అండ్ సెన్స్‌లెస్''

''అవును మీరు చేసేదీ, చెప్పేదీ రీజనబుల్ సెన్సిబుల్, నాది మూర్ఖత్వం. అసలుదానికి కొమ్ములెక్కించింది మీరే. విచ్చలవిడిగా ఆంబోతులాగా తిరగమని వదిలారుదాన్ని. మిమ్మల్ని చూసి అది ఊళ్లు పట్టుకు తిరుగుతోంది'' అంది దేవకి అక్కసుగా.

''అది నీ తప్పు సమాజం ఏమంటుందోనని ప్రతిక్షణం ఉలిక్కిపడ్తూ బతకటం. నీ బతుకు నువ్వు బతకలేదు. ఆ ప్రయత్నం చేసినట్లయితే సుఖపడేదానివి.''

''ఆఁ మీరు బతికారుగా మీ జీవితం మీరనుకున్నట్లు. జనం నోట్లో ఉమ్మేసేటట్లు. మీ తాగుడు పార్టీలు నచ్చక యజమానులు పోట్లాడితే ఎన్ని కొంపలు మార్చాం? మీ హద్దు మీరిన ఖర్చువల్ల ఓ స్వంత ఇల్లయినా కట్టుకోలేకపోయాం. ఇహ ఆ తులసి నా జీవితానికి శనిలా దాపురించింది. ఇలా చాటుమాటుగా ఏడవకపోతే దాన్నీ కట్టుకోమని శతపోరి చెప్పాను. ఊహూఁ నా మాటలు మీకు నచ్చవు. పరిచయస్తులూ, చుట్టాలూ ఛీ కొట్టినా మీ ప్రవర్తన మార్చుకోరు. ఇవాల్టికి దాన్నలా తయారుచేశారు. ఉన్న ఒక్క కూతురూ అలా తయా

రయితే ఇహ నేను ఎవరికోసం బతకాలి? నాకు చావైనా రాకుండా వుంది'' అంది దేవకి బాధపడ్తూ.

ఆమె మాటల్లో ఏమీ అబద్ధం లేదని పరమేశానికి తెల్సు. తన జీవన పద్ధతిని మార్చుకోలేడతను. కూతురికి క్రిస్టోఫర్ని చేసుకోవద్దని చెప్పలేడు. ఓ విధంగా అతనికి దేవకి అంటే సానుభూతి. ఆమె తనకోసం ఏమీ కోరుకోదు. తనామె పట్ల ఎట్లా ప్రవర్తించినా తప్పు పట్టలేదు. ఎంతసేపూ కాపురం గుట్టుగా చేయమనే గోలపెట్టింది. అతనికి నిజానికి ఎవరూ అక్కరలేదు. దేవకి అవసరంలేదు. తులసి అవసరంలేదు. తాగుడవసరంలేదు. సమాజంలో కీర్తిప్రతిష్ఠ ఏమీ అవసరంలేదు. అతనికి తెలియని అంతః చేతన ఏదో అతని చేత పనిచేయిస్తుంది. ఇప్పుడు బొమ్మలేసి సంపాదించాలని లేదు అతనికి. అయినా తప్పటంలేదు. డబ్బు అవసరం. ఏమీ అవసరంలేక పోయినా అన్నీ అవసరమే అతనికి. ఎవర్నీ బాధ పెట్టాలనుకోడుగానీ అందర్నీ బాధపెడ్తాడు. అప్పులు పెరిగిపోయాయి. తన వాటా పొలం అంతా అమ్మేశాడు. అయినా అప్పులు మిగిలాయి. తన అప్పుల బాధ భార్యను చుట్టుముట్టకుండా అతను బయటకు వెళ్లిపోయాడు. దేవకి తన జీతంలో పొదుపుగా వెళ్లదీస్తున్నది. కూతుర్ని చదివించింది. తండ్రి వారసత్వంగా కళపట్ల కూతురికి అభిరుచి వచ్చింది. ఎంతగానో ప్రయత్నించినా ఆమెనా దృష్టినుండి తిప్పలేకపోయింది దేవకి. చివరకు పెళ్లి విషయంలోనూ తన ప్రమేయమేమీలేదని తెల్సి ఆమె హతాశురాలైంది. అతనికి భార్య అక్కర్లేదు. పిల్లక్కర్లేదు. సంసారమక్కర్లేదు. ఈ దంపతుల జీవితమూ అంతే విడిపోదు సుఖపడదు.

''పాపా! క్రిస్టోఫర్ లేకపోతే నీ జీవితం శూన్యమవుతుందన్న గాఢ భావన మనసులో వుంటే అలాగే అతన్ని చేసుకో. నేను అభ్యంతరపెట్టను. మీ అమ్మ వద్దన్నా నువ్వు లెక్కచేయాల్సిన అవసరంలేదు. అలా కాకపోతే ఈ ఒక్కమాట విను. నేను మీ అమ్మను ఏమీ సుఖపెట్టలేదు. నావల్ల తను చాలా బాధలే పడ్డది. కాబట్టి మీ అమ్మ చెప్పినట్టు చెయ్యి. చివరకు నీ పెళ్లయినా తను అనుకున్నట్టు, తన మనసుకు నచ్చినట్టు చేసుకోనియ్యి'' అన్నాడు పరమేశం ఉదాసీనంగా.

''అదేంలేదు డాడీ! ఎప్పట్నుంచో పరిచయమున్నవాడు, క్లాస్‌మేట్, ఇష్టపడుతున్నవాడూ కదా అని అతన్ని పెళ్లిచేసుకుందామనుకున్నాను. అతను లేకుంటే జీవితం శూన్యమయిందేనన్న బాధ నాకు లేదు. అసలు నేను ఇప్పట్లో పెళ్లిచేసుకోను. అసలా ఆలోచనా నాకు లేదు. అమ్మే ఆ ప్రసక్తి తీసుకువచ్చి, నాచేత ఈ మాట అనిపించింది. ఏమైనా ఈ అరేంజ్‌డ్ మారేజెస్ అంటే నా కిష్టంలేదు'' అంది దీప నవ్వుతూ.

''థాంక్యూ డియర్! ఐవాంట్ నత్తింగ్ ఫ్రం యు. నాకు కావాల్సింది నీకు నచ్చిన వాళ్లలో మీ అమ్మ కూడా మెచ్చే వ్యక్తిని చేసుకో. దట్స్ వాటై వాంట్'' అన్నాడు పరమేశం.

''ఓకే డాడ్'' అంది దీప.

దేవకి హృదయం కుదుటపడ్డది. భర్తవంక ప్రేమగా చూసింది.

''మీకూ నేనంటే కాస్తంత ప్రేమ వున్నదన్న మాట'' అని నిట్టూర్చింది దేవకి.

''నాకు ప్రేమ లేకపోవటంలేదు. సమాజంలో నా స్వేచ్ఛని అరికట్టని వ్యక్తివి నువ్వే. కాకపోతే గుట్టుగా వుంచమన్నావు. అది నావల్ల కాదు. నేను నిన్ను ఇంతకంటే ఎక్కువగా ప్రేమించలేకపోవటం నా దౌర్భాగ్యం'' అన్నాడు పరమేశం.

''ఇప్పటికి అమ్మ మొహం ప్రశాంతంగా వుంది'' అంది దీప.

''అవును. మీరిద్దరివల్లా ఏ అవాంతరాలూ లేకపోతే, నా జీవితం ప్రశాంతంగానే వుంటుంది'' అంది దేవకి.

★ ★ ★

హాయిగా బతకటానికి కావల్సిన నేర్పూ, ఓర్పూ వున్న దంపతులు సంధ్య, శ్రీనివాసులు. సంధ్య నిజంగానే అతని జీవనమార్గదర్శి. అతడూ పురుషాహంకారంతో ఆమె మాటలు కొట్టివేయలేదు. సఖ్యంతో ఏడడుగుల జీవితాన్ని గడిపిన జీవనసహచరులు. మిత్రులు ఆ ఆలుమగలు.

సంధ్య కొడుకు శిరీష్‌చంద్రకు స్టేట్స్‌లో సెటిలయ్యే అవకాశం వచ్చింది. ఢిల్లీలోని ఆలిండియా మెడికల్ సైన్సెస్ ఇనిస్టిట్యూట్‌లో కూడా ఉద్యోగమొచ్చింది. అతనో పెద్ద సైకియాట్రిస్ట్. హైదరాబాద్‌లో ఎం.డి. పూర్తిచేసుకుని స్టేట్స్‌లో పెద్ద పెద్ద డిగ్రీలు సంపాదించాడు. ఇప్పుడు సెలవుమీద ఇండియా వచ్చాడు. తను అక్కడే స్థిరపడాలని అతని ఉద్దేశం. తండ్రి శ్రీనివాస్ ఢిల్లీ ఉద్యోగంలో చేరమంటున్నాడు. తర్జనభర్జనలు జరుగుతున్నాయి. సంధ్యకు ఇద్దరి ఆలోచనలూ నచ్చలేదు.

"బ్రెయిన్ డ్రెయిన్, బ్రెయిన్ డ్రెయిన్ అని దేశం గోలపెడ్తోంది. చదువుకున్నవాళ్లందరూ తమ స్వసుఖాలకూ, తాము పైకిరావాలన్న ఆలోచనతో దేశం వదిలిపెడ్తే ఈ దేశం ఎప్పటికి బాగుపడేను. దిసీజ్ గ్రేట్ డి సర్వీస్ టుద నేషన్ విత్ ప్రొవైడెడ్ యు విత్ ద వేర్ విథౌట్ అండ్ హయ్యర్ ఎజుకేషన్. నువ్విక్కడే 'ఆలిండియా మెడికల్ సైన్సెస్ ఇనిస్టిట్యూట్'లో చేరు. అదీ అంత తక్కువ ఉద్యోగమేంకాదు. వీలయినప్పుడల్లా మాకూ నిన్ను చూసే అవకాశముంటుంది" అన్నాడు శ్రీనివాస్.

"ఇప్పుడు అమెరికా వెళ్లినా నష్టమేముంది నాన్నా! ఎప్పుడంటే అప్పుడు రావచ్చు. ట్రాన్స్‌ఫోర్ట్ ఫెసిలిటీస్ బాగా పెరిగాయి. అక్కడకు మీరూ రావచ్చు, ఇక్కడకు నేనూ రావచ్చు" అన్నారు శిరీష్‌చంద్ర.

"మీ నాన్న అనేది నిన్ను మేము చూసుకునే అవకాశం వుండదనికాదు. ఈ దేశం, మిగతాదేశాలతోపాటు ఔన్నత్యం పొందాలంటే అంతా పుట్టిన దేశం కోసం తమ శక్తినీ మేధస్సునూ ధారపోయాలి. అసలు నువ్వు ఢిల్లీ మాత్రం వెళ్లటం ఎందుకు? ఇక్కడ హైదరాబాద్, విజయవాడ, గుంటూరు, వైజాగ్, తిరుపతిలాంటి ఎన్ని పట్నాలు, నగరాలులేవు? ఇక్కడి ప్రజలకు నీలాంటి స్పెషలిస్టుల అవసరంలేదా? నువ్వు ప్రభుత్వోద్యోగంలోకి చేరటం నాకిష్టంలేదు. నువ్వే స్వతంత్రంగా ఒక హాస్పిటల్ తెరువు" అంది సంధ్య.

"అమ్మకు అన్నయ్య ఊరు విడిచివెళ్ల ఇష్టంలేదు.అందుకని తెలివిగా హైదరాబాద్‌లోనే కట్టిపడెయ్యాలని చూస్తోంది" అంది ప్రఫుల్ల.

"అదేం కాదమ్మాయి! స్వతంత్రంగా, స్వేచ్ఛగా బతికే అవకాశం వున్నప్పుడు ఒకరి ఒద్దికలో బతకాల్సిన అవసరం లేదనే నేను చెప్పేది" అంది సంధ్య.

"ఏమోనమ్మా! స్టేట్స్‌లో వున్న అవకాశాలిక్కడలేవు" అన్నాడు శిరీష్‌చంద్ర.

"అదే తప్పు ఆలోచన. అవకాశాలెవరికి? నీకు. నీ అవసరాలకోసం దేశానికి అవకాశాలు లేకుండా చేయకూడదు."

"నిజమేనమ్మా... కానీ..."

"ఒరే చందూ! మీరు మాకంటే కూడా రిగ్రెసివ్‌గా ఆలోచిస్తున్నారేరా! ఈ సందిగ్ధం పనికిరాదు. మన సెంటిమెంట్సు పక్కకిపెట్టి హేతుబద్ధంగా ఆలోచించాలి" అన్నాడు శ్రీనివాస్.

"ఇండియాలో వుండేటట్లయితే ఢిల్లీ వెళ్లను. అమ్మ అన్నట్లు ఇక్కడే ప్రయివేట్ హాస్పిటల్ ఓపెన్ చేస్తాను"

"బాగుంది ఆ పనే చెయ్యి చందూ! ఒక్కమాట గుర్తుంచుకో. డబ్బు సంపాదించు, సంపాదించటం కోసమే బతకవద్దు. ప్రయివేట్ హాస్పిటల్ అన్న తర్వాత ధనికులూ, బీదవాళ్లూ అందరూ వస్తారు. ఫ్రీ సర్వీస్ అందివ్వమని చెప్పటంలా. కానీ మామూలు మనుషులకు అందనంత ఫీజులు వసూలు చెయ్యవద్దు. హాయిగా బతకాలి, బతకనివ్వాలి. రూపాయిన్నోట్లు తినం. తినటానికీ సుఖంగా బతకటానికి కావల్సిన డబ్బు సంపాదించు. మీ నాన్న జీవితంలో నాకు నేర్పిన పాఠమిది. నీకూ చెప్తున్నాను" అంది సంధ్య భర్తవంక చూసి నవ్వి.

"ఒరే బాబూ! అవి నిజంగా నా మాటలనుకునేవు. మీ అమ్మవే" అన్నాడు శ్రీనివాస్.

"అమ్మమాట వేరూ, నాన్నమాట వేరూ కాదన్నయ్యా! ఇద్దరూ నిన్నిక్కడే హైదరాబాద్‌లో కట్టిపడెయ్యాలని చేసే కుట్ర. అంత చదువుచదివి ఏం ప్రయోజనం? కాస్తంత బుర్ర ఉపయోగించు" అంది ప్రఫుల్ల.

"అవును పాపా... నీ మీద కూడా కుట్ర చేశాం. మీ అమ్మ తన ప్రెస్ అండ్ పబ్లిషింగ్

వింగ్ నీకిచ్చేసి తను రిటైరమెంట్ పుచ్చుకోవాలనుకుంటోంది. నీకు ప్రింటింగ్ టెక్నాలజీ బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ చదువు చెప్పించింది ఆ ఉద్దేశంతోనే. కనుక ఆ ధర్మపాల్‌సింగుతో తిరుగుళ్లు, షికార్లూ మానేసి ప్రెస్సూ అదీ చూసుకో. మీ అమ్మకు రిటైర్‌మెంట్ ఇచ్చెయ్యి. పాపం ఎప్పటినుండో పాటుపడుతున్నది'' అన్నాడు శ్రీనివాసు.

''పెళ్లిచేస్తే సరిపోతుంది నాన్నా... తిరుగుళ్లూ, షికార్లూ కట్టుబడతాయి. వాడింకా కాంట్రా

''నేను హాయిగావుంటే నీ కళ్లు కుడుతున్నాయి'' గునిసింది ప్రఫుల్ల.

''అవును కన్సల్టెన్సీ పెట్టుకున్నాడు. బానే సంపాయిస్తున్నాడు. ఆ పిల్లడూ తొందరపడ్తూనే వున్నాడు పెళ్లికి. ఏదీ నువ్వొస్తే ఆ శుభకార్యం జరిపించేద్దామని ఆలోచిస్తున్నాం'' అన్నాడు శ్రీనివాస్.

''నే వచ్చేశాగా. హైదరాబాదులోనే వుండతల్చుకున్నాను. వీలైనంత త్వరలో దాని పెళ్లి



క్టులు చేస్తూనేవున్నాడా? ఆర్కిటెక్ట్ అడ్వైర్టైజింగ్ కన్‌సల్టెన్సీ పెట్టుకుంటానన్నాడు రెండేళ్లక్రితం...?'' అడిగాడు శిరీషచంద్ర.

ధర్మపాల్‌సింగ్ అతని బాల్యమిత్రుడు. రోజూ ఇంటికి వచ్చిపోతూ వుండేవాడు. ఆ విధంగా ప్రఫుల్లకు అతను పరిచయమయ్యాడు.

చేసేద్దాం"

"నువ్వెందుకు హైదరాబాదులో వుండద ల్చుకున్నావో నాకు తెల్సులేరా అన్నయ్యా..." అని మెల్లగా గొంతుతగ్గించి- "లావణ్యా... అమ్మా వాళ్లకు చెప్పనులే నాకేం లంచం ఇస్తావు" అంది ప్రవుల్ల.

"ఛీపో... అందరికీ లంచాలు పెట్టి ఇది బిజినెస్‌లో బాగా పైకి వచ్చేట్టుంది"

"మాట తప్పించెయ్యకు. తరువాత పశ్చా త్తాప పడాల్సివస్తుంది" అంది ప్రవుల్ల.

"చందూ... చందూ..." అంటూ లోపలకొ చ్చాడు ధర్మపాల్‌సింగ్.

"రారా... ఇప్పుడే నీ మాటలనుకుంటు న్నాం" అని ఆహ్వానించాడు శిరీషచంద్ర.

"ఇప్పుడు కూర్చోటానికి టైములేదు. మా ఆఫీసుకెళ్తున్నా. నువ్వు వచ్చావని తెల్సింది. నీకదంతా చూపించాలి. నీ సలహాకూడా కా వాలి కొన్ని విషయాల్లో బయల్దేరు వెళ్దాం" అని తొందరచేశాడు ధర్మపాల్ సింగ్.

"బిజినెస్ వ్యవహారాల్లో నా సలహా తీసుకో వాలిగాని అన్నయ్యది కాదు. అన్నయ్యా సలహా తీసుకుంటే పిచ్చాసుపత్రిలో చేరాల్సి వుంటుంది" అంది ప్రవుల్ల.

"పోనీ నువ్వురా"

"అలా అన్నావు బావుంది. పదరా అన్న య్యా..."

"అదేం తొందర? ఆ పిల్లాడికి కాస్తకాఫీ, టిఫినయినా ఇవ్వకుండా?" అంది సంధ్య లేస్తూ.

"ఇప్పుడు కాఫీ ఏమొద్దు ఆంటీ.. మీరు కూర్చోండి అంతా పూర్తి చేసుకునే వచ్చాను. మేం వెళ్తాం... సాయంత్రం అందరం వస్తాం భోజనానికి, వస్తాం అంకుల్" అంటూ బయ టకు నడిచాడు ధర్మపాల్‌సింగ్.

అన్నాచెల్లెళ్లు ఇద్దరూ అనుసరించారతన్ని.

అప్పటికి ఉదయం ఎనిమిది గంటల యింది. సుమిత్రమ్మ పొద్దున్నే గుడికి వెళ్లితి రిగి వస్తున్నది "ఎక్కడికిరా పిల్లలూ వెళ్తున్నా రు?" అని అడిగింది ఆమె.

"బయటికెళ్తొస్తాం నాయనమ్మా. తొందర గానే వచ్చేస్తాం" అని సమాధాన మిచ్చాడు శిరీషచంద్ర వెళ్తూ. పిల్లలిద్దరూ ఆమె పెంప కంలోనే పెరిగారు. తల్లి బిజినెస్ వల్లతో తిరగ టంతో పిల్లల పెంపకభారం అంతా సుమిత్ర మ్మే వహించింది. ఆమెకు ఆ మనుమడూ, మనమరాలూ అంటే ఎంతో మమకారం, ప్రేమ.

"నాయనమ్మా... మొగపిల్లాడని అన్న య్యంటే ఎక్కువ నీకు. ఆడపిల్లనని నేనంటే చులకన. నీకు ఇంత పక్షవాతం పనికిరాదు" అనేది ప్రవుల్ల గారాలుపోతూ.

"ఓసి నా తల్లీ... పక్షవాతం కాదే పక్షపాతం. నువ్వన్నట్టు ఒకప్పుడు అలాగే అనుకునేదాన్ని గాని మీ అమ్మను చూసింతర్వాత నా అభి ప్రాయం మారిపోయిందే అమ్మాయి" అనేది ఆమె.

హాల్లోకి వచ్చి కొడుకు,కోడలితో అంది ఆమె- "ఏం తిరుగుళ్లురా ఇవి. శిరీష వచ్చినప్పటి నుండీ ఇంట్లోనే వుండటంలేదు. వాళ్ల పెళ్లి చేయండి అని మీకు శతపోరి చెప్తున్నా మీరు వినటంలేదు. నేను బతికుండగా పిల్లలిద్దరి పెళ్లిళ్లూ చూస్తానో లేదో..."

"ముని మనవడి పెళ్లి కూడా చూస్తావే అమ్మా... నీకేం ఆరోగ్యంగానే వున్నావు..." అన్నాడు శ్రీనివాసు.

"అంతా వాడిదయ, కోడలు పిల్ల మంచి తనం" అని నిట్టూరుస్తూ లోపలికెళ్లిపోయింది సుమిత్రమ్మ.

"చూశావా వాసూ... మీ అమ్మగారు కూడా నా మంచితనాన్ని మెచ్చుకుంటున్నారు" అంది సంధ్య.

"ఆఁ ఆఁ.. నేను మంచివాణ్ణి కాకపోతే నీ మంచితనం బయటపడేదా?"

"నువ్వు మంచివాడివనేగా నిన్ను చేసుకు న్నది"

"కాదు నేను చేసుకున్నాను"

"పోన్లే నన్ను చేసుకున్నందుకేం బాధపడ టంలేదుగా?"

"అలా ఎందుకు జరుగుతుంది మార్గద ర్శీ?" అంటూ సంధ్య చేతిలో చేయివేశాడు శ్రీనివాసు.

★



## చతుర ఫీచర్

# కంచి కథ

కంచి పేరు వినని తెలుగువారుండరు. ''కథ కంచికి, మనం ఇంటికి'' అనే తెలుగు సామెత మనకి, కంచికి మధ్యనున్న అవినాభావ నంబంధాన్ని ఎన్నో దశాబ్దాలుగా సూచిస్తూనే ఉంది. ఇలాగే తెలుగువారి నుడికారంలో కన్పించే మరో సామెత 'కంచి గరుడసేవ' - వీటిని మన నంస్కృతిపై ఒకనాటి పుణ్యక్షేత్రాల దర్శనీయస్థలాల ప్రభావానికి ఒక మచ్చుతునకగా చెప్పుకోవచ్చు.

తిరుపతి లేక మద్రాసులనుంచి కేవలం వంద కిలోమీటర్ల దూరంలో ఉన్న కంచి ఆంధ్రసరిహద్దులోని అత్యంత పురాతనమైన ఆధ్యాత్మిక, చారిత్రక పట్టణాల్లో ముఖ్యమైనది (తిరుత్తణిలాంటివి ఇంకా చాలా ఉన్నాయి).

సుమారు పదమూడువందల నంవత్సరాల క్రితం పల్లవులు వ్యయప్రయాసలకోర్చి నిర్మించిన కంచి ఏకాంబరేశ్వర, కామాక్షి దేవాలయ ముఖద్వారం శిధిలమై, చాలావరకు నేలమట్టమై, ఆఖరికి చూపరులకు ప్రవేశానికి కూడా నోచుకోకుండా మూసివేతకు గురై చాలా కాలమైపోయింది.

లోపల దేవాలయంకూడా చాలా జీర్ణస్థితికి దిగజారిపోయింది. పైగా క్రమశిక్షణ, సరైన జీతభత్యాలు, ఆదరణలేని దేవాలయ సిబ్బందితో ఆధ్యాత్మిక విలువలను నయితం కోల్పోయి పూర్తి నమాధిస్థితిని, పతనాన్ని ఎదురుచూస్తోంది.

### కంచి, కాంచీ, కచ్చీ... అన్నీ ఒకటే!

'కంచి'ని 'కాంచీ' అని, 'కచ్చి' అని కూడా పిలవటం పూర్వీకుల కాలంనుంచి సంప్రదాయంగా వస్తున్నది. 'కంచి' అనే పేరు కంచి చెట్లనుంచి వచ్చిందని పురాతన స్తోత్రమాలికల ఆధారంగా తెలుస్తోంది.

శ్రీమాన్ కడియలూర్ ఉరూథిరన్‌కన్నార్ రాసిన 'పేరుంబనత్రుపాదై' స్తోత్రగంథంలో శ్రీ



శ్రీకృష్ణదేవరాయలు నిర్మింపచేసిన 192 అడుగుల ఎత్తున్న ఏకాంబరేశ్వరాలయం

మహావిష్ణువు కంచి వృక్షాలమధ్యనుండే ఆదిశేషువుపై పవళించినట్లు వర్ణించడాన్నిబట్టి 'కంచి' పేరున వృక్షాలుండేవని, ఆపేరే తర్వాతకాలంలో 'కంచి' అనే ఊరుపేరుగా మారిందని తెలుస్తోంది. ఉరుథిరన్‌కన్నార్ రాసిన గ్రంథం పల్లవులు పాలించిన ఏడవ శతాబ్దానికి పూర్వం విరచితమైంది.

కాళిదాసు రాసిన శ్లోకంలో 'పుష్పేమజాజి, నారేమ రంభ, నదీమ గంగ, నగరేమ 'కంచి'' అనిఉండటంవలన గుప్తరాజులకాలానికే 'కంచి' అనే పదం వాడుకలో ఉందని, గుప్తరాజులు పల్లవులకంటే ముందువారని స్పష్టం అవుతోంది.

'కంచి' పదంలో 'క' శబ్దానికి 'బ్రహ్మ' అని, అనుస్వరంతో ఉన్న 'చి' శబ్దానికి 'అర్చించు' అని కూడా పండితులు అర్థం వివరించారు. ఒకప్పుడు బ్రహ్మ ఈప్రాంతంలో శ్రీమహావిష్ణువు, శివులను అర్చించాడని అనేక పురాణకథలు ఉదాహరణలుగా మనముందు సాక్షాత్కరిస్తాయి.

కంచి పట్టణాన్ని భూదేవికి అత్యంత ప్రియమైందిగా భావిస్తారు. ప్రళయకాలంలో సమస్త భూప్రపంచం సముద్రగర్భం చేరగా కంచి పట్టణంమాత్రం ఎప్పుడూ ముంపుకు గురికాకుండా భూదేవి రక్షించిందని అనేకమంది ఆధ్యాత్మిక యోగసంపన్నులు, జ్ఞానులు రచించిన రచనలద్వారా తెలుస్తోంది.

కంచిని గురించిన ప్రస్థావన స్కందపురాణంలో కూడా కనిపిస్తుంది.

కంచికి - ఏకాంబరం, భూలోక్ కైలాస్, శివపురం, త్రిమూర్తివాసం, బ్రహ్మపురం, కామపీఠం, కన్నికాపు, తుండీరపురం, సత్యవ్రత తళం - అని ఇతర నామాలుకూడా ఉన్నాయి.

## ఆధ్యాత్మిక ప్రాశస్త్యం:

పంచభూతాలైన భూమి, అగ్ని, జలము, వాయువు, ఆకాశములలో ఒక్కోదానికి భూమిపై ఒక్కో పుణ్యక్షేత్రం ప్రాతినిధ్యం వహిస్తున్నదని శాస్త్రాలు చెబుతున్నాయి.

అలాంటి అయిదింటిలోనూ 'కంచి' పవిత్ర పుణ్యక్షేత్రం ఒకటి. ఇది పృథ్వీతత్వానికి ప్రాతినిధ్యం వహిస్తున్నది.

అందుకే కంచి భూదేవికి అత్యంత ప్రీతిపాత్రమై ముంపుకు గురికాకుండా ఆమె చేతిలో రక్షణ పొందగలిగిందని శాస్త్రవివరణ.

మిగతా నాలుగింటిలో 'అగ్ని'ని తిరువణ్ణామలైలోని అరుణాచలేశ్వర దేవాలయం, వాయువును - కాళాట్టిలోని ఈశ్వర దేవాలయం, 'జలమును' - జంబుకేశ్వరం (అనెక్కొ పట్టణంలోని జంబుకేశ్వరుడు. ఇది తిరుచ్చి లేక తిరుచిరావల్లి నుంచి కేవలం పద్దెనిమిది కిలోమీటర్ల దూరం), 'ఆకాశాన్ని' - చిదంబరం పట్టణంలోని నటరాజస్వామి దేవాలయక్షేత్రం సూచిస్తున్నాయి.

వీటిలో జంబుకేశ్వరం ద్వాదశజ్యోతిర్లింగాలలో ఒకటి. మనదేశంలోని ద్వాదశజ్యోతిర్లింగాలలో నాలుగు మహారాష్ట్రలోనూ, రెండు తమిళనాడులోనూ, గుజరాత్, ఆంధ్ర, కర్నాటకల్లో ఒక్కొటి, మిగిలిన మూడు ఉత్తర భారతంలోని ఉత్తర ప్రదేశ్‌లోనూ ఉన్నాయి.

ఆధ్యాత్మిక శాస్త్రప్రకారం సాధకులైనవారు తపస్సు ఆచరించవలసిన ప్రధాన పుణ్యక్షేత్రాలు ఏడు. దక్షిణాదిన తెలుగువారికి సమీపంలో ఉన్నది కేవలం 'కంచి' పట్టణం ఒక్కటే - మిగిలిన ఆరు ఉత్తరాదినే ఉన్నాయి. అవి అయోధ్య, మధుర, ద్వారకా, కాశీ, అవంతి, మాయానగరాలు.

ఆగమశాస్త్రప్రకారం కంచికి మూర్తి, స్థల, తీర్థప్రాధాన్యాలు మూడు ఉండటం విశేషం. ఈ పట్టణంలో సర్వతీర్థం, మంగతీర్థం, శివగంగైతీర్థం, కంచైతీర్థం, ఉక్కనితీర్థం అని అయిదు తీర్థాలున్నాయి.

మూర్తీపరంగా నూటెనిమిది శివాలయాలు, పద్దెనిమిది విష్ణుదేవాలయాలు కంచిలో తప్ప మరెక్కడా కనరావు. అందుకే కంచిని దేవతల పవిత్రక్షేత్రంగా శాస్త్రాలు అభివర్ణించాయి.

కంచిపురాణంలో, స్కంధపురాణంలో కంచికి మరో కైలాసం అని, కాశీకి, కంచికి తేడాలేదని పేర్కొనటం జరిగింది. రాజయోగ సూత్రకారుడైన పతంజలి మహర్షి క్రీ.పూ. రెండవశతాబ్దంలోనే కంచిని వేనోళ్ల ప్రస్తుతించినట్టు 'మహాభాష్యం'నుంచి మనకు తెలుస్తున్నది.



రెండవ ప్రాకారంలో కనిపించే వేయిమంటపాల సభ

## కోర్టుల్లో చిక్కిన కంచి:

కోర్టు భాగోతాలు భారతీయ ఆధ్యాత్మిక కేంద్రాలకు ఎప్పుడూ తప్పలేదేమోనని పిస్తుంది 'కంచి కోర్టు కథ' చదివితే. నేడు రామజన్మభూమి వివాదం కోర్టుకెక్కినట్టే ఒక ప్పుడు శృంగేరీ పీఠాధిపతులు కంచిపీఠం అశాస్త్రీయమని, దాన్ని రద్దుచేసి దానితాలూకు ఆస్తిపాస్తులు, అమ్మవారి నగలు ఇత్యాదుల న్నింటినీ తమ శృంగేరిపీఠం పరంచేయాలని కోర్టుకెక్కారు. ప్రస్తుతం తొంభైఎనిమిది వసంతా లు నింపుకున్న జగద్గురు శ్రీ చంద్రశేఖర సరస్వతి నాడు కేవలం నూనూగు మీసాలు కూడా రాని యువకులు. పన్నెండేళ్లకే పీఠాధి పత్యం పైబడిన శ్రీ చంద్రశేఖరసరస్వతి ఆధ్యాత్మిక, ధార్మిక సాధనలతోపాటు ప్రస్తుత కంచిపీఠాన్ని కంచిలోనే ఉంచేందుకు స్వ యంగా తమ వాదనలను కోర్టువారికి నివే దించి అద్భుతమైన గెలుపు సాధించారు. అదృష్టవశాత్తు ఆనాడు ఈ విషయంలో రాజకీ యాలు తలదూర్చలేదు.

దేశం నలుమూలలా శక్తిపీఠాలను ఏర్పర చాలని ఆదిశంకరులు భావించినప్పుడు న్యా యంగా రామేశ్వరం ఒక పీఠంకావలసివ చ్చేది. కాని, ఆదిశంకరులు కంచిప్రాధాన్యం స్వయంగా ఎరిగిన మహాశివుని అవతారం కావటంవలన కంచినే ఎన్నుకోవటం జరిగింది. ఫలితంగా ఇంతవరకూ కంచిగురించి వివ రించిన ఆధ్యాత్మిక ప్రాశస్త్యంకు మరింత బలం చేకూరింది. కంచిపీఠం వ్యాజ్యంలో హైందవేతర న్యాయమూర్తులే ప్రతిసారి వ్యా జ్యంలో కేసు దర్యాప్తుచేసి న్యాయం శ్రీ చంద్రశే ఖరసరస్వతి వారివైపునే ఉన్నట్టు నిర్ధా రించటం విశేషం.

హైందవేతరులైనప్పటికీ (మహమ్మదీయ మతస్థులైన) న్యాయమూర్తులు, హైందవమత ఆధ్యాత్మికతను అవగాహన చేసుకొని, రామేశ్వ రాన్ని శక్తిపీఠంగా మార్చడానికి ఆదిశంకరులు ఎందుకు వ్యతిరేకించారో చరిత్రపరంగా కూడా విశ్లేషించి తీర్పునివ్వటం ఎంతో హర్షణీయం.

ఇలా ఎన్నో విశేషాలతో ఆధ్యాత్మిక పరిపుష్ఠత సాధించుకొన్న కంచిపట్టణంలో ఏకాంబరేశ్వర, కామాక్షి దేవాలయం అత్యంత పురాతనమైన దని, సుప్రసిద్ధమైనదని చారిత్రక దాఖలాలు వివరిస్తున్నాయి. అయితే, ఇవిగాక శతాధి కంపైన ఉన్న శైవ, వైష్ణవ ఆలయాలు స్వల్ప మైనవేవీ కావు. కాకపోతే వాటన్నింటినీ వర్ణించడం సాహసమే అవుతుంది.

## ఏకాంబరేశ్వర కామాక్షి దేవాలయం:

ప్రస్తుతం జీర్ణావస్థకు చేరిన శ్రీ ఏకాంబరే శ్వర కామాక్షి దేవాలయం పల్లవులకు పూర్వమే నిర్మితమైనట్టు దాఖలాలున్నాయి.

పల్లవులకు పూర్వమే విరచితమైన పెరి యపురాణం, తేవారం, కంచిపురాణం, పీ తాంబర మహాత్మ్యం వంటి గ్రంథాలలో కంచి ఏకాంబరేశ్వర ఆలయప్రస్థావన పెక్కుచోట్ల కనిపిస్తుంది.

అయితే, లభించిన శాసనాలపరంగా చూ స్తే దేవాలయాలలోని అర్థమండపంపై రాసిన శాసనంలో 'పల్లవ తిరయార్' అని స్పష్టంగా కనిపిస్తుంది. తిరయరాజులనుంచి పల్లవరా జులు వారసత్వంగా ఈ దేవాలయ సంరక్షణ భారం స్వీకరించారని ఈ శాసనం స్పష్టంచే స్తోంది.

పల్లవరాజుల్లో నందివర్మను 'తొండైరాజు' అని కూడా వ్యవహరించేవారు. ఏడవశతా బ్దంలో భారతదేశం విచ్చేసిన యువాన్‌చు వాంగ్ పుస్తకంలో తమిళనాడును పల్లవనాడు, ద్రవిడనాడుగా వర్ణించినట్లు విశదమవు తుంది.

తొండైరాజులన్నా పల్లవులన్నా ఒకటేనన్న అభిప్రాయంప్రకారం పల్లవరాజులకాలంలోనే శైవమతం దక్షిణాదిన బాగా అభివృద్ధి చెందిందని తెలుస్తోంది.

చిదంబరంలోని నటరాజ దేవాలయం కూడా పల్లవుల కాలంలో నిర్మితమైనట్టు అక్క డక్కడా చారిత్రక దాఖలాలు కనిపిస్తాయి. అయితే తర్వాతకాలంలో చోళ, పాండ్య, మధుర, నాయక రాజుల హస్తాలలో శైవ,



విష్ణుకంచిలోని వరదరాజ పెరుమాళ్ ప్రధాన దేవాలయం- క్రీ.శ. 630లో మాచేంద్రవర్మ వల్లవులు నిర్మింవచేసిన

వైష్ణవమత ప్రాభవం ఇంకా ఘనంగా వెల సిల్లింది.

ఈ రాజుల కాలంలోనే తెలుగు సాహిత్యం అత్యున్నతస్థితికి చేరి, అక్కడ్నించి తీవ్రమైన పతనాన్ని చవిచూసినట్టు ఆచార్య యస్వీ జోగారావుగారు దక్షిణాంధ్రయుగం వాఙ్మయంపై చేసిన పరిశోధనల్లో సోదాహరణంగా నిరూపించారు.

సరిగ్గా ఈకాలంలోనే శైవవైష్ణవాలు విజృంభించి తీవ్ర హింసకు, కుల వివక్షతకు ఆశ్రయంకల్పించాయి. అంతేగాక అశ్లీల తెలుగు, తమిళ సాహిత్యాలు విజృంభించి సామాన్యుడికి కూడా జుగుప్స కలిగేరీతిలో నీచమైన వర్ణనలతోనిండి, నైతిక విలువల పతనానికి దోహదంచేశాయి. చరిత్రలో ఆధ్యాత్మికేతర కారణాలవలన జరిగిన ఈ ఘోరతప్పిదం హైందవ మతద్వేషానికి ఎన్నో పునాదులు వేసింది. దీనివలన భారతీయ ఆధ్యాత్మిక విలువల విశ్వాంతర్యామిత్వానికే కళంకం ఏర్పడింది. మానవ బలహీనతలు పేట్రేగి విజృంభించినవేళ, ఆ లోపాన్ని ఆధ్యాత్మికతకు అంటకట్టారు అనేకమంది రాజకీయ కుహనా మేధావులు. పర్యవసానంగా భారతీయ చరిత్రలోనే తొలిసారిగా తమిళనాడులో బ్రాహ్మణ ద్వేషం నిండిన నాస్తిక రాజకీయవ్యవస్థ ఏర్పాటైంది. ఈనాడు తమిళనాడు దేవాలయాల స్థితి అధ్వాన్నంగా మారడానికి, పూజాదికాలవలన లభించే అల్పఆదాయవర్గాలైన (ఒకప్పటి ఉన్నత వర్గంగా పేరొందిన తమిళనాడు బ్రాహ్మణులు) బ్రాహ్మణపూజారుల పరిస్థితి దైన్యంగా మారడానికి వెనుకనున్న చారిత్రక రహస్యం ఇదే.

## ఆలయ దైన్యస్థితి:

ఇరవైమూడు ఎకరాల్లో విస్తరించిన ఏకాంబరేశ్వర ఆలయానికి అయిదు ప్రాకారాలున్నాయి. దేవాలయ ప్రాకారానికి నాలుగు ద్వారాలుండగా బాహ్యావరణానికి ఒకే ఒక ప్రముఖ ద్వారం, దానికి బ్రహ్మాండమైన గోపురం ఉన్నాయి. ప్రస్తుతం ఈ ద్వారం జీర్ణమై శిథిలమైఉన్నందున దాన్ని మూసివేసి ప్రాకారు గోడను పగలగొట్టి భక్తులు, యాత్రికులు లోపలికి పోను చిన్న మార్గం ఏర్పరచారు.

ఈ దేవాలయ ప్రాకారంలో గర్భగుడిలోని ప్రాణలింగమైన ఇసుకలింగం కాక, 1008 లింగాలమధ్య ఒక పెద్దలింగంతో చేసిన మండపం, నూటెనిమిది విడివిడి లింగాలుంటాయి. సుమారు అరవైమూడు మహాభక్తుల ఉత్సవమూర్తుల విగ్రహాలను దేవాలయ ప్రాకారంపై శిల్పాలుగా చెక్కారు. వాటి అద్భుతసౌందర్యం నేటి శిథిలావస్థలో కూడా మన మనసునుఇట్టే పట్టేస్తుంది.

గర్భగుడిలో గోపురం సుమారు 192 అడుగుల ఎత్తులో ఉంటుంది. క్రీ.శ. 1509లో శ్రీకృష్ణదేవరాయలు ఈ గోపురాన్ని నిర్మించారు. ఈ విషయాన్ని గోపురం మొదటి అంతస్తులో శాసనరూపంలో మలిచారు. దానిపక్కనే కృష్ణదేవరాయలు పాలిస్తున్న శిల్పచిత్రం మనకు సాక్షాత్కరిస్తుంది.

## వెయ్యి మంటపాల సంప్రదాయం:

అత్యంత సూక్ష్మ కుడ్య శిల్పచిత్రణతో మలిచిన వేయిమంటపాల దేవాలయం సంప్రదాయం చరిత్రలో బహుశా పల్లవులతోనే ప్రారంభమైందనిపిస్తుంది. ముఖ్యంగా రాతినుంచి శిల్పాలను మలచటం పల్లవులకాలంనాటి శిల్పకళ ప్రత్యేకత. అందుకు వేయి మంటపాలే సాక్ష్యం.

## సైన్సుకు అందని మామిడిచెట్టు:

సుమారు అరవై అడుగుల ఎత్తున్న 350 అడుగుల విస్తీర్ణం ఉన్న మామిడిచెట్టు ఒకటి కంచిదేవాలయంలో సుమారు 3,500 సంవత్సరాలనుంచి జీవించి వున్నట్లు కలకత్తా బొటాని



క్రీ.శ. 1400లో చోళరాజులు నిర్మించిన దేవాలయ ప్రాంగణం లోపలివైపునుంచి [illegible]
గోపురం, స్వర్ణగోపురం

కల్ సొసైటీ శాస్త్రజ్ఞులు నిర్ధారించారు. ఈ మామిడిచెట్టుకు నాలుగు రుతువుల్లో కాసే కాయలు నాలుగు రకాలుగా వేరువేరు రుచులతో ఉండటం వృక్ష శాస్త్రజ్ఞులకు నేటికీ అంతు చిక్కని సమస్య. నాలుగురకాల హాతాన్మార్పులు మామిడిచెట్టు జన్యువ్యవస్థలో ఏకకాలంలో సంభవించి, వారసత్వంగా సంక్రమించటం నేటి ఆధునిక జన్యుశాస్త్రానికే ఒక సవాలు అని శాస్త్రవేత్తల అభిప్రాయం. ఈ చెట్టుకింద ఈ మేరకు కలకత్తా బొటానికల్ సొసైటీవారి ప్రకటన బోర్డు కన్పిస్తుంది.

## విష్ణు కంచి వైభవం:

విష్ణుకంచిలోని దేవాలయాలు కూడా శిల్పకళావరంగా ఎంతో వైభవంగా ఉంటాయి. కాని శిధిలావస్థమాత్రమే వాటిని పీడిస్తున్నది. అందరూ సరదాగా చెప్పుకునే వెండిబల్లి, బంగారుబల్లి కూడా ఇక్కడే ఉన్నాయి. శాస్త్రీత్యా చెప్పుకొనే ఈ బల్లులగురించి దేవాలయ ప్రాశస్త్య గ్రంథాలలోనూ, ఆధ్యాత్మిక గ్రంథాలలోనూ ఇటువంటి ప్రస్తావన లేకపోవటం గమనార్హం.

## జగద్గురు చంద్రశేఖర సరస్వతి అద్భుతశక్తిపై పాశ్చాత్యుల పరిశోధన:

కంచి ఆధ్యాత్మిక వైభవంలో దేవాలయాల వంతు సగంమాత్రమే. మిగిలిన సగం శ్రీ చంద్రశేఖర సరస్వతి, వారి ఇద్దరు ప్రధాన శిష్యులైన జయేంద్ర సరస్వతి, విజయేంద్ర సరస్వతిలది.

కంచికామకోటి పీఠపరంపరలో ఈ శతాబ్దానికి మహర్షిగా, బ్రహ్మజ్ఞానిగా పేరునొందిన చంద్రశేఖర సరస్వతి కీర్తి ఆయన యవ్వనంలోనే ప్రపంచం నలుదిశలా వ్యాపించింది. ప్రస్తుతం చంద్రశేఖర సరస్వతిగారికి 95 వసంతాలు.



సుమారు 1907 ప్రాంతంలో పన్నెండేళ్ల ప్రాయంలో తమిళనాడులో ఉన్న విల్లుపురానికి చెందిన బాలుడిని కంచికామకోటి పీఠాధిపతిగా అభిషిక్తుణ్ణిచేశారు. ఆనాటినుంచి ఆయన పేరు చంద్రశేఖర సరస్వతి. కంచికామకోటి పీఠానికి ఆయన అరవైఆరవ పీఠాధిపతి. పీఠాధిపతి అయిన వెనువెంటనే ఆ బాలుడు కావేరితీరానికి వెళ్లి మూడు సంవత్సరాలు కఠోరతపస్సు ఆచరించారు. తర్వాతనే పీఠాధిపత్యం స్వీకరించి దేశం నలువైపులా పర్యటిస్తూ ధర్మప్రచారకర్తవ్యం నిర్వర్తించారు.

ఇన్ని వ్యాపారాల మధ్యలో కూడా కఠోర ఆహార, నిద్ర నియమాలను అవలంభించి ఆయన ఎన్నో సంవత్సరాలు తపస్సుచేశారు. ఆత్మసాక్షాత్కారం, బ్రహ్మజ్ఞానం పరిపూర్ణత్వం సాధించిన శ్రీ చంద్రశేఖర సరస్వతులవారు చిరుప్రాయంనుంచే అనేక అద్భుతాలను ప్రదర్శించినట్టు విదేశీయుల పరిశోధనాగ్రంథాల ఆధారంగా తెలుస్తోంది.

బ్రిటన్‌కు చెందిన శాస్త్రవేత్త, జర్నలిస్టు



కొండరాయినుండి పల్లవుల శిల్పులు మలచిన 7వ శతాబ్దపు రాతిశిల్పాలు

డాక్టర్ పాల్‌బ్రంటన్ భారతదేశంలోని యోగుల ఆధ్యాత్మిక శక్తి ఇతర ఆధ్యాత్మిక సాధకులపై విస్తృత పరిశోధనలు జరిపారు. ఎంతోమంది దొంగసాధువుల బండారం బయటపెట్టిన డాక్టర్ పాల్‌బ్రంటన్‌కు శ్రీ చంద్రశేఖర సరస్వతి ఆధ్యాత్మికశక్తి సరైన సమాధానాన్నిచ్చింది.

'ఎ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా' అనే పుస్తకంలో డాక్టర్ పాల్‌బ్రంటన్ శ్రీ చంద్రశేఖర సరస్వతితో తనకెదురైన అద్భుత అనుభవాలను ఎంతో శాస్త్రీయంగా వివరించారు.

చంద్రశేఖర సరస్వతినుద్దేశించి పాల్‌బ్రంటన్ వ్యక్తపరచిన భావాలు ఆయన మాటల్లోనే చదివితే ఎంతో బాగుంటుంది.

"ఆయన ప్రతిరోజూ క్రమంతప్పకుండా ఇంగ్లీషు దినపత్రికల్ని చదువుతారని మామధ్య జరిగిన సంభాషణలవల్ల నాకు అవగతమైంది. బాహ్యప్రపంచంలోని ప్రస్తుత వ్యవహారాల గురించి క్షుణ్ణంగా ఆయనకు తెలును అని నేను అర్థంచేసుకొని చాలా ఆశ్చర్యపోయాను. యూరపులోని శైశవదశలో ఉన్న ప్రజాస్వామ్య ప్రభుత్వాల మొదలుకొని పాశ్చాత్యదేశాల్లోని అత్యాధునికమైన పరిశోధనలవరకు ఆయన ఎరుగనివేవీ లేవు.

ఏదో అడగాలని ఆలోచిస్తున్న నన్ను ఇంతవరకూ నేను సందర్శించిన యోగులూ, మహాత్ముల గురించి అడిగారు సరస్వతి. అత్యుత్తమమైన యోగసాధకుని సందర్శించగోరుతున్నానని చెప్పాను. పైగా 'మీ మహాత్ములు రుజువుచూపమని అడిగితే రెండుమూడు మాటలు చెప్పి తప్పించుకుంటారు' అని కూడా అన్నాను.

ఆతరువాత ఒకసారి మద్రాసు హొటల్‌లో నిద్రిస్తున్న నాకు అకస్మాత్తుగా మెళకువ వచ్చింది. గదంతా కటికచీకటిగా ఉంది. చుట్టూ ఉన్న వాతావరణం వేడిగా ఉంది. దిండు కింద దాచిన నా రేడియం డయల్‌వాచీ తీసి టైం చూశాను. పావుతక్కువ మూడయ్యింది. నేను కాళ్లుచాచిన దిశవైపు ఏదో మెరిసినట్లనిపించింది. చటుక్కున లేచికూర్చుని పరిశీలించాను. అది చంద్రశేఖర సరస్వతి ఆకృతి. చాలా స్పష్టంగా ఉంది. భూతమో, నీడో, కలో అన్నట్లుగాకాక నేను చూసినప్పటిలాగే మానవాకృతిలోనే ఉంది. ఆయన చుట్టూరా అద్భుతమైన కాంతి ప్రకాశిస్తున్నది. అది చీకటిని వేరుచేస్తున్నట్లు అనిపించింది. నేను పొరబడ్డానా? - అని కళ్లు నులుముకుని చూశాను. అదేరూపం! వెలుగే వెలుగు! స్పష్టంగా నేను ఆయన్ని చూస్తున్నాను. ఆయన చిరునవ్వుతో "వినమ్రుడవై ఉండు - నీవు కోరింది లభిస్తుంది" అని చెప్పారు.

ఎలా వచ్చిందో అలాగే ఆ దృశ్యం అదృశ్యమైపోయింది."

ఇది పాల్‌బ్రంటన్ అనుభవం. ఈ అనుభవం తర్వాత చాలామందికి కలిగింది. వారిలో కీ.శే. తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు ఒకరు.

చంద్రశేఖర సరస్వతి వలన భారతీయ సనాతన ఆధ్యాత్మిక యోగశాస్త్రంపై నమ్మకం కుదిరిన పాల్‌బ్రంటన్, చివరకు ఆయన సలహాపైనే తిరువణ్ణామలైలోని రమణమహర్షి ఆశ్రమాన్ని దర్శించారు చివరికి రమణమహర్షి పట్ల గాఢప్రేమనురక్తుడై ఆయన శిష్యుడిగా మారిపోయారు.

చంద్రశేఖర సరస్వతిగారి అద్భుత మహిమలను గురించి ఇటీవల 'ఆంధ్రప్రభ' మాజీ సంపాదకులు శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారు 'నడిచే దేవుడు' అనే పుస్తకం ప్రచురించారు. వీటిలో చాలామటుకు ఆయన స్వయంగా తన కళ్లతో చూసినవే.

ఈవిధంగా 'కంచి' అత్యంత దర్శనీయమైనప్పటికీ దానికథ ఏనాడో ముగియటం అత్యంత శోచనీయం.

—గిరిజా నారాయణ్

# చతురప్రపంచం

## అనర్థం తెచ్చిన హరితకేశాలు



పాశ్చాత్యులకి ఈమధ్య కొత్తరకం వేలంవెర్రి ముదిరిపోయింది. సామాన్యప్రజానీకం నుంచి బాధ్యతగల అధికారులవరకూ గ్రహాంతర వాసుల ఉనికిని నమ్ముతున్నారువారు. ఏ కొంచెం అనుమానాస్పదంగా కనబడిన వ్యక్తినైనా సరే పట్టుకొని గ్రహాంతరవాసులేమోనని శల్యపరీక్షలు చేసిమరీ వదులుతున్నారు. ఇటువంటి చర్యల ద్వారా తాము నలుగురిలో నవ్వులు పాలవుతున్నా వాళ్లు పెద్దగా పట్టించుకోవడంలేదు.

ఆస్ట్రేలియాకు చెందిన ముప్పైఏళ్ళ వర్జీనియాహడిసన్ అనే అమ్మడివల్ల కూడా వారికి అలాంటి అనుభవమే ఎదురైంది. 1987 సెప్టెంబర్ 8న ఆ మహాతల్లి ఏదో దూరప్రయాణం మీద వంటిరిగా కారులో బయలుదేరింది. మార్గమధ్యంలో కారు చిన్న యాక్సిడెంట్‌కి గురికావడంతో నిర్మానుష్యంగానున్న జాతీయరహదారి మీద ఆమెగారు కాళ్లీడ్చుకుంటూ నడవక తప్పలేదు. అలా రెండు ఫర్లాంగులన్నా నడిచిందో లేదో ఒక పోలీస్ జీప్ ఆదారిన పోతూ ఆమెను చూసి ఠక్కున ఆగింది. ఆమె తల వెంట్రుకలు ఆకుపచ్చరంగులోనూ, ధరించిన దుస్తులు నారింజ రంగులోనూ ఉండడంవల్ల ఆమెను గ్రహాంతరవాసిగా అనుమానించి అరెస్ట్ చేశారు ఘనత వహించిన పోలీసులు. ఆమె ఎంత మొత్తుకున్నా ఫలితం లేకపోయింది. వేరే గ్రహానికి చెందిన ఆడప్రాణిని పట్టుకోగలిగామని గర్వంతో విర్రవీగారా మహానుభావులు. ఆ తర్వాత అసలు విషయం తెలియడంతో హరితకేశాల కారణంగానే తాము ఆమెను అనుమానించామని సారీ చెప్పేశారు.

తనకి జరిగిన పోలీసు సత్కారానికి భయపడిపోయిన వర్జీనియా ఇక ముందు అలాంటి అనుభవాలు పునరావృతం కాకుండా ఉండాలని ప్రస్తుతం విగ్గుపెట్టుకొని తిరుగుతోందట.

ఇంతకీ గ్రహాంతరవాసిగా పోలీసుల్నే భ్రమింపచేసిన ఆమెగారి ఆకుపచ్చని వెంట్రుకలకీ ఒక గమ్మత్తయిన కథ ఉంది. నెరిసిపోతున్న తన తలకట్టును చూసి ఓసారి ఓ డాక్టర్ని సంప్రదించింది వర్జీనియా. దాన్ని అరికట్టడంకోసం ఆయనగారి సలహాపై విటమిన్ 'ఈ' టాబ్లెట్‌లను వాడడం మొదలెట్టింది. అయితే అవి మోతాదు మించి వాడేయడం వల్ల వెంట్రుకలు నల్లబడడానికి బదులు హరితవర్ణానికి తిరిగాయి.

## దుర్యోధనుడికి దండవేస్తే...



దేవుళ్లకీ, దేవతలకీ ఆలయాలుండడం సహజం. అయితే మహాభారతంలోని ప్రతినాయకుడైన దుర్యోధనుడికీ ఒక ఆలయం ఉందనే విషయం చాలా మందికి తెలియదు. మాయోపాయాలతో పాండవుల రాజ్యాన్ని అపహరించి, నిండు సభలో ద్రౌపది వలువలూడ్పించిన ఆ పెద్దమనిషికి కూడా ఆలయం కట్టించి, అర్చించేవారున్నారంటే మనకో పట్టాన నమ్మకం చిక్కదు. కాని ఇది అక్షరసత్యం.

మహారాష్ట్రలోని అహ్మద్‌నగర్‌లో దుర్యోధనాలయం ఉంది. 500 సంవత్సరాలకు పూర్వమే ఆటవిక జాతివాడైన చక్రధరసింగ్ దాన్ని నిర్మించాడని ప్రతీతి. హిమాలయాల సమీపంలోని గారేవాల్ అరణ్యాలలో నివసించే సారంగపాణి జాతివారికతను నాయకుడు. అతడి పర్యవేక్షణలోనే విలక్షణమైన ఆ ఆలయం పూర్తిగా చెక్కలతో నిర్మితమైంది. గుడిలోని దుర్యోధన ప్రతిమ మాత్రం గ్రానైట్ శిలతో శిల్పీకరించారు.

దుర్యోధనుడు సారంగపాణి జాతివాళ్లకి ఆరాధ్య దైవం. తామంతా ఆయన సంతతికి చెందిన వాళ్లమనే భావిస్తారు వాళ్లు. ఆ జాతిలో అవివాహితులైన కన్యలందరూ ఆలయానికి వెళ్లి దుర్యోధన ప్రతిమకు పూలహారాలు వేస్తారు. అంటే వారంతా దుర్యోధనుడ్ని వరించి పెళ్ళాడినట్లే లెక్క అన్నమాట. అలా చేయడం వల్ల భవిష్యత్తులో వారికి యోగ్యుడైన మంచి భర్త లభిస్తాడని వారి విశ్వాసం.

ఏటా జూన్ నెలలో దుర్యోధన సంతృప్తి కోసం ఆ ఆలయంలో వందలాది మేకల తలలు తెగిపడతాయి. వాటి రక్తంతో అభిషిక్తుడవుతాడు దుర్యోధనుడు. ఈ తరహా పూజలవల్ల ఆయన తమని చల్లగా చూసి కాపాడతాడని సారంగపాణి జాతి వాళ్ల నమ్మకం.

## దుందుడుకు దొంగగారు!

అమెరికాలోని పిట్స్‌బర్గ్ నగరానికి చెందిన బ్రోకాగార్డెన్ అనే అతన్ని స్కూటర్ దొంగతనం నేరంకింద కోర్టుకి ఈడ్చుకువచ్చారోనాడు. తీరా కోర్టులో జడ్జిని చూసేసరికి తనుకొట్టేసిన స్కూటర్ ఆమెగారిదేనన్న విషయం తెలియవచ్చిందతనికి. ఇంకేం? తనకు శిక్ష ఖాయమేనని తేలిపోయింది. అయితే అది ఎట్టి పరిస్థితుల్లోను ఏడాదికి మించి ఉండడానికి అవకాశం ఎంతమాత్రం లేదని భరోసా యిచ్చాడతని లాయర్. కాని 'ఇన్‌కా' అనే ఆ మహిళా న్యాయమూర్తి సదరుదొంగగారికి ఒకటి కాదు రెండు కాదు... ఏడేళ్ల ఖైదువిధించింది. దాంతో కోపం పట్టలేక పోయాడు గార్డెన్. వెంటనే మెరుపువేగంతో ఆమె ముందుకిదూకి పదునైనా చాకుని ఆమె కంఠానికి గురిపెట్టి పోలీసుల్ని 'ఖబడ్దార్' అని హెచ్చరించాడు.

తరువాత జడ్జిగారివైపు తిరిగి, ''దురుద్దేశపూరితమైన ఈ తీర్పుని నేను మన్నించను. కేవలం అది నీ స్కూటర్ అయినందువల్లే నాకింత పెద్ద శిక్ష వేశావ్! అవునా?'' అంటూ గద్దించి అడిగాడతను. ఈ హఠాత్పరిణామానికి జడ్జిగారితోసహా అంతా విస్తుబోయారు. కొన్ని క్షణాలపిమ్మట మళ్లీ అతనే- ''నేను ఇక్కడ్నించి తప్పించుకోడానికి అర్జంటుగా ఓకారూ, 5,000 డాలర్ల డబ్బూ కావాలి. వెంటనే సిద్ధంచేయి'' అని కొన్నిడిమాండ్స్‌ని ప్రక




టించాడతను.

తన డిమాండ్స్ నెరవేరేవరకూ అంటే సుమారు 10 గంటలపాటూ ఓపికగా నిరీక్షించాడే తప్ప ఎవరెన్ని రకాలుగా నచ్చచెప్పచూసినా దిగిరాలేదు గార్డెన్. ఎట్టకేలకు అతని కోరికలను అంగీకరించి తప్పించుకుపోయేందుకు అవకాశం కల్పించింది ప్రభుత్వం. అంతే! మళ్లీ పోలీసులెంతప్రయత్నించినా అతన్నింతవరకూ పట్టుకోలేకపోయారు. ఈ సంఘటన నవంబర్ 7, 1988న జరిగింది.

## దంపతులైన తాతామనుమరాళ్లు

పరిచయమైన కొద్దినెలలకే మాక్స్‌ఫోర్డ్‌ని పెళ్లాడి తనవాణ్ణి చేసేసుకుంది ఇరవై రెండేళ్ల షైలా. కాని ఆయన స్వయంగా తన తాతగారేనన్న నిజం తర్వాత తెలుసుకొని బిత్తరపోయిందామె. అసలు కథేమంటే, మాక్స్‌ఫోర్డ్ పదిహేనేళ్ల వయస్సులో తనకంటే ఒక సంవత్సరం పెద్దదైన క్లెయర్ హాకిన్స్‌ని ప్రేమించి పెళ్లాడాడు. అచిరకాలంలోనే క్లెయర్ గర్భవతై ఒక ఆడపిల్లకు జన్మనిచ్చింది. సంసారసుఖానికి ఆ పసిగుడ్డు ఆటంకమౌతుందని భావించి దాన్ని ఓ అనాథశరణాలయంలో వదిలేశారు భార్యాభర్తలు. అక్కడే బెట్టీమాక్స్‌వెల్ పేర పెరిగి పెద్దదైన ఆ పాప పద్నాలుగేళ్లకే ఒకానొక అక్రమ సంబంధం కారణంగా గర్భందాల్చి తనూ ఓ పాపకి తల్లయికూర్చుంది. తర్వాత లోకనిందకు జడిసి ఆ బిడ్డని అదే అనాథాశ్రమంలో వదిలేసి వెళ్లిపోయిందామె. ఆ పిల్లే షైలా న్యూకిర్క్ అనే పేరుతో పెరిగి అప్పటికే భార్యను కోల్పోయి వంటరిగా తిరుగుతున్న మాక్స్‌ఫోర్డ్‌గారి ప్రేమలోపడి పెళ్లాడేసిందాయనను. పెళ్లై ఒక బిడ్డకు జన్మనిచ్చేదాకా ఆ భార్యాభర్తలకే తామిద్దరూ తాతా మనుమరాళ్లమన్న సంగతి తెలియరాలేదు. ఆ విషయమైనా ఎలా తెల్సిందంటే బాల్యమంతా అనాథశరణాలయంలో గడపడం వల్ల తన తల్లిదండ్రులెవరో తెలుసుకోవాలనే కోరిక షైలాకు ఓ రోజు కలిగింది. వెంటనే ఆ శరణాలయానికి వెళ్ళి కెయిత్ హార్వెల్ అనే అక్కడి గుమాస్తాగారి సహకారంతో రికార్డులన్నీ తిరగేసి తన తల్లి చిరునామా సంపాదించింది. దాని ప్రకారం బెట్టీ ఇంటిని వెదుక్కుంటూ ఎట్టకేలకు చేరుకోగలిగిందది. తల్లీకూతుళ్లు ఒకరినొకరు పరిచయం చేసుకొని పొంగిపోయారు. కూతురి స్ఫూర్తితో తనూ అదే శరణాలయంలో పెరి



గింది కావడం వల్ల బెట్టీ కూడా తన జన్మకు కారకులెవ్వరో తెలుసుకోగోరింది. ఆ కారణంగా ఇద్దరూ మళ్లీ అనాధశరణాలయానికి వెళ్లి పాతరికార్డులన్నీ తిరగవేయించగా బెట్టీ తల్లి పేరు క్లెయర్‌హాకిన్స్ అని, తండ్రి పేరు మాక్స్ ఫోర్డ్ అని తెల్సిపోయింది. అప్పుడుగాని షైలా కి అసలు సత్యం బోధపడలేదు.

షైలా మాక్స్‌ఫోర్డ్‌ల విషయం తెల్సుకొని ఇరుగుపొరుగులు నూటీపోటీ మాటలతో వేధించసాగారు. వావివరుసలు లేని వారి దాంపత్యాన్ని రద్దు చేసేసుకొని పుట్టిన బిడ్డను ఏ అనాధాశ్రమంలోనో వదిలేయమని సలహా చెప్పారు. కాని ఆ దంపతులు అందుకు అంగీకరించలేదు. ఎవరేమనుకున్నానరే తమ బిడ్డను అనాధను చేసేది లేదని అటువంటి తొందరపాటు చర్యలవల్లే ఇటువంటి దుష్పరిణామాలు జరుగుతాయని నొక్కిచెబుతూ అందర్నీ ఒప్పించగల్గారు. ఈ వింత సంఘటన న్యూజిలాండ్ దేశంలోని ఆక్‌లాండ్ నగరంలో జరిగింది.

## పావురాల పాటకచేరి

సినీ నేపథ్యగాయకులైన బాలు, జానకిల వంటివారి 'మ్యూజికల్ నైట్స్' అంటే మనలో చాలామంది చెవి కోసుకుంటారు. కాని థాయిలెండ్, ఇండోనేషియా, సింగపూర్‌వంటి దేశాలలో పక్షుల పాటకచేరీలకి ఆదరణ హెచ్చుగా లభిస్తోంది. ముఖ్యంగా పావురాల పాటకచేరీలంటే అక్కడి ప్రజలు విపరీతమైన క్రేజు చూపుతున్నారు.

పావురాలకి సంగీతంలో పరిపూర్ణ శిక్షణని చేెందుకు సుమారు 6 నుంచి 9 నెలలకాలం పడుతుంది. శిక్షణ ఇచ్చినందుకుగాను సుమారు 2 లక్షల రూపాయలదాకా పుచ్చుకుంటారు ట్రెయినర్లు. సంగీతంలో సుశిక్షితురాలైన ప్రతి పావురమూ 30 లక్షలవరకూ ధర పలుకుతుంది. అయితే వీటిద్వారా వచ్చే ఆదాయమూ భారీగానే ఉంటుంది. టి.వి.లో పదినిముషాల ప్రోగ్రాంకి లక్షలరూపాయలు కురిపిస్తారు స్పాన్సర్లు.

పావురాల మ్యూజికల్ నైట్స్‌లో కూడా వివిధ




రకాల వాద్యసమ్మేళనం తప్పనిసరిగా ఉంటుంది. మూడ్ కనుక వచ్చిందంటే అవి నిద్రాహారాలుమాని పాటలు పాడేస్తాయి. చాలా మంది ప్రఖ్యాతులైన పాశ్చాత్య పాప్‌కళాకారుల కంఠాల్నికూడా అనుకరించి శ్రోతల్ని రంజింపచేస్తాయవి. అందుకే వాటి పాటలంటే ఆ దేశాల్లోని కుర్రకారు ఉర్రూతలూగుతారు. వీటికున్న క్రేజును దృష్టిలో పెట్టుకొని టి.వి.ప్రోగ్రాములు, స్టేజీ ప్రదర్శనలద్వారానే కాక గ్రామఫోన్ రికార్డులు, కాసెట్లుకూడా తయారుచేసి డబ్బు దండుకోవాలని రికార్డింగ్ కంపెనీల యజమానులు భావిస్తున్నారిప్పుడు.

## మొగుళ్లను మార్చేహాబీ!

మార్కెట్‌లో వంకాయల్ని మార్చి దొండకాయలు, దొండకాయల్ని మార్చి పొట్లకాయలు కొనుక్కున్నంత తేలికగా డబ్బు కోసం మొగుళ్లను మార్చేస్తుంటుంది నలభయ్యారేళ్ల మార్గరేట్. "జీవితాన్ని కడఅంచులవరకూ కరువుతీరా అనుభవించాలంటే డబ్బే కావాలి. మొగుడెవరైతేనేం? మగవాడైతే చాలు గదా? అని చెప్పే ఆమె పెళ్లిని ఏనాడూ గౌరవప్రదమైన ఓ సాంఘిక కట్టుబాటుగా అంగీకరించదు. పేకముక్కల్ని మార్చినంత సునాయాసంగా ఇప్పటివరకూ ఎనిమిది మంది మొగుళ్లని మార్చి 12 లక్షల పౌండ్లు కూడబెట్టిందా వయ్యారి ప్రౌఢ.

అమెరికాలోని కన్‌సాస్‌కు చెందిన మార్గరేట్ గ్రీన్‌హామ్ మొట్టమొదటిసారిగా తన పదహారవ ఏట, 40 ఏళ్ల రాబ్‌ని వివాహమాడింది. కొద్దికాలానికే ఆయనగారు యాక్సిడెంట్‌లో కన్నుమూయడంతో మాల్కమ్‌ని చేసుకొన్నదామె. దురదృష్టవశాత్తూ అతనూ యాక్సిడెంట్‌లోనే మరణించాడు. అప్పటికి ఆమె వయస్సు పందొమ్మిదేళ్లే!

అప్పటినుంచీ డబ్బుపిచ్చి పట్టుకుందామెకు. ధనవంతులైన మగాళ్లకి గాలం వేసి పెళ్లాడ్డం, నాల్గు రోజుల తర్వాత వారిదగ్గర ఎంతో కొంత పెద్దమొత్తంలో డబ్బు గుంజుకుని తన్ని తగిలేయడం మొదలెట్టిందామె. ఆమె మూడో భర్త బిల్లీ, భార్య నతాయింపు భరించలేక ఓ చక్కటి పిల్లని వెంటబెట్టుకొని ఆస్ట్రేలియాకు పారిపోయాడు. తర్వాత నాలుగో భర్తగా నోవన్ రంగప్రవేశం చేశాడు. అతడు కొంచెం వెర్రి వెంగళాయనే చెప్పాలి. ఆమె వలలో పడ్డ తమ బిడ్డ నున్నగా క్షవరమైపోతాడని గ్రహించిన అతని తల్లిదండ్రులు ముందే జాగ్రత్తపడి ఈ కోడలికి కొంత ముట్టచెప్పి సాగనంపేశారు. అప్పుడు అయిదో భర్తగా మిఖాయెల్ విచ్చేశాడు. కొద్ది కాలానికే వారిద్దరికి పొసగకపోవడంతో విడాకులు పుచ్చుకున్నారు.



అయితే రెండేళ్ల తర్వాత మళ్లీ అతన్నే పెళ్లాడింది మార్గరేట్. రెండోసారికూడా వారి బంధం గట్టిగా ముడిపడకపోవడంతో మళ్లీ విడిపోవల్సివచ్చింది. అప్పుడు డెరిక్ అనే అందగాడ్ని పెళ్ళాడింది మార్గరేట్. అయితే ఏం జరిగిందో కాని సెలూన్‌కి వెళ్లి వస్తానని చెప్పిన మనిషి ఓ రోజు పత్తా లేకుండా పోయాడు. తిరిగి ఇంతవరకూ రానేలేదు. ప్రస్తుతం సిరిల్‌ని పెళ్లాడి అతనితో కాపురం చేస్తోంది మార్గరేట్. త్వరలోనే అతనికీ ఆమె ఉద్వాసన చెప్పడం ఖాయమని ఇరుగుపొరుగులు చెవులు కొరుక్కుంటున్నారు.

ఇప్పటివరకూ 30 సార్లు గర్భందాల్చిన మార్గరేట్ కేవలం ముగ్గురు పిల్లల్ని మాత్రమే కన్నది. పెద్ద కొడుకు, కూతురు ఆమె దగ్గరకి ఎప్పుడోగాని రారు. చిన్నకూతురు డయానా మాత్రం ప్రస్తుతం తల్లితోనే ఉంటోంది. తల్లి ప్రవర్తన అర్థమైతే ఆమెకూడా తమ దగ్గరకే వచ్చేస్తుందని ఖరాఖండిగా చెబుతున్నారు మార్గరేట్ పెద్దకొడుకూ కూతురూ.

## రికార్డుకెక్కిన వ్యాపారి

మహారాష్ట్రకు చెందిన ప్రభాకర్ మాల్యాంకర్ అందరు వ్యాపారువేత్తల వంటివాడుకాదు. రెట్టింపులాభాలు గుంజి కోటీశ్వరుడవ్వాలనే కాంక్షకన్నా గొప్పపని ఏదైనా చేసి ప్రఖ్యాతి పొందాలన్నదే అతని ధ్యేయం. అందుకోసం 48,000 పైగా రకరకాల వ్యక్తుల విజిటింగ్ కార్డుల్ని సేకరించి గిన్నిస్ బుక్‌లోకి ఎక్కాడతను. 1978లో ఏదో సందర్భంగా ఓ ఫ్రెండ్‌ని కలిశాడు ప్రభాకర్. ఆ సమయంలో ఆ స్నేహితుడు తన డైరీలోని పనికిరాని చెత్త కాగితాల్ని తీసిపారేసే పనిలో ఉన్నాడు. ఆ సందర్భంలో ఓ విజిటింగ్ కార్డు చెత్తలోకి వెళ్లిపోతుండడం చూసి అదేదో చూద్దామని కుతూహలంగా చేతిలోకి తీసుకున్నాడు ప్రభాకర్. అది మన తొలిరాష్ట్రపతి బాబూరాజేంద్రప్రసాద్‌గారి విజిటింగ్ కార్డు. చాలాకాలం క్రితమే అదెవరి ద్వారానో ఆ ఫ్రెండ్‌కి చేరిందట. ఆ క్షణం నుంచే విజిటింగ్ కార్డులు సేకరించాలనే

తలంపు కలిగింది ప్రభాకర్‌కి.

ఈరోజున ప్రభాకర్ వద్ద ఉన్నన్ని విజిటింగ్ కార్డులు ప్రపంచంలో మరే వ్యక్తి దగ్గరా లేవంటే అది అతిశయోక్తికాదు. మార్గరేట్ థాచర్, డాన్‌బ్రాడ్‌మెన్, మార్టినానవ్రతిలోవా, అమృతాప్రీతమ్, మైఖేల్‌జాన్సన్, హాజీ మస్తాన్, పి.టి. ఉష... ఇలా ఒకరని ఏమిటి? వివిధ రంగాలలో ప్రముఖులైన ఎందరెందరో వ్యక్తుల విజిటింగ్ కార్డులు అతని దగ్గర మనం చూడవచ్చు. మరో విషయం ఏమంటే ప్రపంచంలోని అన్ని నగరాలకు చెందిన మేయర్ల విజిటింగ్ కార్డులు పోగు చేసిన

పర్యటించిన ప్రతినగరం తాలూకు టెలిఫోన్ డైరక్టరీని అతడు సేకరిస్తుంటాడు. అలా అతని వద్ద ప్రస్తుతం 150 డైరెక్టరీల దాకా పోగుపడి ఉన్నాయి. ఇంకా నాణాలు, కరెన్సీ నోట్లు సేకరించే అలవాటు కూడా ఉందతనికి. మరో విచిత్రం ఏమంటే వ్యాపారవరమైన కారణాల వల్ల అతను దేశమంతా తిరుగుతుంటాడు. ఆ సందర్భంగా దేశంలోని అన్ని పెద్ద నగరాలు, పట్టణాలు అతనికి చిరపరిచితమే. సినిమాలు ఎక్కువగా చూసే అలవాటుండడంతో ప్రభాకర్ ఆయా నగరాలలోని సినిమా హాళ్లన్నింటిలోనూ ఎన్నో సిన్మాలు చూశాడు.




ఘనత కూడా అతనికే దక్కింది. న్యూస్‌పేపర్లలో ప్రముఖుల చిరునామాలు వెదకి వారికి ఉత్తరాలు రాసి మరీ తెప్పించుకుంటాడు ప్రభాకర్. ఆ రకంగా ఒకే వ్యక్తికి అనేకసార్లు ఉత్తరాలు రాసిన సందర్భాలు కూడా ఉన్నాయట. ఈ కారణంగా నెలకు 300 రూపాయలకు పైగా పోస్టేజికే అతనికి ఖర్చవుతోంది. అవసరాన్ని బట్టి కొందరు వ్యక్తుల్ని వ్యక్తిగతంగా కల్సుకొని కూడా విజిటింగ్ కార్డులు సంపాదిస్తుంటాడు ప్రభాకర్.

విజిటింగ్ కార్డుల సేకరణతోపాటు ప్రభాకర్‌కి మరి కొన్ని హాబీలు కూడా ఉన్నాయి. తను

ఆయా థియేటర్ల తాలూకు కౌంటర్ ఫాయిల్సు కూడా భద్రంగా ఉంచాడతను. ప్రస్తుతం అతనివద్ద దేశంలోని అన్ని పెద్ద థియేటర్లకు సంబంధించిన కౌంటర్ ఫాయిల్సు ఉన్నాయి.

ప్రభాకర్ ఇంట ఆరు బీరువాల నిండుగా అతడు సేకరించిన అపురూప కలెక్షన్‌లున్నాయి. వాటి విలువ ఆరు లక్షల రూపాయల దాకా ఉంటుందనే ప్రభాకర్ ప్రధానంగా మామిడికాయల ఎగుమతి వ్యాపారం చేస్తుంటాడు.



## భర్తను చంపిన వాడితోనే పెళ్లి

పట్టుమని పదహారేళ్లన్నా నిండని అమ్మాయి తొంభై ఏళ్ల వయోవృద్ధుణ్ణి ప్రేమించి పెళ్లాడిన సంఘటనలు మనకెన్నో తెలుసు. చాలా వికారంగా ఉండే అమ్మాయిని ఓ హాండ్సమ్‌గై ఏరికోరి పాణిగ్రహణం చేసినటువంటి సంగతుల్ని గురించీ వినే ఉన్నాం. కాని తన భర్తని, సొంత చెల్లెల్ని దారుణంగా చంపిన హంతకుణ్ణి పెళ్లాడిన నారీ మణి గురించి మాత్రం ఎవ్వరూ విని ఉండరు.




ఆ హంతకుణ్ణి పెళ్లాడతానన్నప్పుడు 42 ఏళ్ల మోరిన్ వైట్‌కు ఇంటా బయటా తీవ్రమైన ప్రతిఘటన ఎదురైంది. ఆమెకు పిచ్చెక్కిందేమోనన్న అనుమానాన్ని కూడా వ్యక్తం చేశారు కొందరు. ఏమైనా మోరిన్ వెనకడుగు వేయలేదు. లండన్ జైలు ఆవరణలో 1988 మే 8న తను కోరుకున్నవాణ్ణి కొంగున ముడివేసుకుందామె.

1984లో జాన్ ఛార్లెస్ అనే నలభై అయిదేళ్ల పెద్దమనిషి మాటా మాటా వచ్చి మోరిన్ వైట్ భర్తను, ఆమె చెల్లెల్నీ ఘోరంగా హత్య చేశాడు. కోర్టువారతనికి యావజ్జీవఖైదు విధించారు. అయితే చేసిన పొరపాటుకు ఛార్లెస్ తనలోతానే కుమిలిపోసాగాడు. "మీకు చేసిన ద్రోహానికి క్షమించండి" అంటూ తన పశ్చాత్తాపాన్ని వ్యక్తం చేస్తూ జైలునుంచే మోరిన్‌వైట్‌కు ఉత్తరాలు రాయడం మొదలెట్టాడతను. మోరిన్ నుంచి జవాబు రాకున్నా అతడు తన ఉత్తరాలు ఆపలేదు. వాటిలో తన ఆవేదనని ఆక్రోశాన్ని వెల్లడించడం మానలేదు. క్రమేణా మోరిన్‌కు అతని హృదయం అర్థమైంది. అతన్ని ఊరడిస్తూ తనూ ఉత్తరాలు రాయడం ప్రారంభించింది. ఆ రకంగా ఆ ఉత్తరాయణం ఒకరి మనసులు ఒకరికి ఇచ్చిపుచ్చుకునేంత వరకూ దారి తీసింది. తరువాతి కథ మనకి తెల్సిందే కదా!

"జాన్ మంచివాడే... దురదృష్టం అతన్ని కటకటాలపాలు చేసింది... ఎలా గైతేనేం ఓ హంతకుణ్ణి మనిషిగా మార్చి నాకు అండగా మలచుకున్నాను" అంటూ తృప్తిగా చెబుతోంది మోరిన్‌వైట్.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.

